

సంపుటము 21
సంచిక 9

భారతి

తారణ, భాద్రపదము
1944 సెప్టెంబరు

# విశ్వసంగీతము

= శ్రీ రా. వేం. మ. గం. రామారావు =

●

ఆరిపోయిన దీపము లారిపోవ,
వెలుగు దీపము లంతట వెలుగుచుండు;
చచ్చిపోయినవారలు చచ్చిపోవ,
పుట్టువారలు లక్షలు పుట్టినారు.

భవ్యకాశ్మీర నగరాజ పంక్తియందు
సూర్యకిరణాల వేసంగి సొలసి కరగి
హిమము సెలయేళ్ల హోరున నేడ్చుచుండ
పకపకా నవ్వె పువ్వుల వరుస లచట.

శిఖరికాంతలు మేఘాల చీర కప్పి,
ముసుగు సిగ్గుల పగలెల్ల మురిసినారు;
రాత్రిసమయాన విరహాన క్రాగిపోయి,
పండువెన్నెల వస్త్రాల వదలి పడిరి.

వెలికిలగ సోలిపడియుండు వీరిపొలుపు,
వీగు ఘనకుచ శిఖరాల పెంపు నొందు;
దాని చూచియె కాబోలు తార లంత
కన్నుగీటుల నేమేమొ కబురులాడె.

కురియు వర్షము కురిసెను కుంభవృష్టి;
కాయు నెండయు కాసెను కాఁక ఎండ;
వీచు వాయువు వీచెను వెఱ్ఱిగాలి;
పాడుకొనువార లేదేదొ పాడుకొనిరి.

---

# ఆంధ్రదేశ్యము - అన్యదేశ్యము

*

= శ్రీ కోరాడ రామకృష్ణయ్య =

( అనువృత్తము )

ఇక దేశ్యములను గూర్చి విచారింతము. సంస్కృత భాషను సంబంధించినది గాని, దానినుండి నిష్పన్నమైనది గాని కాక దేశీయవ్యవహారములో నుండి ప్రాకృతభాషలలోనికి జొచ్చిన శబ్దజాలము దేశి యని చెప్పబడుచున్నది. ఇట్టి దేశీయశబ్దజాలమును హేమచంద్రాదులు 'దేశినామమాల' లను పట్టికలలో జూపినారు. హేమచంద్రుని యీ పట్టికను బరిశీలించినచో ననేకములు తద్భవశబ్దములుం గూడ నందు చేరినట్లు కనబడుచున్నది. (ణందినీ, గండీవం, మేఘచ్ఛీరం, ధూమద్ధారం మొదలగునవి దేశి శబ్దజాలములో చేరినవి.) కాని దేశీయములగు అనార్య భాషాశబ్దములును పెక్కు గలవు. అందు ద్రావిడభాషాశబ్దములును గొన్ని లేకపోలేదు. ఉదా: ఊరు ( ఊరో గ్రామః ); ఛాణం, ఛాణీ=గోమయ ( cf. త. శాణి ); ఛిల్లం=ఛిద్రం ( cf తె. చిల్లి ); పసండి = కనకం (cf తె. పసిండి ); దారో=కటిసూత్రం (cf. తె. దారము); మాడిఅం=గృహం (cf. తె. మేడ, క. మాడి, త. మాడం); మడో=కంఠః (cf. తె.మెడ) ; ఖడ్డ = శ్మశ్రు (cf. తె. గడ్డము, క. గడ్డ) ; చిచ్చి=హుతాశనః (cf. తె.చిచ్చు, క. కిచ్చు); ణేసరో=రవిః (cf. క. నేసర్, త.ఞాయిఱ్); తలారో = నగర రక్షకః ( cf. తె. తలారి, త. తలెయారి)

దేశీయములగు నితరానార్య భాషాశబ్దములును గొన్ని వీనిలో జేరియుండును. కాని ఆంధ్రదేశ్యములు కూడ కొన్ని యీ ప్రాకృతలాక్షణికుల 'దేశి' లో జేరియుండుటయే విశేషము.

ప్రాకృత వైయాకరణుల ననుకరించుట వల్లనే తెలుగు లాక్షణికులును తెలుగుభాషకు తత్సమ తద్భవము లనియేకాక, దేశ్య మను విభాగమునుగూడ గల్పించినారు. మూలభాష సహజముగ దేశ్యమే యైనపుడు మరల దేశ్యవిభాగ మనున దెందుకు? ఇంతే కాక వీరీ దేశ్యమున ఆంధ్రదేశ్యము, అన్యదేశ్యము అను మరియొక విభాగమునుగూడ చేసినారు. ఆంధ్రదేశ్యమే అచ్చతెనుగనియు జెప్పబడుచున్నది. ఇది ఆంధ్రదేశపురస్థాయులైన సకలజనులకు సులభముగ దెలిసెడి శబ్దజాలము. 'విన్నవారికిన్ మనమున దేటగా దెలియు మాటల యచ్చతెనుంగునా జనున్' అని పెద్దన. ఇక దేశ్యలక్షణము—

"శ్రేయములై బహుదేశా
శ్రేయములై చక్కదనము నెఱదనములునై
యాయా నెలవులఁ జెవులకు
దీయము' లగు పలుకులెల్ల దేశ్యము లరయన్."
"కేవల యాంధ్రులు నానా
దేశంబులయందు నిలిచి తెలుగులె తత్త
ద్దేశోక్తు లంట బలికిన
నాశబ్దము లన్యదేశజాంధ్రము లయ్యెన్."

(అప్పకవి)

అనగా నాయా దేశభాగములయం దాంధ్రుల వాడుకలో వెలసిన శబ్దము లన్నమాట. వీనిని మాండలికశబ్దము (Provincialisms) లనియు చెప్పవచ్చును. ఇట్టి శబ్దము లాయా ప్రాంతములందలి కవులు వారి గ్రంథములలో బ్రయోగించినచో, నా గ్రంథవ్యాప్తిని బట్టి ఇతర కవుల గ్రంథములలోని కెక్కి క్రమముగ దేశమునం దంతటను వ్యాప్తి గాంచును. అట్టివి నిత్యవ్యవహారప్రసిద్ధికంటె వాఙ్మయప్రసిద్ధి విశేషముగా గలవై ( Literary forms ) యుండును. ఎట్లైనను ఆంధ్ర భాషలోని ఆంధ్ర దేశ్యమునకు గల ప్రాచుర్యము, సహజత్వము ప్రాకృతభాషలోని 'దేశ్యము'నకుండవు గదా. ఎందుచేత ననగా, నీ భాషలో తత్సమ, తద్భవశబ్దజాల మెరువుసొమ్మయినట్లే ఆభాషలలో నీ

‘దేశి’ శబ్దజాలమును ఎరువు సొమ్మే. భాషకు ప్రాణమనదగిన వాక్యనిర్మాణపద్ధతులు, వ్యాకరణ సంప్రదాయములు నీభాషకు ‘దేశ్యము’ అను భాగములోనే స్వతంత్రము లైయుండగా, ప్రాకృత భాషలకు ‘తద్భవ’ భాగములో సంస్కృత మూలములై యున్నవి. కావుననే తెలుగుభాష ప్రాకృతభాషల వలె తన జీవికకు సంస్కృతముపై నాధారపడి యుండ నావశ్యకత లేదు. దీనినిబట్టియే ప్రాకృతము లార్య భాషాజన్యములు, ఆంధ్ర మనార్య మను స్వతంత్రభాష యని చెప్పుట కవకాశము కలుగుచున్నది. కాని దీనికి సంస్కృత ప్రాకృతములతో గలిగిన చిరకాల సంబంధముచే వానితో గాఢసమ్మేళనమును బొంది శరీరపుష్టిని, రసపుష్టిని గాంచుటను బట్టి సంస్కృత భాషాభిమానులగు వైయాకరణు లీ తెనుగునుగూడ ప్రాకృతములవలెనే సంస్కృతజన్యమని, తద్వికృతి యని తలంపసాగిరి. కాని వా రీ భాషను తత్సమ తద్భవ దేశ్య విభాగముచేసి వాని కుదాహరణములుగా శబ్దముల నిచ్చిరే గాని వాక్యముల నిచ్చియుండకపోవుటయే గాక ఇందలి భాషారూపములనుగాని, విభక్తులనుగాని సంస్కృతప్రాకృతములనుండి నిష్పన్నమైనవని సాధింప యత్నింపనైన లేదు గదా! అది సాధ్యమగునదియు గాదు. కావుననే ఆంధ్ర మార్య భాషాజన్యము కాక, భిన్నకుటుంబమునకు జెందిన దగుచున్నది. ఇందలి విభక్త్యాదులు, వ్యాకరణప్రక్రియ దక్షిణదేశభాషాలక్షణమును బోలిన వగుటచే నిది దక్షిణ దేశభాషా కుటుంబమునకు జేరినదని నిశ్చయింపవలసియున్నది. ఇట్లీ భాష దేశియమే యగుటచే మరల దేశివిభాగమున కావశ్యకత లేదు.

ఆంధ్ర మార్యభాషాజన్యము కాక దక్షిణ దేశ భాషలతో సాజాత్యము కలిగినదన్నపుడు, ఈ భాషకు సహజ మనదగిన యీ ‘దేశ్యము’ తక్కిన దక్షిణ దేశ భాషలతో సంబంధించినదై యుండవలయును గదా. ఈదేశ్యము, లేదా అచ్చ తెనుగనునది సంస్కృత సమ, సంస్కృత భవ భిన్నం బని వైయాకరణులు చెప్పినపుడే దీని నిష్పత్తిని గూర్చి సంస్కృత మెట్టి సహాయము చేయలేదని వారు చెప్పిన ట్లయినది. కావున సన్నిహితములగు దక్షిణదేశ భాషలతో బోల్చి చూచుటచేతనే దీని (దేశ్యముయొక్క) లక్షణమును, చరిత్రను మనము కనిపెట్టవలసియున్నది.

ఎల్లవారికి దేటతెల్లముగా దెలిపెడి పలుకులు అని కేతన పెద్దన లిచ్చిన శబ్దములు, వాని కితర ద్రావిడ భాషలతో గల సంబంధమును గూర్చి పరిశీలింతము.

“తల నెల వేసవి గుడి మడి
పులి చలి మడు గూరు పేరు బూరుగు మగవా
డలుక...” (అని కేతన.)

తల—త. తలై; క. తలె; మళ. తల.

నెల—త. నిలావు (Moon).

వేసవి— క. బేసగె (బిసు = వేడి); త. వేనిల్.

పులి— త, మళ. పులి; క. పులి; తు. పిలి.

చలి— క. చళి, సళి; (కులిర్) తుళు. చలి, చళి.

మడుగు— క. మడు, మడువు; త. మడు.

ఊరు — త, మ, క. ఊర్; తు. ఊరు.

పేరు—త, మ. పెయర్, పేర్; క. పెసర్, హెసరు; తు. పుదర్.

మగవాడు—త. మగన్ (son); క. మగ (a son) a male.

బూరుగు—క. బూరుగ, బూరుగె (=a silk cotton tree); త. పూళై.

అలుక—క. అలుగు (=to be agitated, shake); త. అలంగు.

ఇక పెద్దన అచ్చ తెనుగు శబ్దములు :—

ఎనుములు—క. ఎమ్మె; త. ఎరుమై; మళ. ఎరుమె; తు. ఎర్మె.

గుఱ్ఱములు—త. కుదిరై; క, తు. కుదిరె.

పండులు—క. పణ్ణు, హణ్ణు; త, మ. పఴమ్.

బండులు—త. వండి.

ఉప్పు—త, మ, క, తు. ఉప్పు.

పప్పు—త, మ. పరుప్పు.

ఆకు—క. ఆకు ( **cf.** అగె = **a seedling, a sprout**).

నేయి—క. నెయ్; త. నెయ్. ( **Fat, grease** ) ( స్నేహ ? )

నూనె—(నూవు + నెయ్) **cf.** త. ఎళ్ + నెయ్=ఎణ్ణె.

పాలు—త, క, మ. పాల్.

తోలు—త, క. ఉరల్-తోలు.

అప్పకవి ఆంధ్రదేశ్య మని చెప్పినదాని కుదాహరణముగా పాలు, నేయి, పెరుగు, తోలు, ఉట్టి మొదలగువానిని ఇచ్చియున్నాడు. ఈ ఆంధ్ర దేశ్య మని అప్పకవి చెప్పినదానినే కేతన పెద్దన అచ్చతెనుంగని చెప్పినారు. వీరు దేశ్య మని వ్యవహరించినదానినే అప్పకవి అన్యదేశ్య మన్నాడు. కేతన దేశ్యమునకు ప్రత్యేక లక్షణము చెప్పకయే "ఎలుకువ సెత్తమ్మి" ఇత్యాది శబ్దముల నుదాహరించినాడు. కాని పెద్దన లక్షణముకూడ నిట్లు చెప్పియున్నాడు.

"శ్రేయములై బహుదేశా
శ్రయములై చక్కదనము నెఱదనములునై
యాయాసెలవుల జెవులకు
దీయములగు పలుకు లెల్ల దేశ్యము లరయన్."

దీనినే అప్పకవి యనువదించినాడు.

"కేవల యాంధ్రులె నానా
దేశంబులయందు నిలిచి తెలుగులె తత్త
ద్దేశోక్తు లంటబలికిన
వాశబ్దము లన్యదేశజాంధ్రము లయ్యెన్."

"బహుదేశాశ్రయములైనవి" గాని, అనగా ఇతర దేశములనుండి వచ్చి యీ భాషలో జేరినవి గాని, ఆంధ్రులే యితర దేశములందు నిలిచి తెలుగులే తత్తద్దేశోక్తు లంటబలికిన పలుకులుగాని అన్యదేశ్యము లగునని తెలియుచున్నది. కాని లాక్షణికు లుదాహరించిన శబ్దములనుబట్టి యివి యెట్లన్యదేశ్యము లవదగునో, అనగా నేయే దేశభాగములలోనివో ఇప్పుడు గ్రహించుట యంత సులభసాధ్యముగా గనబడదు. వీనిలో పెక్కు కావ్యభాషయందే విశేషముగా గనంబడుటనుబట్టి పైదెలుపబడిన అచ్చదెనుగుశబ్దముల వలె నంత విశేషముగా నిత్యవ్యవహారములోనుండి యందరికి సులభముగ దేటపడియెడు మాటలు కావని మాత్రము చెప్పవచ్చును. ఇవి యిప్పుడు హైదరాబాదు, బళ్లారి, బరంపురము, మద్రాసు మొదలగు ప్రాంతములందు నివసించువారు తత్తద్దేశోక్తు లంట బలుకుచుండిన పలుకుల రీతినే ఆకాలమున నానాదేశములందు నిలిచిన యాంధ్రుల వ్యవహారములోని మాటలై యుండును. అనగా నాకాలపు ప్రాంతీయాంధ్ర శబ్దము (**Provincialisms**) లని తలంపవలసి యున్నది. కాని వీనిలో పెక్కు శబ్దములు సమాస పదములుగను, గ్రంథస్థములుగు కావ్యభాషా సామాన్యములుగనే యుండుటనుబట్టి నిత్యవ్యవహారములోనివి గాని గ్రాంథికభాషారూపములనే వీ రిట్లు గ్రహించిరా యనియు సందేహింపవలసియున్నది.

"ఎలుకువ, సెత్తమ్మి, ఎరగలి, ఎసకంబు
నొసలింతి, లేటి వెక్కసము, నెమ్మి
ముక్కన, చెచ్చెర, మచ్చిక, పొచ్చెము
కడిమ, యేడ్తెర, లగ్గు, కలవలంబు
... ... ... ...
ఎల్లికొఱలుంట, పీచోపు, లల్ల మువిద
వీఁకకాజెయ, గ్రద్దలు, వేఁట, గ్రేణి
కౌను పాలిండ్లు లాగి మొగిగనయమిట్టి
తెలుగుపలుకులు ధర దేశితెనుగు లయ్యె"

(ఆం. భా. భూ.)

వీనిలో 'గ్రద్ద' శబ్దము గృధ్రశబ్దభవ మను తలంపుతో కోశకారులు దీనిని తద్భవ మని చెప్పుట కలదుగాని తమిళమునందలి 'కఱు-కఱుద్దై' అనుదానికి సంబంధించిన దని తలంచినచో నిదియు దేశ్యమే కావచ్చును. ఇట్లు పైపద్యమున కేతన తెలిపిన శబ్దము లన్నియు దేశ్యములే యగునుగాని యేయేదేశభాగము నుండి వచ్చినవో చెప్పుట కవకాశము చాలదు. అందు పెక్కు శబ్దములు కావ్యభాషాప్రాచుర్యముమాత్రము కలవని చెప్పవచ్చు. ఇక తెమ్మెర, లేమావి, క్రొన్నన, కేలుదు, వాలుగంటి, కమ్మోవి, కెంజాయ,

తామరకంటి, నలువ, చిగురుబోడి మొదలగునవి సమాసపదములు. పెద్దనయు కేతన చెప్పినవానిలో ఎల్లి, నెత్తమ్మి, క్రొన్నెల, పాచ్చెము అను శబ్దములను గ్రహించి ఇంక వాలాయము, అలము, వంగడము, అంగడి, వెన్న, వావిరి, వాగెంబు, అక్కజము, అచ్చెరువు, వేసవి, వేనవేలు మొదలగు మఱికొన్ని కావ్యభాషలోనే సాధారణముగా గనబడు శబ్దములను ఇచ్చియున్నాడు. ఇందు వంగడము, అక్కజము, అచ్చెరువు తద్భవములుగానే శబ్దరత్నాకరకారాదులచే గ్రహింపబడుచున్నవి. వంగడము వంశశబ్దభవమును, అక్కజము ఆశ్చర్య శబ్దభవమును కావచ్చును. తక్కినవానిలో పెక్కు ఇతరదక్షిణదేశ భాషలకు సంబంధించినవియు గలవు.

ఎఱుకువ—త. అఱి, అఱివు, అఱిక్కు.

మన్ను—త. మణ్, మణల్.

ఇంతి—త. ఇల్తి.

తెమ్మెర—క. తెమ్ + ఎలర్ (> ఎరల్) = తెమ్మెలర్, తెంబెలర్.

కడలి—త. కడల్ = అల.

వాన—త, క. వాన్, వాణ.

ప్రొద్దు—బ్రధ్నశబ్దభవ మందురుగాని త, క. పొఱుదు అనుధానికి సంబంధించినదై యుండును.

తనివి—(తనివు. తనుపు = తృప్తికలుగజేయు) తణ్ - తని = చల్లని cf త. తన్నీర్.

అంగడి—త, క. అంగాడి.

కేలు—త. కై; క. కెయి.

పోరు—త, క. పోర్.

అప్పకవియు అన్యదేశజాంధ్రములలో కేతన పెద్దన లిచ్చిన వాలాయము, అలంబు, ఎలనాగ, నెలది, నెలత, తొయ్యలి, బోటి, ఇగిలి, ఏడ్తెఱ, పొలుపు, పీనుగు, ఉల్లము, కేలు, నెమ్మి, పోయగము, నెచ్చెర, మక్కువ మొదలగువానినే చేర్చినాడు. కాని కేతన అచ్చతెనుగులుగా నిచ్చిన నెల, వేసవిశబ్దముల నప్పకవి అన్యదేశజాంధ్రములుగా గ్రహించినాడు. కేతన పెద్దనలు తత్సమము, తద్భవము, అచ్చతెనుగు (సహజాంధ్రదేశ్యము), దేశ్యము (దేశోద్భవము), గ్రామ్యంబు నాగగలవైరు తెలుగులు "పంచవిధములై తెలుగుపలుకు జాతముపరగు" అని చెప్పి తెలుగున గల భేదములమాత్రము చెప్పగా, అప్పకవి "తెలుంగుమఱుంగులు" "ప్రాదెనుంగులు" వను మరిరెండు విశేషములను గల్పించియున్నాడు. "అబ్ధిమేఖల కుదయించినట్టి సీత" అనుటకు బదులుగా "కడలిమొలనూలిచేడియ గనిన పడుచు" అని చెప్పినచో నది "తెలుగుమఱుగు" అగునట. అనగా తత్సమపదములను పరిహరించి తదర్థమును డొంకతిరుగుడు తెలుగుసమాసముల మూలముగా జెప్పినచో నట్టి శబ్దములు తెలుగుమఱుగు లగును. ఇవి భాషలో సహజముగ వ్యవహారములో నున్నవిగాని, ప్రాచీనకవుల రచనాపరిపాటిలోనివి గాని కాక, విశేషంబుగా తత్సమబహుళంబుగా జొచ్చిన ఆంధ్రభాషపై గలిగిన యేవగింపును సూచించుటకో యన్నట్లు ౧౬-వ శతాబ్ది ప్రాంతమున గొందఱాంధ్రకవులు అచ్చతెనుగు పేరున కల్పించిన యొకవిధమగు కృతకభాషారూపములని చెప్పవలసియున్నది. అప్పకవి పేర్కొనిన యీ తెలుగుమఱుగు లనువానిని వెనుకటి లాక్షణికులు పేర్కొనకపోవుటచే నివి అప్పకవికి సమీపకాలముననే బయలుదేరిన వనవచ్చును. అంతకుపూర్వపు లాక్షణికులు సంస్కృతవిభక్తులు, క్రియారూపములు, అవ్యయములు, వైరిసమాసములు నీభాషలో జేరకూడదని శాసించి తత్సమరూపములలో గూడ గలుగు మార్పులను సూచించియు తెలుగుదేశీయసంప్రదాయమును నిలుపబెట్ట యత్నించిరి. అట్లే ప్రాచీనకవులలో కొందరు "ఆరూఢగద్యపద్యాదిప్రబంధ, పూరితసంస్కృతభూయిష్ఠరచన" నిరసించి యీభాషలో ప్రసన్నతకు నెలవగు జాను తెనుగురచనను ప్రోత్సహింపదొడంగిరి. అప్పటికి తెనుగుమఱుగులు భాషలో బయలుదేరలేదు. తొలికాలమున తత్సమబహుళమగు శిష్టకవులరచనను ప్రతిఘటించుటకుగా బయలుదేరిన "జాను తెనుంగు" ఉద్యమమే అప్పటి పండితకవుల యాదరమును బడయలేక దేశమున నంతర్వాహినిగా ప్రవహించి మఱికొంత కాలమునకు 'తెనుగుమరుగు' లను మారురూపమును వహించి అచ్చ తెనుగురచన మను పేరుతోనే బయలువడజొచ్చినది. కాని యీమరు గా జాను తెనుగుజాణ

తనము నత్తు మరుగే రైనదిగాని మెరుగుపెట్టజాలినది కాలేదు. సహజమగు దాని తియ్యదనము మరుగువడి కృత్రిమరుచులు పెరుగుటచే సహృదయుల హృదయము నాకర్షింపజాలకపోయినది. కావుననే యీ యచ్చతెనుగురచనయు నచిరకాలములోనే యంతరించుటయు తటస్థించినది. దీనితోపాటు వెనుకటి "జానుతెనుంగు" మాటయు నడుగునబడిపోయినది.

అప్పకవి అచ్చతెనుంగున కీతెలుగుమరుగులనే కాక "ప్రాతెనుగు" లనువానినిగూడ జేర్చినాడు. "తొల్లింటికవుల వాక్యములెల్లను బ్రాతెనుగులయ్యె." అవియే యిటీవలివారికి జెల్లుబడిరైు ప్రాతతెనుగులగునట. కాని యీ చెల్లుబడి విషయమున నభిప్రాయభేదము లనేకరీతుల లేకపోలేదు. అప్పకవియే ఆడ, ఈడ అనునవి గ్రామ్యోక్తు లన్నాడు. ఇవి తిక్కనార్యుని ప్రయోగమందు గలవు. తిక్కనార్యుడే యీ ప్రాతవడ్డమాటల ప్రయోగమునుగూర్చి

"పలుకుల పొందు లేక రస
భంగముసేయుచు ప్రాతవడ్డ మా
టల దమ నేర్పు నూపి"

ఇత్యాదిపద్యమున నీసడించినాడు. ఈ 'ప్రాతవడ్డ మాటలు' అప్పకవి చెప్పిన పూర్వకవుల ప్రయోగములే యని తలంపవచ్చును. ప్రాతవడ్డ మాటలలో దన నేర్పు చూపుచు, నట్లైనను హృదయ మలరింపలేని కుకవిని దుర్విటునితో బోల్చుచు నిందించియున్నాడు. అనగా పూర్వకవిప్రయోగములను గ్రహింపవల దనియా యాతని యుద్దేశము? గ్రహించినను హృదయ మలరించునట్టివిగా వానిని జేయవలయునని యేమో. కావచ్చును. పూర్వకవులలో నొకడగు నన్నిచోడుని కవితనుండి యీతడట్టివానిని కొన్నిటిని గ్రహింపకపోలేదు. కాని వానికి మెరుగుపెట్టినాడనియు జెప్పవచ్చును. నన్నిచోడుడు కత్తిగొంటులయిన అత్తగంటును—వేశ్యమాతలను గూర్చి వారి సామర్థ్యాతిశయమునుగూర్చి వర్ణించు సందర్భమున వారు "నేలయు నింగియు దాలముల్ వాయింప, నెండమావుల బట్ట బండదేలయు, గ్రోకాలు ముడిపెట్ట..." నేర్పుగలవారని వస్తుస్థితిని వర్ణించినాడు. ఈ "నేలయునింగియు దాలముల్ వాయించుటను సోమనాథుడు, తిక్కనగూడ గ్రహించినారు. అందు తిక్కనార్యుడు దీనిని ప్రయోగించిన రీతి గమనింపదగినది. కీచకునిచే కొంతకొసరించుకయు లేక కూలదన్నబడిన ద్రౌపది భంగపాటును విరటుని యాస్థానంబున నుండి

"కనుగొని కోపవేగమున
కన్నుల నిప్పులు రాల నంగము
ల్దనరగ సాంద్రఘర్మసలి
లంబులు గ్రమ్మ నితాంతదంతపే
షణరటదాస్యరంగవిక
టభ్రుకుటీచటుల ప్రవృత్తన
ర్తనఘటనాప్రకారభయ
దస్ఫురణాపరిణద్ధమూర్తియై"

న పవనతనయుని భయంకరాకారమును మన కనులయెదుట నిలబెట్టుటకుగా తిక్కనార్యుడీవిషయమును గ్రహించినాడు. నన్నిచోడుని వేశ్యమాతల నేర్పరితనమను వస్తుస్థితివర్ణనమునకంటె తిక్కనార్యుని యీభావస్ఫోరకవర్ణన సందర్భమున నా వాక్యమున కెట్టి మహత్తరశక్తి, ఔచితి కలిగినవో పరికింపుడు.

"నేలయు నింగియు దాలముల్ గావించి
యేపున రేగి వాయించి యాడ
కులపర్వతంబులు గూర్చి రెండొంటితో
దాకంగ వీకమై దన్ని యాడ
నేడు సాగరములు నిక్కడక్కడ నెట్టి
పలుచని రొంపి మై నలదికొనగ
దిక్కులు నాలుగు నొక్కచోటికి దెచ్చి
పిసికి పిండలునేసి పిడిచికొనగ
మిగిలి బ్రహ్మాండభాండంబు పగుల వ్రేయ
నప్పళించుచు బ్రళయకాలానలమున
గండరించిన రూపంబుకరణి భీము
డతిభయంకరాకారత నతిశయిల్లె."

నన్నిచోడుడు:—(కుమా. సం. ౧౨)

"ధరణీచక్రము దిర్దిర
దిరుగ బయోనిధులు గలగ దెసదప్పి భయా
తురులై సురకిన్నరఫణి
నరవరు లని మూలిపాటు నరకుడు దాకన్"

తిక్కన:—భీముడు ద్రౌపదితో—

"అవనీచక్రము సంచలింపగ దివం బల్లాడ నాశాచయం
బవధూతంబుగ గోత్రశైలనికరం బాకంపముం బొంద న
ర్ణవముల్ ఘూర్ణన మొంద గ్రోధముగ్రతార్క్ష్యత్వంబు
నొందించి చి
త్రవధప్రౌఢి వహించి సూతునకు రౌద్రం బేర్పడం
జూపెదన్" (విరా. ౨ - ౨౦౪)

నన్నిచోడుడు:— గుణధ్వని—

"ధర గంపింప బయోనిధుల్ గలగ ది
గ్దంతుల్ భయంబంద భూ
ధరముల్ డొల్ల వియత్తలం బద్రువ దై
త్యశ్రేణి భీతిల్ల భా
స్కరరథ్యంబులు ద్రెంగ్గి మర్గబడ నా
శాచక్రముల్ ద్రోయ భీ
కరమై దారుణమై గుణధ్వనిమహో
గ్రంబై చెలంగెన్ వడిన్"
(కు. సం. ౧౨-౯౧౨)

తిక్కన:—పార్థుడు శంఖమొత్తినన్—

"కలగెన్ దోయధిసప్తకంబు గిరివ
ర్గం బెల్ల మాటాడె సం
చలతన్ బొందె వసుంధరావలయ మా
శాచక్ర మల్లాడె గోం
దల మందెన్ ద్రిదశేంద్రుపట్టణము పా
తాళంబు ఘూర్ణిల్లె నా
కులమయ్యెన్ గ్రహతారకాకులము సం
క్షోభించె నవ్వేధయున్" (విరా. ౪-౧౩౨)

నన్నిచోడుడు:—"పఙ్క్తిముఖునురుభుజాస్తంభా
గ్రమున జయశ్రీ బొందె సాలభంజికవిధమున"
(౧౨-౯౩౪)

ఈభావము తిక్కనార్యుని నిర్వచనోత్తరరామాయణమున తొలిశ్లోకమునసే ఎట్లు విస్తరింపబడినదో చూడుడు:

"శ్రీరాస్తాం మనుమక్షితీశ్వరభుజాస్తంభేజగన్మండల
ప్రాసాదస్థిరభారభాజిదధతీ శ్రీసాలభంజీశ్రియం"

ఇట్లు వెనుకటికవుల భావములను, మాటలను గ్రహించినను వానిమూలమున చదువరుల హృదయములరించునట్లుగా రచింపగలిగినసేకాని సుకవి కాజేడని యాతని భావమైయుండును.

"తఏవ పదవిన్యాసాః తాఏవార్థవిభూతయః
తథాపి నవ్యం భవతి కావ్యం గ్రథనకౌశలాత్"

అనిన యాలంకారికుల యభిప్రాయమునే యాతడనువదించుచున్నట్లున్నాడు. ఇట్లు నన్నిచోడుని భావములను గొన్నిటిని గ్రహించి వానికి మెఱుగుపెట్టి ప్రయోగించినను, ఈతని తొలిరచనయే యనదగిన నిర్వచనోత్తరరామాయణములో నీతడు చేసిన కుకవినింద, చెప్పిన కవితాలక్షణవిశేషములు, సూచించిన పదప్రయోగపద్ధతి మొదలగునవి యీతడు నన్నిచోడుని రచననే మనమున నిడికొని చేసెనా యని తలంచుట కవకాశము కలుగుచున్నది. భాషాసాహిత్యరచనాపద్ధతుల విషయమున నన్నపార్యుని పక్షమువందే యాదరము గలవాడగు తిక్కన యారీతికి భిన్నములగు పలుకుల పొందులేమి, దాని మూలమున గలుగు రసభంగము, ప్రాతవడ్డ మాటలు, విశేషణవిశేష్యముల లింగవచనముల భేదము మొదలగు రచనావిషయములనుగూర్చి ఖండింపవలసినవాడగుటనుబట్టియు, నీలక్షణములు కొన్ని నన్నిచోడుని రచనలో గానవచ్చుటంజేసియు నన్నిచోడుని రచనయే యాతని విమర్శకు గారణమనుట యుక్తియుక్తముగా గనబడకపోదు.

పలుకుల పొందు లేకపోవుట యను తిక్కనార్యుని యాక్షేపణమును నన్నిచోడుని రచన కన్వయించినచో, నన్నయాదుల రచనలో గానరాని యన్యదేశీయ పద, పదబంధముల ప్రయోగసరళి యొకటి యీరచనలో గానవచ్చుచుండుట మనము గమనింపదగిన విషయములలో నొకటి యగును. అయితే నన్నయకు పట్టుపడని యీక్రొత్తరీతి యీతనికిమాత్ర మెచ్చటినుండి వచ్చినది, ఏల రావలయును అను ప్రశ్న వెంటనే కలుగకమానదు. పరిశీలించినచో మన దేశమునందలి తక్కిన పెక్కువిషయములందువలెనే—అంత దూర మేల, మన యాంధ్రుల జాతీయజీవితచరిత్రమందువలెనే ఆంధ్రవాఙ్మయరచనారీతులందును ఆర్యానార్యభాషాసాహిత్యపద్ధతుల సహజసమ్మేళనము చక్కగా సాధింపబడియున్న దని మనము గుర్తింపవలసియుం

డును. శ్రీనిని మొదట చక్కగా సాగించుటలో ప్రోత్సాహకులై కీర్తిగన్నవారు చాళుక్యరాజులు-సత్యాశ్రయునిదొట్టి చాళుక్యనృపులే కావచ్చును. అట్టిదానిని తొలుదొలుత సాధించి పేరుగాంచినవాడు నన్నపార్యుడు. వీరి కీవిషయమున గొంతవరకు మార్గదర్శకమైనది కర్ణాటభాషాసాహిత్యము. అందప్పటికిపూర్వమే యీ సమ్మేళనపద్ధతులు స్థిరపడి సాహిత్యము పెంపొందియున్నది. ఆ సాహిత్యరీతులనే తన దేశకాలాదిపరిస్థితుల కనుకూలమగునట్లుగను, "అనఘుడై శిష్టాగ్రహారభూయిష్ఠమై ధరణీసురోత్తమాధ్వరవితానపుణ్యసమృద్ధమై పొలుచు" వేగిదేశమందలి గోదావరి తీరంబున నివసించు తన వైదికసంపత్తి కనుగుణమగునట్లుగను గ్రహించి "తెనుంగునన్ మహాభారతసంహితారచన బంధురు"డైనాడు నన్నయ. కాని నన్నిచోడున కీగోదావరీతీర వేంగిదేశపు వైదికసంపత్తి లేదు. ఆంధ్రదేశ పశ్చిమభాగమందలి అచ్చతెలంగాణపు దేశీయాభిమానమునకు దోడు తత్సమీపస్థములగు నన్యదేశీయసంప్రదాయప్రవణతకూడ ప్రబలినట్లగపడుచున్నది. కావుననే నన్నయ యవలంబించిన మార్గపద్ధతి నవలంబింపక, దేశిమార్గములను దేశీయములుగా జేసి కవిత సాగింపవలె నని తలచియుండును. ఆంధ్రదేశపశ్చిమభాగము కన్నడదేశప్రాంత మగుటచే నచ్చటి దేశికి కన్నడభాషాసంపర్కము హెచ్చుగా నుండకమానదు. గద్యపద్యోభయసమ్మిశ్రితమగు వాఙ్మయము కన్నడభాషలో నింతకుపూర్వమే వెలసి ప్రసిద్ధిగాంచియుండుటచే నావాఙ్మయమే, అందు రత్నత్రయమని ప్రసిద్ధిగాంచిన కవిత్రయమే పెక్కువిషయముల నన్నిచోడునికి మేలుబంతి యగుటలో నాశ్చర్యము లేదు. ఈ కారణములచే నీతని రచనలో తమిళకన్నడభాషాపదములు, ప్రయోగములు, సంప్రదాయములు మొదలగునవి కొన్ని ప్రబలుట, అవి తరువాతివారికి నచ్చకపోవుట తటస్థించినది. కేవలము నన్నయ యవలంబించిన మార్గమునే యవలంబింపక నన్నిచోడుని వలె దేశిపద్ధతికై ప్రాకులాడిన పాల్కురికి సోమనగూడ తరువాతికవుల యీసడింపులకు గురియగుటకు, తిక్కన వారి భాషకంటె వీ రిద్దరి భాషలోను, ప్రయోగపద్ధతిలోను కొంత సామ్య మగపడుచుండుటకుగూడ కారణము వీరిది పశ్చిమాంధ్రదేశీయ సంప్రదాయ మగుటయే కావచ్చును. కావున వీరి విశేష ప్రయోగములలో కొన్నిటిని పశ్చిమాంధ్రదేశిగను, కొన్నిటిని అన్యదేశీయములుగను మనము గ్రహింపవలసియుండును. కేతనాదులు చెప్పినట్లు తల, నెల, గుడి, మడి, ఊరు, పేరు, పాలు, పెరుగు మొదలగు శబ్దములు దక్షిణదేశ భాషలన్నిటికిని మూల మగు తల్లి భాషనుండి వచ్చినవే యైనను, ఈ భాషలు వేరుపడి స్వతంత్రములైన పిదప అందలి సాహిత్యముల పరిచయమువలనగాని, ఆయా భాషలను వ్యవహరించువారి సాన్నిధ్యము, కలయికల వలనగాని ఒకభాషలోని శబ్దములు మరియొక భాషలోనికి సంక్రమించుచుండును. అప్పు డివి యన్యదేశ్యములుగనే పరిగణింపబడును. ప్రాంతీయము లగు నిట్టి శబ్దముల నాయా కవుల ప్రయోగచాతుర్యమును, బలమును బట్టి యితరకవులును శిరసావహించి గ్రహించినచో నవి యాభాషాసాహిత్యమున నిలిచిపోయి యాభాషలో నంతర్భాగ మగును. లేనిచో నాయా ప్రాంతీయ కవుల రచనలలో మాత్రమే పొడసూపుచు భాషలో విశేషవ్యాప్తి గాంచవు. నన్నిచోడ సోమనాథుల రచనలలోని కొన్ని ప్రయోగముల కిట్టి స్థితియే గలిగినది. తిక్కనవంటి మహాకవి యట్టి యసాధారణాన్యదేశీయ ప్రయోగములను గూర్చి వెంటనే నిరసింప తటస్థించుట గూడ నట్టివి కాలక్రమమున నంతరించుటకు గారణమైయుండును. **పలుకుల పొందు లేక** ఒకటన్ హృదయం బలరింపలేని-కుకవులను నిందించుటతోపాటు "తెలుగుకవిత్వము చెప్పం దలచిన కవి యర్థమునకు దగియుండెడు మాటల గోవ" వలయునని చెప్పుచు తెలుగు కవిత్వము చెప్పదలచిన కవి యనుసరింపవలసిన విధానమును గూర్చిగూడ తిక్కన చేసిన సూచన నన్నిచోడాదుల విజాతీయ ప్రయోగములనే లక్ష్యముగా జేసికొన్నదిగా గనబడుచున్నది. అట్టి నన్నిచోడుని అన్యదేశీయములుగా బరిగణింపదగిన కొన్ని ప్రయోగములను బరిశీలింతము. ఇవి విజాతీయము లనబడుట అప్పటి నన్నయాదుల మార్గపద్ధతిని బట్టి చూచుటవలననె, ఆమార్గము నవలంబించిన తరువాతి కవులు వాని నంతగా గ్రహింపకపోవుటచేతను గలిగినదే. లేనిచో నివియు అప్పకవి చెప్పిన ప్రాతతెనుగులో

చేరవలసినవే. నన్నిచోడుని రచనలో పలుకుల పొందిక లేకపోవుట విజాతీయములను నన్యదేశ్యపు పలుకుబళ్లను, ప్రయోగించుటచేతనే యనుదాని కుదాహరణముగా నీ తమిళ భాషా ప్రయోగములను జూపవచ్చును.

**నాయి దోర్ప** నేర్చుగాక ఏమి నేర్పనేర్చు - cf. త. నాయి=కుక్క.

ఈ వచ్చిన **వేళ్ల** యందు - cf. త. పేయర్ - పేర్=నామము. ఎత్తనిపేర్=ఎంతమంది.

**వేల**, వేలగొ-ని cf. త. వేలై=పని, ఊడిగము.

**పురులు**—ధనము. cf. త. పొరుళ్=అర్థము.

**ముడి** గలపినగతి – cf. త. ముడి = కిరీటము. పొన్ముడి=బంగారు కిరీటము.

**పొయిు**దల - cf. త. పొయి = అబద్ధము.

**తన్నీర**—cf. త. తణ్ణీర్ –> తన్ని = ఉదకము= చల్లని నీరు.

పద్మిని **యొడమి** యెల్ల చూఱగొని – cf. త. ఒడమై=ధనము.

కట్టాయము—cf. త, క. కట్టాయము = నిర్బంధము, నిశ్చయముగా.

నవ్వులర్ **మలరుల** కిచ్చి — cf. త, క. మలర్=పువ్వు.

**కుళిరు** గొన — cf. త, క. కుళిర్ = చల్లదనము.

తళియ – cf. త. తళిగు=భోజనము, వంట.

తమిళ భాషా పదములకంటె కన్నడభాషా పదములు, ప్రయోగములు నీతని రచనయందు విశేషముగా గానవగును. అవి పంపాది కన్నడ కవుల గ్రంథములం దీతనికి గల యాదరమును, పరిచయమునే విశేషముగా సూచింపగలదు. శ్రీ మానవల్లి రామకృష్ణకవిగారట్టి వానిని విశేషముగా జూపియున్నారు.

భీతికి **కండవడంబు** సుట్టె(= కాండపటము = తెర); చేనము, కలసము, అసుర్చు, విసుర్వించు, అబ్బగింపక, ఎల్లిదించు, మేలిమెంచులు, దేవి, పందల, ఉరి(=దహనే), తుంతుర్వని (తుంతుల్=drizzling, spray, పని=drop, dew), మేలిల్లు, బాలకి, చేటము, చేటంచేటము, కొలవేళులు, పీలితొంగళ్లు, పేర్బిందులు, ఎలర్, వఱడియలు, మేఘడంబరములు, కడ్పరసు, ముట్టిమూదలించు, కునిసియాడు, అపమానము, ప్రెయు (= ప్రీతివాయించుటకే), క్రక్కిదము మొదలగు శబ్దములును,

"ఆ యవనీసురాసుర **చయంబు** దద్దణాధిపుల గాంచుచు **మీదికివిూద జీవముల్ పోయిరి**"

"తలచితో- కాదు- నిక్కము తపము సేయ వలచితో."

"తడియారదు నేనియు."

"నీ ప్రాప్తి రే."

"వచ్చు కాడవు గాక."

"బాసితి మీకు నింటితోన్."

"కాలం గంతులు పనిన."

"గౌరి నీ వెంత చెట్టపురులో."

"కుళిరుగొన మేన నొత్తిరి."

ఈ మొదలగువాని విచిత్ర ప్రయోగము కన్నడ భాషాసంప్రదాయ సిద్ధమే యని తలంపవచ్చును. వీనిలో గొన్ని పశ్చిమాంధ్ర దేశ భాగ వ్యవహారములో నుండినను ఉండవచ్చును. కాని వాని ప్రసిద్ధి కన్నడ దేశ వ్యవహారముననే యగుటచే, నివి యన్నియు నీ భాషలో నన్యదేశ్యములుగనే పరిగణించవలసి యుండును. కాని వీనిని తరువాతి కవులకు చెల్లుబడి గాక పోవుటచే గాబోలు ప్రాత తెనుగులో జేర్చినట్లు లేదు.

ఇట్లు సంస్కృతాద్యార్య భాషలలో మాతా, పితా, కరోతి, గచ్ఛతి మొదలగు శబ్దములు తక్కిన గ్రీకు, లాటిన్ మొదలగు భాషలలో వలెనే మూల భాషనుండి వచ్చిన సజాతీయ శబ్దములే యైయుండ, ఇటీవల నా భాషలనుండియు దేశీయ భాషలనుండియు సంక్రమించిన పిక, దీనారాది శబ్దము లన్యదేశ్యము లైనట్టులే దక్షిణదేశీయము లగు అరవము, తెలుగు,

కన్నడము మొదలగువానిలోఁగూడ తల, నెల, ఊరు, పేరు మొదలగు, మూలభాషనుండి సంక్రమించిన సజాతీయ శబ్దములు కేవల దేశ్యములుగా గ్రహింపబడు చుండ, తరువాతికాలమున పరిసర ప్రదేశములందలి హిందూస్థానీ, మహారాష్ట్రీ మొదలగు విజాతీయ భాషలనుండివలెనే సజాతీయభాషలనుండి సంక్రమించిన శబ్దములును అన్యదేశ్యములుగనే గ్రహింపబడు చుండును. కావున ఉత్తరహిందూస్థాన భాషలలోని 'దేశి' ఆ భాషలలో నన్యదేశ్యము కావలసినట్లే, దక్షిణదేశభాషలలోని తత్సమతద్భవములును అన్యదేశ్యములుగనే పరిగణింపబడవలసియున్నది. ద్రావిడ భాషలు సహజముగ దేశ్యములే యగుటచే నందు దేశివిభాగ మావశ్యకముగా దోపదు.

---




ఇది స్వరాజ్యోత్సవముకాదు ; మా ఊరికి సినిమాతార వచ్చినది.

# సహగమనము

[నాటిక]

మూలము :

శ్రీ రవీంద్రనాథ టాగూరు



అనువాదము : *

శ్రీ బెజవాడ గోపాలరెడ్డి

[రణక్షేత్రమున అమాబాయి, వినాయకరావు]

అమాబాయి

తండ్రీ!

వినాయకరావు

తండ్రి! నేనా నీ తండ్రిని! స్వేచ్ఛాచారిణీ! పాతకమునుండి వెనుదీయనైతివి. యవనుని గృహము చొచ్చి, మ్లేచ్ఛకంఠమున పుష్పమాలను వైచిన కులకళంకినివి. నీతండ్రిని నేనా!

అమాబాయి

అన్యాయమున యుద్ధమున జయించి, స్వహస్తములతో నాభర్తను నీవు చంపితివి. అయ్యో తండ్రీ, అయినను నీవు నాతండ్రివే. విధవాశ్రుపాతముచే ఘోరశాపము నీశిరమున తగులునేమో యను భయముచే ఆ భరింపరాని సంతాపమును ఈ వక్షఃపంజరమున అణచి దాచియున్నాను.

నీవు తండ్రివి, నేను కూతురును. పెక్కునాళ్ల పిదప, ఇరువురమును ఈ సమరాంగణమున, ఈ భయంకర రాత్రివేళ కలిసికొంటిమి. తండ్రీ! నీ చరణములకడ ప్రణమిల్లి, పదధూళి శిరమున గైకొని, సెలవుపుచ్చుకొనెదను. నేడు నీవు నీబిడ్డను క్షమింపలేకపోయినను, నిన్నుక్షమింప నేను దయామయుడగు భగవంతుని అర్థించెదను, నాయనా!

వినాయకరావు

ఎచ్చటికి పోయెదవే, అమా! ఛీ, నీకన్నీరు. దురదృష్టురాలా! ధర్మమును తిరస్కరించి, ఏవృక్షమున నీవు గూడుకట్టుకొంటివో, అది పిడుగుబడి మాడిపోయెను. ఇహపరముల పోగొట్టుకొన్న నీవు ఎవరికడకు పోయెదవే నేడు?

అమాబాయి

పుత్రుడున్నాడు—

వినాయకరావు

పుత్రుని మాట ఎత్తకు. పాతకపు భగ్నశేషము వైపు ఇక తిరిగిచూడకు. నేటి రాత్రి రక్తతర్పణముచే నీప్రాయశ్చిత్తము పూర్తియాయెను. యవనుని గృహమున ఎన్నడును ఇక నీకు ప్రవేశము లేదు. సరే చెప్పు, ఎచ్చటికి పోయెదవు నేడు?

అమాబాయి

తండ్రికన్న ప్రేమమయమగు మృత్యువున్నది. యమధర్మరాజున్నాడు. వారి వివృతద్వారముల ఆశ్రయము పొంది ఎవరును తిరిగిరారు.

వినాయకరావు

మృత్యువా! చెడ్డ నడవడిలో బడిన బిడ్డా! పరమపావనమును, నిర్మలమును, ఉదారమును నైన మృత్యువా! సముద్రము సకలనదుల పంకరాశిని మ్రింగునటుల మృత్యువు సకలపాతకములను తనలో ఇముడ్చుకొనును. అట్టి అనంతమృత్యువా నీకు గతి, ముక్తి! కాని అట్టి చావు నీకు నేడు ఇక్కడ కాకూడదు.

* విశ్వభారతివారిచే ఆమోదమును బడసిన అనువాదము.

లజ్జితులైన స్వజనులను, క్రోధపూరితులైన సమాజమును విడనాడి, దూర తీర్థవాసమునకు పొమ్ము. ఇచ్చోటనే నీ సమస్తకళంకములను, భయములను, లజ్జలను, నీజన్మభూమిని పరిత్యజించి చనుము. అచ్చట గంగాతీరమున, చల్లని విమలవాయువులు వీచుచుండ, పుణ్యనీరముల ముప్పూటల స్నాన మాచరించి, శాంతమనమున నిర్జన కుటీరమున హరహర శంభో శంకర యని పరమేశ్వరుని గుణగానముల జపించుచుండుము. దూరమందిరమునుండి సంధ్యాసమీరములు వెంట కొనితెచ్చు ఆరతిగంటల ధ్వనుల వినుచుండుము.

పతితకుసుమమును చేరదీసి, దాని పంకమును కడిగి గంగాదేవి సాగరుని పదములకడ పూజోపహారముగ అర్పించునటుల, ఎప్పుడో ఒకనాడు ఆయుశ్శేషము కాగా, మృత్యువు నిన్ను నిశ్శబ్దముగా తనలోనికి చేర్చుకొనును.

అమాబాయి

నా కుమారుడు?

వినాయకరావు

అతని విషయము అటుంచుము. తొలుత ఉత్కృష్టతపస్సుచే నిన్ను దోషరహితనుగా నొనర్చనిమ్ము. అప్పుడు విస్మృతియనెడి మాతృగర్భమునుండి శిశుసమముగ తిరిగి నా పితృఅంకమునకు రాగలవు. క్రొత్తదేశమున, క్రొత్తనదీతీరమున శుభ్రస్మితవదనవై, కన్యాకళ్యాణకరములతోటి నా నవీనకుటీరమున సంధ్యాదీపమును వెలిగింపగలవు.

అమాబాయి

పతిశోకము నన్ను దహించుచున్నది. విశ్వము ఛాయాసమముగ కాన్పించుచున్నది. మీ మాటలు దూరమునుండి ఏదో అజ్ఞాత అస్పష్టతను నాచెవులలో సూచించుచున్నవేగాని, హృదయములోనికి చొచ్చుట లేదు. నన్ను వదలివేయుము, వదలివేయుము. పతి రక్తముచే సిక్తములైన ప్రేమపాశములచే నన్ను బంధింప యత్నించకుము.

వినాయకరావు

ఇక నీ జనకుని కుమార్తెవు కావు నీవు. కొమ్మనుండి జారిన పువ్వు తిరిగి కొమ్మను పొందజాలదు. లజ్జాహీనురాలా! ఒక మాట అడిగెదను: ఎవనిని నీవు భర్త, భర్త యనుచున్నావు! పావురమును వంచించి పెంటిపావురమును తన్నుకొనిపోవు డేగవలె వివాహరాత్రి పెండ్లికొడుకు 'జీవాజి' యొక్క ప్రసారితహస్తములనుండి నిన్ను లాగితీసి కొనిపోయిన ఆ దుష్టచోరునా, ఆ మ్లేచ్ఛ దుర్మతినా నీవు పతియనుట?

ఆరాత్రి ఉదంతము జ్ఞప్తియున్నదా? వివాహమండపమున పెండ్లికుమారుని రాకకై ఎదురు చూచుచు అందరమును కూర్చొనియుంటిమి. శుభలగ్నము దాటిపోవుచుండెను. జీవాజి ఇంకను ఏల రాలేదని అందరును అడుగుచుండిరి. మార్గమువైపు దృక్కులు పరచి చూచుచుండిరి.

ఇంతలో దివిటీల అరుణదీప్తులు రాత్రి లలాటమును చర్చితమొనర్చుచు కాన్పించినవి. వాద్యరవములు వినిపించెను. హర్షముచే అంతఃపురమున స్వాగతగానములు చెలరేగెను. వందలకొలది పల్లకీలు ద్వారమున ప్రవేశించెను. ఏడి, జీవాజి ఎచ్చట అని అడిగిఅడుగకమునుపే తుపానువలె అకస్మాత్తుగ విరుగబడి, వారి కోలాహలములచే మాకు దిక్కుతెలియని స్థితిలో, ఒక్కక్షణములో నిన్ను బలాత్కారముగ అపహరించి, ఎచ్చటివా రచ్చట పంచబంగాళమయిరి.

కొంతసేపటికి బంధనముక్తుడై, జీవాజి నతశిరస్కుడై మెల్లమెల్లన ప్రవేశించెను. మార్గమధ్యమున ఏటుల వానిని బంధించేసి, పెండ్లివేషమును లాగికొని, వాని రథము నెక్కి దివిటీలను సంగ్రహించి, బిజాపుర యవనరాజ సభాసదులు దస్యువృత్తి నవలంబించిరో వింటిమి.

దస్యురక్తపాతముచే దీని ప్రతీకారమును గావించెదమని జీవాజితోటి నేనును ఆ దారుణరాత్రి హోమాగ్నిని స్పర్శించి ప్రతిజ్ఞ చేసితిమి. బహుకాలమునకు ఆ శపథముక్తుల మైతిమి. ఈరాత్రియుద్ధమున జీవాజి ప్రాణములర్పించి, వీరుల సద్గతిని చేరెను.

విధవా! అతడు నీభర్త. ఆ దొంగముసల్మాను నీ ధర్మనాశకుడుమాత్రమే.

అమాబాయి

ఛీ, ఛీ, నాయనా! నాభర్తను వధించి నదిగాక, హృదయమును భేదించు దారుణ వాక్యబాణములుగూడనా? నీధర్మముకడ పతితను కావచ్చును; నాధర్మముమాత్రము సముజ్వలముగనే విరాజిల్లుచున్నది.

నేను భార్యను; సేవాదాసిని గాను. శ్రద్ధాసహితముగ ప్రేమించి, నాపూదండచే అతనిని వరించితిని: పతిసంతానమును నా గర్భమున వహించితిని. బలాత్కారముచే లొంగి ఆత్మదానము నొనర్చలేదు.

జ్ఞప్తియున్నది: ఒకనాటిరేయి గుప్త దూతికద్వారా పంపబడిన రెండుత్తరములు అంతఃపురమున నా కందినవి.'అతనిని కత్తితో పొడిచివేయుము' అనిమాత్రము నీవు వ్రాసి యుంటివి. 'ఉత్తరముతోటి విషమును పంపితిని, దానిని పానముచేయుము' అని తల్లి వ్రాసినది. బలాత్కారమున లొంగదీసి, అనహా యస్థితియందున్న సతిధర్మమును ఎవరేని లాగి తీసికొనియుండిరేని, మీ ఆ ఆదేశములను ఇంతలోపల చెల్లించియే యుండెడిదానను.

ఆ వీరుని పదములకడ నాహృదయమును అర్పణకావించితిని. యవన, బ్రాహ్మణ అనునవి ఎవరి భేదములు? ధర్మమునకు సంబంధించినవి కావు. లోపలి అంతర్యామి ఎచ్చట మేల్కాంచియున్నాడో, అచ్చట ఇద్దరును సమానులే.

కాని మధ్యమధ్య సంస్కారము తల ఎత్తుచుండెడిది. ఒక్కొక్క దినము నిగూఢ ఘృణావేగము కదలిపోవు నరములను విద్యుత్కంపనచే కొట్టునటుల ఉండెడిది. కాని ఈ ఆవేశములపై సతిత్వము జయముపొందినది. సంపూర్ణమైన భక్తితోటి పతిపూజ నొనర్చితిని. పవిత్రచిత్తముతో ముసల్మానుస్త్రీనైతిని. నేను భ్రష్టనైన రమణిని కాను. పరితాపమున, అవమానమున, అవనతశిరమున నా పతిధర్మమునుండి మరొక ధర్మమునకు అపరాధినివలె పోవుదానను కాను.

—ఇది ఏమి, ఇది ఏమి? నిశీథ ఉల్లాసమముగ, ముక్తకేశములతో పరుగెత్తుకొనివచ్చు, ఎవరిని నేను కాంచునది!

(రమాబాయి ప్రవేశము)

తల్లీ, తిరిగి ఈజన్మమున నిన్ను చూడ గలుగుదునని ఎన్నడును నేను తలచియుండ లేదు. జననీ, నీ పదధూళిని ప్రసాదింపుము.

రమాబాయి

పాపిష్ఠురాలా, తురకదానివైతివి. నన్ను ముట్టకుము.

అమాబాయి

నాదేహమును ఎట్టిపాపము కళంకిత మొనర్చలేదు. నీవలెనే నిర్మలమైనదానను.

రమాబాయి

తురకని కొంపలో నీధర్మమును ఎవరికి సమర్పించితివి ?

అమాబాయి

పతికి.

రమాబాయి

పతి! మ్లేచ్ఛుడా నీపతి! ఎవనిని పతి అన వలెనో నీకు తెలియునా, గుణము చెడిన దానా! రమణికి ఏకైకశరణ్యము, ఏకైక ఇష్ట దేవతమైనపతి! బ్రాహ్మణకన్యకకు మ్లేచ్ఛమున ల్మానుడా మగడు? దేవతాసమానుడు? తెలి వితక్కువదానా !

అమాబాయి

ఉచ్చవిప్రకులమున జన్మించియు, తురక యని అతనిని నేను ద్వేషించలేదు. మనో వాక్కాయములచే అతనిని పతియని పూజిం చితిని. నన్ను నిందించగల సతి ఎవరున్నారు తల్లీ? నీకంటె హీనురాలను కాను నేను. నాకును సతీస్వర్గలోకమున స్థానము కలదు.

రమాబాయి

నీవు సతివా ?

అమాబాయి

అవును, నేను సతిని.

రమాబాయి

అసంకోచముగ మరణించుట నీకు తెలి యునా ?

అమాబాయి

తెలియును.

రమాబాయి

అటులైన చితానలమును వెలిగించు. అదో నీస్వామి సమరభూమియందు పడి యున్నాడు.

అమాబాయి

జీవాజియా ?

రమాబాయి

అవును. నీ వాగ్దత్తమైన పతి జీవాజి. వాని భస్మములలో నేడు నీ భస్మములను కలుపవలసియున్నది. వివాహరాత్రి విఫల మైన హోమాగ్నిశిఖలు ఆకలితో శ్మశాన భూమియందు చితాగ్నిరూపమున లేచి వెలు గుచున్నవి. ఆరాత్రి పూర్తిగాక మిగిలి పోయిన పని నేటిరాత్రి పూర్తికావలయును.

వినాయకరావు

బిడ్డా, పొమ్ము. నీకుమారునివద్దకే తిరిగి పొమ్ము. నీ శోకతప్తనీడమునకే మరలుము. నా దారుణకర్తవ్యమును నిశ్శేషమొనర్చి పాలించితిని, నీవు వెడలుము.

ప్రియా! వ్యర్థముగ పీడించుచున్నావు. మన వృక్షమునుండి ఏ నూతనశాఖ కఠిన కుఠారముచే ఛేదింపబడి, మరొక అడవినీడ లకు కొనిపోబడెనో, అచ్చట అది వాడి ఎండిచచ్చిన, అగ్నిలో దహనముచేసెడి వారము. అట్లుగాక, అది ఆ క్రొత్త మట్టి యందు క్రొత్తక్రొత్త వ్రేళ్లను తాల్చి,క్రొత్త ప్రాణముతో చిగిర్చి, ఫలపుష్పములతో ఆ ప్రదేశమును క్రమ్మివేసినది. అచ్చటనే దానికి ప్రీతి; అచ్చటి ధర్మమే, విధానమే దానిది.

అంతరస్నేహసూత్రములు ఛిన్నమై నపుడు నీ నియమపాశములు నిర్జీవబంధన ములై ధర్మమును బంధింపజాలవు. దౌర్జన్య ముచే అణచగలవుమాత్రమే. అమను వద లుము, విడిచివేయుము.

—బిడ్డా, నీగృహకర్మములకు తిరిగి పొమ్ము. నీప్రేమాభిమానములచే నిండి యున్న నీ కుటుంబమునకే పొమ్ము; నీ అభి నవధర్మక్షేత్రమునకు.

సహధర్మచారిణీ, మాయామోహాయుత

మైన ఈప్రపంచపు సుఖదుఃఖముల చక్రపు తిరుగుడులను వదలి, మన మిరువురమును తీర్థధామములకు చని కాలముగడిపెదము.

రమాబాయి

వెడలుటకుముందు, నావంశమునుండి జన్మించిన పాపాంకురముల నెల్ల త్రుంచి నాశనము చేసెదను. నాగర్భపు లజ్జను దూర మొనర్చి పోయెదను. కూతురుయొక్క అపకీర్తిచే తల్లియొక్క సతీత్వమునకును కళంక మేర్పడుచున్నది. కుంపటిలో కాలు బొగ్గులనువలె, చితానలమున ఆ మచ్చవల్లదనమును తొలగించి కాంతివంతము కావించెదను. నాకూతురుపేరట సతీఖ్యాతిని చాటింప చేసెదను. ఈశ్మశాన ప్రదేశముననే, నా కన్యాభస్మములపైననే సతీమఠమును లేవనెత్తించెదను.

అమాబాయి

లోకలజ్జను, లోకఖ్యాతిని వదలిపెట్టుము. తల్లీ, ఇది లోకసమాజము కాదు; ఇది మహాశ్మశానభూమి. ఇచ్చో పాపపుణ్యములను లోకుల నోటిమాటలచే కొలువకుము. చావుయొక్క వెలుగునందు సత్యమును కంఠ్లార కాంచుము.

నేను సతిని. జనులు నన్ను ద్వేషించి తూలనాడినను నేను సతినే. తల్లివై, నిర్దోషియగు బిడ్డను పరపురుషునితోటి మృత్యుమిలనమున బంధించితివేని, లోకులు నిన్ను నుతించెదరు. కాని శ్మశానేశ్వరుని పదముల కడ శాశ్వతఅపరాధి వయ్యెదవు, తల్లీ!

రమాబాయి

కాష్ఠమును వెలిగింపుడు. సైనికులారా, అమను చుట్టుముట్టి పట్టుకొనుడు.

అమాబాయి

తండ్రీ!

వినాయకరావు

భయపడకుము, భయపడకుము. అయ్యో, బిడ్డా, మాతృహస్తములనుండి రక్షణ పొందుటకై, నీవు నీతండ్రిని ఎలుగెత్తి పిలువవలసివచ్చెనే! ఏ చేతులతోటి నిన్ను ఎత్తి రొమ్మునకు అదిమి ముద్దిడుచుంటినో, ఆహస్తములతోనే ధర్మమును సంరక్షించుటకై, దోషిని దండించునెపమున ఒకనాడు నీ మంగళసూత్రమును లాగి త్రెంచివేయవలసి వచ్చునని ఎవ రనుకొనిరి ? నాబిడ్డా!

అమాబాయి

నాయనా!

వినాయకరావు

రమ్ము బిడ్డా, ఈ ఆచారవిచారములన్నియు నిష్ప్రయోజనములు. నీకుమారుని ఎత్తికొని, నాపుత్రికవై, నా సకలైశ్వర్యముల నొసగు లక్ష్మివై, నాతోటి రమ్ము. సమాజమునకన్న హృదయపు నిత్యధర్మము శాశ్వత సత్యము. పితృప్రేమ దైవదత్తమగు దివ్య వర్షమువలెనే ముందువెనుకలను, ఎత్తుతగ్గులను పరిశీలించునది కాదు. అట్టి పవిత్ర ప్రేమను పొందనీయక ఏశాస్త్రములు, ఏ ప్రజలు, ఏసమాజపు మిథ్యావిధివిధానములు, ఏతుచ్ఛభయములు నాకన్యను మోసగించి అడ్డగించగలవు ?

రమాబాయి

ఎచ్చటికి ఏగుచున్నావే ? తిరుగు. పాపిష్ఠురాలా, అడుగో చూడుము, నీకై రణభూమియందు ప్రాణమిచ్చిన వాజి! అతని ప్రాణదానము నిష్ఫలము కానేరదు. నీ మృత్యుపూతములగు హస్తములచే బట్టి, వరునివేషమున శూరస్వర్గమునకు తనవెంట నిన్ను తోడ్కొనిపోవును.

ఇటనున్న సైనికవీరులారా, వినుడు. మీరందరును జీవాజియొక్క విశ్వాసపాత్రు లగు సేవకులు. ఈపే అతని వాగ్దత్తమైన వధువు. మీరందరును కలిసి చితానలమున వారిరువురను కలిపి, ప్రభు అభిలాషను పూర్తి చేయుడు.

సైనికులు

పుణ్యవతి ధన్యురాలు.

అమాబాయి

అబ్బా ! నాయనా !

వినాయకరావు

ఒరే, వదలుడు నాబిడ్డను.

సైనికులు

ఈ నారియొక్క భర్తకోరికను నెర వేర్చెదము.

వినాయకరావు

ఈపెభర్త స్వధర్మమైన యవనుడు.

సేనాపతి

సైనికులారా, ఈ వృద్ధవినాయకుని బంధింపుడు.

అమాబాయి

అమ్మా, పాపాత్మురాలా, పిశాచినీ !

రమాబాయి

మూర్ఖులారా, కూర్చొని ఏమి చేయు చున్నారురా మీరు? వాద్యములు ప్రయోగింపుడు. జయధ్వనులు కావింపుడు.

సైనికులు

జయము జయము.

అమాబాయి

పాతాళ వాసిని !

సైనికులు

జయము, జయము.

రమాబాయి

ప్రపంచమంతయు అమ సతియని చాటుడు.

అమాబాయి

మేల్కొనుము మేల్కొనుము, ధర్మ రాజా, మేల్కొనుము. శ్మశానేశ్వరా, నేడు లెమ్ము. చూడు! నీమహారాజ్యమున క్షుద్ర శత్రువులు ఉత్పాతములు కావించుచున్నారు. దేవదేవా, లెమ్ము. నీవజ్రాయుధముచే ఛేదింపుము. క్షుద్రధర్మముపై నీశాశ్వతధర్మమునకు జయము చేకూర్పుము.

రమాబాయి

పుణ్యురాలునకు జయ మనుడు. సతికి జయమని కేకలిడుడు.

సైనికులు

పుణ్యవతికి జయము, జయము.

అమాబాయి

ఓ నాతండ్రీ, నాయనా, అబ్బా!

సైనికులు

సతి ధన్యురాలు. సతికి జయము, జయము.

[బెంగాలీమాతృక : 'కాహిని' నుండి. నవంబరు ౧౯౨౪]

# శాకుంతలములో నాటకశిల్పము



= శ్రీ నండూరి కృష్ణమాచార్య =

"కావ్యేషు నాటకం రమ్యం
నాటకేషు శకుంతలా
శాకుంతలే చతుర్థోఽంకః
తత్ర శ్లోకచతుష్టయమ్"

సారస్వతకళలలో నాటకరచన ఉత్కృష్టసృష్టి. 'కావ్యేషు నాటకం రమ్యం', 'నాటకాంతం సాహిత్యం' అను సూక్తులు ఈ అర్థమునే ప్రవచించుచున్నవి. కాని, యీ సూక్తులకు సాహిత్యవేత్తలు అనేకవిధముల వ్యాఖ్యానము చేయుచున్నారు. సంగీతము, చిత్రలేఖనము, కవిత్వము తోడుగా నాట్యరూపమున అభివ్యక్తమగుచున్న మిశ్రకళ నాటకము. ఒక కళావిదుడు "చిత్రలేఖనములో దేవుని దర్శించెదను. సంగీతములో విందును. కవిత్వములో అనుభవించెదను" అని తన రసానుభూతిని ప్రపంచించినాడు. అయిన నాటకకళ విరాట్పురుషుని విశ్వరూపప్రదర్శనము. ఆనందబ్రహ్మయొక్క లీలాతాండవము.

కళాప్రపంచమున నాటకమునకు గల విశిష్టస్థానమును వేరొకవిధముగా సాధింపవచ్చును. సమస్తకళలకు ప్రాథమికదశలో ప్రాక్తనమానవుని హృదయము ఆశ్రయము. వనచరుడుగా, శాఖామృగముగా సంచరించు ప్రాక్తనమానవుడు హృదయము రసతరంగితమైనపుడు చిందులు త్రొక్కుచు పదము పాడినాడు. ఈ ఆటవిక తాండవమును ప్రస్తరించిన తాళలయాన్వితమైన నాదము, విన్యాసవిక్షేపాత్మకమైన నృత్తము, భావార్థసమన్వితమైన శబ్దములుగ విడివడును. ఇవి పరిణామదశలో సంగీతము, నాట్యము, కవిత్వము అను ప్రత్యేకకళలుగా అభివృద్ధి చెందినవి. ఇట్లు విడివడి పరిణతిగన్న కళలన్నియు తిరిగి ఒకచో సంగమించినది నాటకరూపముగనే. ఇది నాటకవిద్యలోని విశిష్టత.

ప్రతీచీసాహితిలోగూడ నాటకవిద్యకు ప్రత్యేకగౌరవము కలదు. గ్రీకులు ప్రాచీనప్రతీచీసాహితికి విద్యాగురువులు. గ్రీకులలో అలంకారవిద్యకు మూలపురుషుడైన అరిస్టాటిలుపండితుడు రూపకనిర్మాణమునకు కావ్యసృష్టిలో అగ్రస్థానము నిచ్చియున్నాడు.* దృశ్యకావ్యము సంగీతనాట్యకళాసాహచర్యమున శ్రవణానందము నేకాక నయనానందమునుగూడ కల్పించును గనుక ఇంద్రియములు రసస్నిగ్ధములై సామాజికులకు సద్యోరసప్రతీతి కల్పించునని యీతని సిద్ధాంతము. ఒక పాశ్చాత్యవిమర్శకుడు "నాటకకవి సృష్టికర్త: ప్రతినాటకము ఒక పిండాండము" అని ప్రవచించినాడు. (**"Every drama is a Microcosm in which the Poet himself is the creator"**) నాటకసృష్టి విశ్వసృష్టికి సంవదించును. సృష్టికర్త తాను సృజించిన పదార్థము లన్నిటిలో నిమిడియున్నను, సృష్టికి సర్వథా అతీతుడే. స్రష్టకు 'బాహ్యాభ్యంతరవర్తి' అను విశేషణ మీఅర్థమునే సూచించుచున్నది. అట్లే నాటకకవికూడ తాను సృజించిన పాత్రలన్నిటిలో నిమిడియున్నను ఆపాత్ర లన్నింటికిని అతీతుడే. విశ్వసృష్టికి ప్రతికృతిగ తన కథాప్రపంచమును నిర్మించి, అందు తాను సృజించిన పాత్రలను అనుగుణముగా నడపుటయే నాటకకవి చూపవలసిన ప్రతిభ. "అపారే కావ్యసంసారే కవిరేవ ప్రజాపతిః" (అపారమైన కావ్యప్రపంచమునకు కవియే సృష్టికర్త) అను ఆలంకారిక ప్రవచనము నాటకకవియెడ మిక్కిలి సార్థకము. తత్త్వవేత్తలుగూడ ఈ రహస్యమును

---

***. Tragedy is a nobler form of Art than Romance.—Aristotle: 'Poetics.'**

**Tragedy has everything that romance has and in addition-no small assets-music and exhibition where by the gratification of each factor is intensified.—Aristotle.**

గుర్తించియే కాబోలు పరమాత్మను "జగన్నాటక సూత్రధారి"గ, జీవులను "పాత్రధారులు"గ, ప్రపంచమును "రంగస్థలము"గ ఉపమించుచున్నారు. విశ్వసాహిత్యములో మహానాటక కవులుగ విఖ్యాతిగాంచిన కాళిదాసు, షేక్స్పియరు, గెథే మహాకవులు తమ నాటకకథా సంవిధానములలో ఈ సత్యమును అంతర్లీనముగ ప్రదర్శించిరి. చక్కగా కవిత చెప్పవచ్చును. సంభాషణ చతురతతో నడుపవచ్చును. పాత్రల చిత్తవృత్తుల మనోధర్మపరిజ్ఞానముతో అత్యద్భుతముగా చిత్రింపవచ్చును. కాని అంతమాత్రముతో నుత్తమ నాటకసృష్టి కాజాలదు. సమస్తసృష్టికి ఆధారభూతములై జగచ్చక్రమును నడుపు ధర్మములనువలె, నాటక కథాజగత్తును పరిపాలించు ధర్మసూత్రములను గుర్తించుకొని నాటకకవి అసిధారావ్రతముగా పాలింపవలెను. "కవితాశైలిలో కృతార్థులైనను అనుభవజ్ఞులుగాని నాటకకవులు మూర్తినిర్మాణములో కృతకృత్యులు కాలే"రని అరిస్టాటిలు పండితుడు ప్రతిపాదించినాడు. (**"Beginners succeed in diction and fail in form"**) ఉత్తమనాటకకవి తన కథాసంవిధానములో జీవితపరమావధిని పరామర్శించి అంతర్గర్భితముగా ప్రదర్శించును.

కావ్యప్రపంచములో నాటకము ప్రశస్తిగాంచుటచే 'నాటకాంతం కవిత్వం' అను సూక్తి పుట్టినది. సంస్కృతనాటకములలో 'నాటకేషు శకుంతలా' అను వాక్యము అగ్రతాంబూలమును అభిజ్ఞానశాకుంతలమున కొసగుచున్నది. శాకుంతలమునకు ప్రతిష్ఠ ప్రాచ్యసారస్వత ప్రపంచముననేకాక ప్రతీచీకవితాలోకమున గూడ కలదు. జార్మణ్యకవి, ఆలంకారికుడు నైన గెథేమహాకవి శాకుంతలమును చదివి ఉప్పొంగినాడు. రసావిష్టుడై "స్వర్గమర్త్యలోకముల బాంధవమొకచో చూడగోరిన శాకుంతలములో గల"దని కవితాగీతిక లాలపించినాడు.

పాశ్చాత్యవాఙ్మయమున 'ట్రాజెడీ'లను విషాదాంత రూపకములకే యెక్కువ ప్రశస్తి గలదు. సంస్కృతాలంకారికులు విషాదాంతరూపకములను నిషేధించినారు. ట్రాజెడీలోని కళావిన్యాసమును రసజ్ఞులగు సంస్కృతాలంకారికులు గ్రహింపకపోలేదు. మరణాంతరూపకము భారతసభ్యతాప్రవృత్తికి వ్యతిరేకము. ఎన్ని పతనోద్ధారములతో నిండియున్నను, మానవజీవితము కల్యాణోదర్కమే నని ప్రాచీనప్రాచ్య సాహితీపరుల మతము. కావ్యరసాస్వాదనానంతరము పఠితగాని, సామాజికుడుగాని నిర్వేదముతో క్రుంగి వైరాగ్యముతో పోగూడదు. అట్లు గాకపోయినచో కావ్యమువలన కలుగు రసానందమువలన సుఖితులకుదక్క దుఃఖితులకు ప్రయోజనము లేదు. అదియును గాక, భారతీయునకు మరణ మనిన జీవితమునకు పరిసమాప్తి కాదు. యథార్థముగా, కళాదృష్టితో జూచిన ట్రాజెడీవల్ల కలుగు కావ్యప్రయోజనమును కాళిదాసు శాకుంతలమును విషాదాంతము చేయకుండగనే సాధించినాడు.

గ్రీకు సారస్వతములో ట్రాజెడీ ఉత్తమోత్తమ స్థానమును గడించినది. అరిస్టాటిలు మహాశయుడు తన 'కావ్యాలోకము'న (**Poetics**) ట్రాజెడీకి ప్రధానమైన కావ్యప్రయోజనము సామాజికుల భావములను 'క్షాళన' చేయుట అని నిర్వచించినాడు.* ఈక్షాళనను కరుణరసపూరితములైన సన్నివేశములద్వారాను, భయానక సంఘట్టనములవల్లను కలుగజేయవచ్చును. క్షాళన (**Cathorsis**) అన్న మాటకు పండితులు పలువిధముల భాష్యము చేయుచున్నారు. కాని యీశబ్దమును సంస్కృతాలంకారికుల 'భావితాంతఃకరణప్రవృత్తి'తో పోల్చవచ్చును. ఆంగ్లవిద్వాంసులు (**Purgation of emotions**) 'భావములను భావనచేయుట' అని వ్యాఖ్యానము చేయుచున్నారు. అరిస్టాటిలు పండితుని నిర్వచనమును బట్టి చూచిన శాకుంతలము విషాదాంతము గాకపోయినను, ఉత్తమోత్తమమయిన ట్రాజెడీ! భారతములోని ఇతివృత్తమునకును, అభిజ్ఞాన శాకుంతలములోని కథాసంవిధానమునకును గల భేదమును పరిశీలించిన ఈ విషయము స్వయంవ్యక్తము కాగలదు. భారతములోని కథనే కాళిదాసు అనుస

---

***. Tragedy is the imitation of an action that is serious.........through pity and fear effecting the Cathorsis of emotions—Aristotle; 'Poetics.'**

రించిన నాటకము పంచమాంకములోనే అశరీరవాణి సహాయమున శకుంతలాదుష్యంతుల సమాగమముతో కల్యాణాంతముగ పరిసమాప్తి కావలసినది. కాని అట్లు శకుంతలాదుష్యంతుల సమాగమమును కల్పింపలేదు. కథను ముగింపలేదు.

పంచమాంకములో కాళిదాసు మహాభారతము నతిక్రమించి క్రొత్తదారిని త్రొక్కినాడు. హంసపదిక అంతఃపురగీతికతో పంచమాంకము ప్రారంభించుచున్నది.

అభినవ మధులోలుప స్త్వం
  తథా పరిచుంబ్య చూతమంజరీమ్
కమలవసతిమాత్ర నిర్వృతో
  మధుకర! విస్మృతోఽస్యేనాం కథమ్.

క్రొంగ్రొత్తతేనెలను కాంక్షించు మధుకరుడు కమలవసతిమాత్రముచే నిర్వృతిజెంది వెనుకటి చూతమంజరి స్నేహమును మరచుటను ఉపాలంభించుచున్న దీగీతిక. ఇందలి ధ్వని ప్రణయచాంచల్యము. శకుంతలను మరచి అంతఃపురములో కాలము పుచ్చుచున్న దుష్యంతుని కీగీతరాగము సూటిగా నాటినది. ఈధ్వని భిన్నహృదయములలో భిన్నముగా ప్రతిధ్వనించినది. హంసపదిక గానాలాపము చేయుచున్నది. ఆమెహృదయము నిగూఢము. కేవలగానమేనా అది? కావచ్చును. కాక, అన్యనాయికాలోలుడైన ప్రియుని అన్యాపదేశముగా ఎత్తిపొడుచుటయా? దుష్యంతునకు రెండవ అర్థము స్ఫురించినది. సామాజికులకో? వైరెంటికి విలక్షణమైన ధ్వని. శకుంతలను మరచి, భోగలాలసుడై అంతఃపురములో కాలము గడుపుచున్న దుష్యంత చక్రవర్తి హృదయప్రవృత్తి. వెంటనే, ప్రతియోగముగ, దుష్యంతుని హృదయానుభవమును ఇంకొక శ్లోకములో పొందుపరిచినాడు.

రమ్యాణి వీక్ష్య మధురాంశ్చ నిశమ్య శబ్దాన్
  పర్యుత్సుకో భవతి యత్ సుఖితోఽపి జంతుః
తచ్చేతసా స్మరతి నూన మబోధపూర్వం
  భావస్థిరాణి జననాంతర సౌహృదాని.

సౌందర్యదర్శనమువల్ల, మధురనాద శ్రవణమువల్ల భూతజాలము, సుఖానుభవములో నున్నను, పర్యుత్సుక మగును. మనస్సులో వాసనాబలమున జన్మజన్మాంతర సౌహృదములు మేల్కొనుచుండును. ఇది రాగపరివాహినియైన గీతికాశ్రవణమువల్ల దుష్యంతునికి గల్గిన అనుభవము. సుందరవస్తువు నిత్యానందసంధాయి. (' A thing of beauty is a joy for ever ') అన్న ఆంగ్లకవి కీట్సుపలుకులు కాళిదాసు ప్రపంచించిన అర్థమును లేశమాత్రముగనే ప్రతిధ్వనించుచున్నవి. గాఢమైన అనుభూతి, విస్మృతిసముద్రములో బడి తేరులాడుచు దరిచేరచేయు ప్రయత్నమే దుష్యంతుని హృదయములోని సన్నివేశము. ఇట్లు పర్యుత్సుకుడైన దుష్యంతచక్రవర్తిసభకు కాళిదాసు శకుంతలను ప్రవేశపెట్టినాడు.

రాజసభకు శకుంతల భారతములోవలె భరతుని వెంటపెట్టుకొని రాలేదు. పుత్రజననమువరకు శకుంతలను కాళిదాసు కణ్వాశ్రమములో నుంచలేదు. కన్నబిడ్డవలె పెంచిన శకుంతలను వీడుటకు కణ్వమహర్షి సామాన్యగృహస్థునివలె విలపించినాడు. అయిన దుష్యంతచక్రవర్తియొద్ద నుండి ఆహ్వానమైన లేకుండ నిండు గర్భవతిని ఏల పంపవలసి వచ్చినది? ఏనాడు యౌవనోద్రిక్తయై దుష్యంతుని చిరుకౌగిట కొదిగిపోయినదో ఆనాడే శకుంతల తపోవనములో నుండు అధికారమును కోలుపోయినది. మహర్షి హృదయమున ధర్మమునకంటె మమత్వమున కెక్కువ స్థానము లేదు. అందు చేతనే విచారించి చూచినాడు. క్షత్రియకన్యకు గాంధర్వము స్వీకార్యమే. కావున భగవాన్ కాశ్యపులు శకుంతలను వృద్ధగౌతమితో ప్రియశిష్యులగు శార్ఙ్గరవ శారద్వతుల తోడునిచ్చి దుష్యంతునియొద్దకు సాగనంపినారు. తీయతేలపులతో ప్రియసమాగమమును కాంక్షించుచు మర్మమెరుగని ఆశ్రమవాసిని-విందుచూలాలు రాజధానికి తరలివచ్చినది. ఇంతకాలమువరకు చక్రవర్తి అనాదృతి వహించుటకు కారణమునుగూడ ఊహింపజాలని అమాయికహృదయ ఆర్యపుత్రుని చేర వచ్చినది. కాని, అనుకొనినట్లు ఆర్యపుత్రుడు శకుంతలకు స్వాగతమివ్వలేదు. పరసతీ సౌందర్యమును తిలకించుటకుకూడ ఇష్టపడని ధర్మమూర్తివలె నటించి తల వంచుకొన్నాడు చక్రవర్తి! శార్ఙ్గరవుడు చక్రవర్తికి కణ్వుని సందేశ మందజేసి శకుంతలను అర్పించినాడు.

దుష్యంతుని సమాధానమునకై శకుంతల ఉత్కంఠతో నిరీక్షించుచున్నది.

“కిం చాత్రభవతీ మయా పరిణీతపూర్వా ?”

అని దుష్యంతుడు ఆశ్చర్యచకితు డైనాడు. ఈప్రశ్న అగ్నికల్పమై శకుంతలాహృదయము నావరించినది. గౌతమి తెల్లబోయినది. శార్ఙ్గరవుడు ఉగ్రుడైనాడు. వృద్ధగౌతమి“ముహూర్తం మా లజ్జస్వ”-ఇది సిగ్గుపడుటకు సమయము కాదని శకుంతల మేలిముసుగును తొలగించును. కాని అప్పటికిని దుష్యంతుడు శకుంతలను గుర్తింపలేదు. నిండుసభలో నిరాకృతి. శకుంతల కలలోనైన ఇట్టి వియోగకష్టమును చిత్రించుకొనలేదు. కణ్వమహర్షి గారాబుపట్టిని, నిష్కల్మష హృదయను- పరిణీతపూర్వను పురూరవ చక్రవర్తి దుష్యంతమహారాజు వంచించునా ? ధర్మాధికారి ఇంతటి అధర్మమున కొడిగట్టునా?—జ్ఞాపకము వచ్చినది: అభిజ్ఞానముగా నిచ్చిన అంగుళీయక మున్నది గదా ? ఇది నిర్వివాదమైన సాక్ష్యమేకదా?—భవతు! అంగుళీయకమును ఆనవాలుగా జూపి ఆపత్సముద్రమును తరింపదలచినది.

పాపము ! అంగుళీయక మేదీ ? ఆర్యపుత్రుని అనుగ్రహ మని ఎంతో మమకారముతో దాచుకొన్నది! విధివిపరిపాకమున అంగుళీయకము పోయినది. పాపము! శకుంతల తలవాల్చుకొన్నది.

ఈ అంగుళీయకవృత్తాంతము భారతములో లేదు. ఈ మాత్రకల్పనవల్లనే శకుంతలోపాఖ్యానము శాకుంతలనాటకముగా మారినది. దేనిని గాఢమైన మమకారములో సంరక్షించుచుందుమో దానినే పోగొట్టుకొనుట మానవస్వభావ మని అధునాతనమానసిక తత్వజ్ఞుల పరిశీలన. అతిథిమర్యాదలనుగూడ విస్మరించి ప్రణయోద్వేగములో మునిగియున్న శకుంతలను గాంచి ఈసత్యమునే దూర్వాసమహాముని ఉద్ఘాషించినాడు. అతిథిదేవాగమనమును ఉపేక్షించునంతటి ఉద్వేగముతో అంగుళీయకము నెట్లు కాపాడుకొనగలదు?దూర్వాసుని శాపానుసారము అంగుళీయకము పోయినది. ఇక గత్యంతర మేమి? పోనీ, ఆశ్రమములో రహఃప్రవృత్తములైన ప్రణయవృత్తములను జ్ఞప్తికి తెచ్చిన లాభమేమైన కల్గునేమో !— ఆనాడు వేతసలతామండపమునందు నలినీపత్రములో దుష్యంతుడు ఉదకమును నింపుచున్నాడు. అప్పుడు ‘దీర్ఘాపాంగ’మను హరిణకిశోరము చేరవచ్చియు తొలగిపోయినది. తరువాత శకుంతల ఆ నలినీపత్రమును తీసికొని ఆ లేడిపిల్లకు నీరుపట్టినది. అది చూచి దుష్యంతుడు “ఈ లేడిపిల్ల నన్ను విశ్వసింపకున్నది...సహవాసబలమున నిన్ను నమ్ముచున్నది. మీకు చాల సాదృశ్యమున్నదికదా”అని సమాధానము చెప్పినాడు—ఈజ్ఞాపకములు దుష్యంతుని మనస్సును మరలింపలేదు. తీపిమాటలతో అంగుళీయకమునుండి దృష్టిని మరలింపజూచెడి విలాసిని తేనెపలుకులకు లొంగిపోకూడ దని దుష్యంతుడు తలచినాడు. పెద్దగా చెప్పినఉంగర మేది? చక్రవర్తి సందు చిక్కించుకొని

“స్త్రీణా మశిక్షితపటుత్వ మమానుషీషు
సందృశ్యతే కిముత యాః ప్రతిబోధవత్యః
ప్రాగంతరిక్షగమనాత్ స్వమపత్యజాత
మన్యైర్ద్విజైః పరభృతాః ఖలు పోషయంతి”

అని శకుంతలనేకాక స్త్రీజాతినిగూడ అవమానించినాడు. స్త్రీలకు అశిక్షితపటుత్వము గలదట. స్త్రీకోకిల తన సంతానమును అన్యద్విజకోటిచే పోషింపజేయుచున్నదట. స్త్రీపక్షులకే అంత తెలివితేట లున్న ఇంగితజ్ఞానము గల మానవస్త్రీల మాట వేరుగా చెప్పవలెనా ?

నిరాకృతికి తోడు అవమానము. దుర్భరము!!! నిర్దోషిణి అపరాధినివలె శిక్షకుతోడు పరాభవమును గూడ అనుభవింపవలసివచ్చినది. పాపము ! శకుంతల ఏమి బదులు పలుకగలదు! ఇచ్చట శకుంతల మానములో అనుభవించిన భావావేగము, మనోవ్యథ షేక్స్పియరుకవి ఏపాత్రలకు కల్పించిన మానసికవ్యథకును తీసిపోదు.

శకుంతలమనస్సు ద్వాపరమున (Dilemma) చిక్కినది. అనంతరకర్తవ్య మేమి? ఛీ! ఇక బ్రదుకెందులకు ?—కాని, నిండుచూలాలు—ఫలింపనున్న మాతృత్వము — పోనీ, ఎట్లో అవమానమును దిగమ్రింగి, తిరిగి కన్నబిడ్డకన్న మిన్నగా ప్రేమించి పెంచిన కణ్వమహర్షి ఆశ్రమమునకే పోదలచికాబోలు

వెనుకకు తిరిగినది. గౌతమి కౌగిలించుకొన్నది. కాని- మునిపుత్రుడు శార్ఙ్గరవుడు 'అసు'మని అదలించినాడు.

"యది యథా వదతి క్షితిప స్తథా
త్వమసి కిం పితు రుత్కులయా త్వయా
అథ తు వేత్సి శుచివ్రత మాత్మనః
పతికులే తవ దాస్యమపి క్షమమ్."

"ఈరాజు చెప్పు మాటలే యథార్థములైన ఇక తండ్రిచేయదగిన దేమున్నది? లేక పరిశుద్ధవని నీకే తెలిసియున్నప్పుడు పతిగృహములో దాసీత్వమే మంచిదిగదా!" అర్థవంతములైన ఈవాక్కులు దుష్యంతుని నిరాకృతికంటె, రాజసభలోని పరాభవముకంటె వాడిగా మానవతియగు శకుంతలహృదయమును నాటినవి. ఆమె విస్తబ్ధయై నిలిచినది. గౌతమి ప్రక్కకొదిగినది. "ఈరాజు చెప్పిన మాటలే యథార్థములైనచో—ఏమి? మునిపుత్రుడు శకుంతలాశీలమును శంకించుచున్నాడా?—అది విషయాంతరము. ఆవిషయమై మునిపుత్రునకు అభిప్రాయమే లేకపోవచ్చును. శకుంతలయే సర్వవిషయములు ఆలోచించుకోవలెను. అతనికి తెలిసిన ధర్మ మొక్కటే—రాజవచనములే సత్యమైన, దుశ్శీలకు తపోవనములో చోటే లేదు గదా. శకుంతలావచనములే యథార్థములైన ఆశ్రమములో అంతకంటె చోటులేదు. భర్తృగృహమందు సతికి దాసీత్వమైన విహితవిధియే కావున. ధర్మనిర్వహణములో మునిపుత్రుని హృదయములో జాలి కూడ లేదు. ధర్మ మింత నిష్ఠురమా?

శకుంతలాదుష్యంతుల ప్రణయము రహఃప్రవృత్తము. యౌవనోద్రేకమున నడచిన గాంధర్వవివాహ మది. కామశబలితమైన గాంధర్వములోని ప్రణయమునకు స్థిరత్వము లేదు. అది కను వేదురు. (Love at first sight) అట్టి ప్రణయమునకు దాంపత్యధర్మనిర్వహణాధికారము లేదని కాళిదాసు అభిప్రాయము. కథాసంవిధానములో అంతర్గర్భితముగా పొందుపరిచిన జీవితపరామర్శ. ఈ రహస్యమే కుమారసంభవములో గూడ కన్పట్టుచున్నది. వసంతపుష్పాలంకృతయై సమీపించిన పార్వతిని జూచినప్పుడు—శంభుడు జితేంద్రియుడయ్యు చంద్రోదయారంభమున అంబురాశివలె ఈషత్పరిలుప్తధైర్యుడైనాడు. అప్పుడే ఆమెను గాంధర్వవిధి పరిగ్రహింపవచ్చును గదా? కాని, అట్లు చేయలేదే! ఇంద్రియవికారమునకు కారణభూతుడైన కాముని భస్మముచేసి స్త్రీసాంగత్యమును పరిహరించి తిరిగి నిర్వికల్పసమాధినిష్ఠుడైనాడు. పార్వతి తన రూపమును నిందించుకొనుచు తపస్విని యైనది. పార్వతితపస్సు ఫలించినది. మాయాబ్రహ్మచారియై పరమశివుడే ఆమె ననుగ్రహించినాడు. ఇక లోటేమి? ఇకనైన వారు గాంధర్వమును స్వీకరింపవచ్చునుగదా! ఇక గాంధర్వమునకు తావు లేదు. ప్రణయచాంచల్య మేనాడో నశించి తపఃపరిపూతమై స్థిరసౌదామినివలె వెలుగొందుచున్నది. అప్పుడు మంత్రపూతమైన గార్హస్థ్యమునే పార్వతీపరమేశ్వరులు స్వీకరించిరి. అరుంధతి ముత్తయిదువ. సప్తర్షులు పౌరోహిత్యమును నెరపిరి. హిమవంతుడు సమంత్ర కన్యాదానము చేసెను.

కాని శకుంతలావివాహ మట్టిది కాదు. యౌవనోద్రేకమునకు మీరరాని ఫలము రాజసభలో శకుంతలకు సంభవించిన వియోగము. ఇది అవశ్యమనుభోక్తవ్యము. దానికి శార్ఙ్గరవుడు బాధ్యుడు కాడు. అతనికి వచ్చిన పని అయిపోయినది. వృద్ధగౌతమిని మరలించుకొని శారద్వతునితో గలసి ప్రయాణమైనాడు. శకుంతల దిక్కులేనిదానివలె నిలిచిపోయినది. అటు కన్నవారు, ఇటు పెంచినవారు, తుదకు పరిగ్రహించిన భర్త-అందరును వదలివేసిరి. ఒకమారు రాజువంకను, మరియొకమారు గౌతమివెంటను తీక్ష్ణదృక్కులు నెరపినది. కాని గౌతమికూడ చివరకు వదలిపోయినది. ఇంతకంటె వేరు ట్రాజెడీ ఏమున్నది? నాయికను చంపకుండగనే కాళిదాసుకవి అత్యద్భుతట్రాజెడీని కల్పించినాడు! కాళిదాసు కఠోరహృదయుడు. తల్లీ! ఆకాశవాణీ! భారతములోవలె నీ విప్పుడైన నోరువిప్పి నిర్దోషిణిని కాపాడజాలవా! — ఏమి-ఏమూలనుండియు చప్పుడు కూడ వినబడుటలేదే! ఏమి నిశ్శబ్దము. ఏమిని స్తబ్ధత! ఒక్క నిట్టూర్పుగూడ ప్రసరించుటలేదే! ఏమి కాళిదాసు కవిచాతుర్యము!! ఇట్టి నాటకీయమైన అత్యద్భుత సన్నివేశమును పంచమాంకములో కవి పొందుపరచినాడు. పూర్వోదాహృతములైన

నాలుగు శ్లోకములును సన్నివేశకల్పనములకు ఆయువుపట్టులు.

కాని 'శాకుంతలే చతుర్థోంకః' అను వాక్యము నాటకములో విశిష్టత చతుర్థాంకమున కొలదు చున్నది. ఈవిమర్శశ్లోకములోని అభిప్రాయము ముక్తభావగ్రస్తముగ చెప్పబడినది. కావ్యములలో నాటకము రమ్యము; నాటకములలో శకుంతల ఉత్తమము అనునప్పుడు కవినిష్ఠ నాటకము మీద కన్పడుచున్నది. కావ్యసారము నాటకము. ఆ నాటకములోని సారము శాకుంతలములో నున్నదని, అందునను చతుర్థాంకమున నున్నదని చెప్పుట యగును. చతుర్థాంకమున కణ్వమహర్షి కన్నబిడ్డవలె పెంచిన శకుంతలను అత్తవారింటికి పంపుట వర్ణితము. కణ్వునితోపాటు ప్రకృతికూడ శకుంతలావియోగ భారమున దుఃఖించినది. 'యాస్యత్యద్య' మొదలుగా గల శ్లోకచతుష్టయ మీమధురవ్యథను మధురాతిమధురముగా వర్ణించుచున్నది. అందుచేతనే 'తత్ర శ్లోక చతుష్టయం' అను ప్రశస్తి కల్గియుండును. కాని యీ చక్కని కవిత్వమునకే నాటకములలో 'శాకుంతలము'నకు ప్రథమస్థానమును, చతుర్థాంకమునకు విశిష్టత రావలెననుట పొసగదు. నాటకములో కవిత్వమునకంటె ప్రధానధర్మములు కలవు. ఒకవేళ కవిత్వమునకే కాళిదాసు శాకుంతలనాటకమును వ్రాసియుండిన దానిని అతడు శ్రవ్యకావ్యముగా వ్రాసియుండునుగాని దృశ్యకావ్య మొనరించియుండడు. కావున ప్రకృతి వర్ణనాత్మకమైన చతుర్థాంకమును, మధురభావాన్వితమైన ఆ శ్లోకచతుష్టయమును శాకుంతలనాటకశిల్పమునకు తార్కాణములు కాజాలవు. ఒకవేళ 'శాకుంతలే చతుర్థోంకః' అనుదానికి సమ్మతించిన, ఆశ్లోకములో పూర్వోత్తరార్థములకు వైరుధ్యము గోచరించును. కావ్యజాలములోని మేలిగుణము నాటకములో నున్నది. సరే! నాటకములలో శాకుంతలము శ్రేష్ఠము. కాని ఆ శాకుంతలనాటకములోని గొప్పతనము చతుర్థాంకమున లేదు. ఒకవేళ- ఉన్నయెడల అంతవరకు కథ భారతములోనిదే! భారతములోగూడ కలదని చెప్పవలసి వచ్చును. అప్పుడు 'కావ్యేషు నాటకంరమ్యం' అన్న పూర్వవాక్యమునకు వ్యాఘాతము సంభవించును. కావున నాటకీయమైన పంచమాంకమునకు, పూర్వోదాహృతములైన అందలి శ్లోకచతుష్టయమునకే యీ ప్రశస్తి దక్కవలెను.

కళాదృష్టితో చూచునప్పుడు ఈ శ్లోకమును

"కావ్యేషు నాటకం రమ్యం
నాటకేషు శకుంతలా
శాకుంతలే పంచమాంకః
తత్ర శ్లోకచతుష్టయం"

అని మార్చిన ఎక్కువ అర్థవంతముగా నుండును.



# వీరవల్లడు

[ఆఖ్యాయిక]

## = శ్రీ విశ్వనాథ సత్యనారాయణ =

### 3

ఆపద కడవం బెట్టను-ఓపి శుభంబైనదాని నొడగూ
ర్పను మా-కీపుట్టువునను పాండు-క్ష్మాపాలుడు
నిన్ను చూపి చనియె మహాత్మా.

అనే పద్యము చదువుకున్నాడు మునసబు గారు. ఇంకా సరిగా తెల్లవారలేదు. ఆయనభార్య వెంకాయమ్మగారు వాకిట్లో ముగ్గులు పెడుతోంది. ఆయన అప్పుడే ముఖం కడుక్కున్నాడు. ఆ కనపడీ కనపడని వెలుగులో అద్దం చూచుకొని నామం పెట్టు కుంటున్నాడు. వారు కమ్మవారు. ఆయన ప్రతి దినం తెల్లవారకముందే లేచి కాల్యకృత్యాలు తీర్చు కొని వీథిఅరుగుమీద గడపమొగదల కూర్చుండి దంత ధావన చేసి, రోజూ, తిరుమణితిరుచూర్ణాలు దిద్దుచూ భాగవతంలోవీ, భారతంలోవి పద్యాలు చదువుతూం టాడు. ఆవేళకు నేను అక్కడికి వెళ్లాను. నేనూ అప్పటికే లేచాను. మాదొరపాలం పదిరోజులైంది గూడేసి. నాలుగైదురోజుల్లో కొడదా మనుకుంటు న్నాము. ఇంతలో సన్నగా నాకు కబురు తెలిసింది. మునసబుగారి ఆవుకి ఏదో దొమ్మ వేసింది. ఊళ్లో ఏ పశువుకి జబ్బుచేసినా వైద్యం నేనో, గవల గూడెంలో వీరయ్యో. మునసబు రాయప్పగారి పక్షం చేరి నన్ను పిలుస్తాడో పిలవడో. వీరయ్య ఊళ్లో లేడు. నేనే ఏదో పని ఉన్నట్టు వారి వాకిటిముందుగా బయల్దేరాను. మునసబు కొంచెం నోటిదురుసువాడు. అయినా భోళావాడు. అట్టే పట్టుదల లేనివాడు. నేను కనబడితే ఎట్లాగూ పలకరిస్తా డని నాకు తెలుసు. అందులో ప్రొద్దున్నే భక్తిగా పద్యాలు చదువుతూండే వేళాయెను. అనుకున్నట్టుగానే "ఒరే, వల్లా, నువ్వేనా"అన్నాడు. "అవును తాతా" అన్నాను. మునసబు నాకన్న పదేళ్లు చిన్నవాడు. నాకు మనుమడువరుస. "ఒరే, ఆవుకి దొమ్మచేసింది. ఆవును పోయి చూసి ఏదన్నా పోసిపో" అన్నాడు. నేను "తాతా, ఆ పద్యం మళ్లీ చదువు"అన్నాను. ఆయన మళ్లీ చదివేడు. చదివి "అని కృష్ణభగవాన్ముణ్ణి ధర్మరాజయ్య అడిగేడు"అన్నాడు. నేను "నీవు కృష్ణమ్మ అంటి దొరవు"అన్నాను. మునసబునకు చప్పున తెలియలేదు. నే నావుని చూశాను. నోరు తెరచి నాలిక బెలికలపెట్టి 'అంబా' అనలేకుండా ఉంది. పాడిఆవు. రోజూ మునసబు ఆవుమజ్జిగ గాని పోసుకోడు. ఆయనతల్లి ముసలావిడ, గానమ్మ, ఆవునెయ్యిగాని పుచ్చుకోదు; ఆవుమజ్జిగగాని పోసు కోదు. ఇది తల్లీకొడుకుల వ్రతం. ఆ ఆవుకే నెయ్యి ఉపచారాలు చేస్తారు. ఊళ్లో వీరయ్య లేడు. నన్ను పిలవటానికి మొగమాటం పడ్డాడు. నే నావును చూస్తూంటే గానమ్మ వచ్చింది. "ఓరి వల్లా, మాయ దారివాడా, ఎక్కడికి పోయావు, రెన్నాళ్లపట్టి ఒట్టి సాంబారుమెతుకులు తింటున్నాం" అన్నది. మున్సబుగారి ముంగిటి వసారాలో ఎప్పుడూ వెదురు గొట్టం చూరులో దూర్చిఉంటుంది. అది నేనే తీసి కంచలవెంట వెతికి మందాకు తెచ్చి పసరు పిండి గొట్టంలో పోసి ఆవుమెడసందిట్లో పట్టుకొని మందు నోట్లో పోశాను. "పరవాలేదు, ప్రొద్దు నడినెత్తికి తిరిగేటప్పటికి ఆవమ్మ మేతకు మళ్లుతుం"దన్నాను. నే నావుకి చికిత్స చేస్తూంటే మున్సబు వచ్చి ప్రక్కనే నిలుచున్నాడు. గానమ్మ కొంచెం దూరంగా నిలుచుంది. మందు పోయటం అయిం తర్వాత మున్సబు అన్నాడుకదా, "ఒరే తాతా,

నేను కిష్టమ్మ నన్నావుకదా. అంటే ఏమిటి?" అని. ఇంతలో గానమ్మగారన్నది—"ఏరా వల్లా, నీవంటి వాడవై మీదొరల్ని తీసుకోరాలేవా? ఆరాయప్ప మాయం మాడిపోను, ఆడు పిల్లల్ని ఎళ్లకొట్టాడు, నీవేమో పట్టించుకోకుండా ఉన్నావు. నా కొడుకు రాయప్పపక్షం చేరాడు. ఇదంతా ఊరు బాగుపడేందుకు రాలేదు లే. పిడపకాలం వచ్చింది. ఇంకా ధర్మం ఎక్కడ? నే చెబుతున్నాకదా. ఈఊరు పట్టపగలు తగలడుతుంది, చూస్తూఉండు" అంది. నేను "ఆ ధర్మపురోజులు పోయి చాలా రోజులైంది. ఊరి మున్సబు ధర్మం చెయ్యకపోతే మరెవ్వరు చేస్తారు? నేను ముప్పైఏళ్ల పట్టి చూస్తున్నాను. ఈ దొడ్లో గొడ్డుకి జబ్బుచేసి ఎరగను. అందులో పాడిఆవుకి దొమ్మ వస్తుందా? పెద్దదొర ఉన్నప్పుడు—పెద్దదొర అంటే మున్సబు తండ్రి—ఈ ఇల్లు ఊరుకంతా సుఖంగా ఉండేది." అన్నాను. మున్సబు "ఒరే తాతా"అన్నాడు. నేను "బాబూ, బాబూ, క్షమించు. ఏదో పెద్దముండా కొడుకుని అన్నాను"అని అన్నాను. అన్నాను, వెళ్లిపోతున్నాను. వెనకనుంచి గానమ్మగారంటోంది: "ఒరేనాయనా, మన కిది క్షేమం కాదు. వీరడు కల్లా కపటం ఎరుగని ముండాకొడుకు. ఆ చచ్చిపోయిన బ్రాహ్మడు ధర్మరాజు. ఇది వాళ్ల గడ్డ. వాళ్లది పెద్దకుండ. ఆడి పిల్లలు అలోలక్ష్మణా అంటూ వెళ్లారంటే ఈ ఊరుకి కొట్టితీరుతుంది"అని ఏమేమో అంటోంది. నాకు తెలుసు. ఇది చాలని. ఇంక కరణము, నాయకుడు ఉన్నారు. మున్సబు ఎడ్డెం అంటే కరణం తెడ్డెం అంటాడు. కాని కరణానికి మా దొర చాలా చేశాడు. మునసబుని పట్టి కరణంకూడా తిరిగిపోతాడని నమ్మకం లేదు. ఆయనకు వేరే పాచిక వెయ్యాలి. అది నెమ్మదిమీదగాని కుదురదు. ఈలోపుగా నాయకుణ్ణి తిరగతీయాలి. నాయకుడు సాయబ్బు. అతనికి అరవై ఏళ్లుంటవి. అతని కొక్కడే కొడుకు. పదేళ్లవాడు. అతని పేరు శివేరు. ఈనాయకుణ్ణి మాఊరు తీసుకోవచ్చింది మాదొర. నాయకుడికీ యానాదిగంగడికీ స్నేహం. పూర్వం ప్రతిపల్లెటూరికీ ఒక యానాదివాడో, చెంచువాడో కాపలాఉండేవారు. వాళ్లు ఉన్నన్నాళ్లూ ఊళ్లో దొంగతనం జరగటానికి వీలులేదు. చేస్తే వాళ్లే చేసేవాళ్లు. చేసినా సద్దా, గోచీ, చెంబూ, తప్పేలా, కుంచెడో మానెడో జొన్నలూ యీలాంటి వెత్తుకపోయేవాళ్లుతప్ప దోచుకపోవటాలుండవు. ఆ సంగతి నీకు చెపుతానుగా. ఈ గంగడికి నే నంటే భయం. ఎందుకంటే గంగడు కన్నాన పోయి కన్నాన వస్తాడు. మన ఊరు చుట్టుపట్ల ముప్పై నలభై ఊళ్లల్లో ఉండే కాపలాలవాళ్లందరికీ వీడు నాయకుడు. వాడు చీకట్లో నేలమీద పడుకొని బల్లివలె చేతులమీద పడి పరుగుల దూరమైనా కప్పగంతులుగా దాటిపోతాడు. కోలుపు కజ్జినీడలో దాక్కుంటాడు. వాడిని బ్రహ్మదేవుడు పట్టుకోలేడు. వా డొకసారి ఒక కమ్మవారింట్లో కన్నం వేస్తూంటే, నేను వీథివెంట పోతున్నాను. వాడు అలికిడి తగిలి బల్లివలె గోడకు అత్తుకున్నాడు. అత్తుకున్న దెక్కడ? వీథిగోడకు తేసురుపరదాలు పెడితే ఒక పరదాలో కలిసిపోయినాడు. అప్పుడు వాణ్ణి కనిపెట్టటానికి కన్ను చాలదు. దగ్గరకు పోయినామయ్యా, వాడు దూకితే పది గజాలు దూకిపోతాడు. వాణ్ణి పట్టుకోటానికొకటే మార్గం. నేను నుంచున్నవాణ్ణి నుంచున్నట్టుగా వాడి దగ్గరకు కుప్పించి దూకేను. వాడి రెండు చేతులూ నాచేతుల్లో ఉన్నై. వాడు ఇనపతీగవంటి ముండాకొడుకు. ఆముదం పూసిన చువ్వకజ్జల్లే జారిపోయేటంత సులువు తెలిసినవాడు. అల్లాంటివాడు నా పట్టు తప్పించుకోలేకపోయినాడు. ఎట్లాగూ తప్పించుకోలేము కదా అని తెలిసి "వల్లయ్యా, ఇంక వదులు" అన్నాడు. నేను 'నువ్వా' అని వదిలేను. అప్పటి నుంచీ నేను గంగడిచేత ఏమి చేయించలేను? వాణ్ణి పిలిచి "ఏమయ్యా, ఇది నాయమేనా? మీనాయకుడు రాయప్పవైపు చేరాడు. మా దొరలూ దొరసానీ లేచిపోయినారు. నీవూ చూస్తున్నావుగా" అన్నాను. వాడు"మునసబు మనవైపేనా"అన్నాడు."ఆ. ఇవ్వాళ నుంచీ మనవేపే" అన్నాను. గంగడు "ఐతే శివేరు సాయబూ మన వైపేను" అన్నాడు. నేను "నీవు మాట్లాడి ఆయన్ని మనవైపు తిప్పాలి" అన్నాను.

గంగడు "నీవు రేపు ప్రొద్దున రా. నీకు చెప్తానుగా" అన్నాడు. మరునాడు ప్రొద్దున నేను గంగడి గుడిసెకు వెళ్లాను. అక్కడ శివేరు సాయబు ఉన్నాడు. నాయకు డిట్లా అంటున్నాడు. "ఒరే గంగా, అది మా తాతయ్య థాళీ. అది మా నాన్న వాడుకున్నాడు. నాకు ఇచ్చాడు. కొంపలో ఉన్న కుంచెడు జొన్నలూ తీసికుంటే తీసికున్నావు. ఆ చెంబు నా కిచ్చెయ్యి" అని. గంగ డా రాత్రి నాయకుడింట్లో అవి ఎత్తుకో వచ్చాడు. గంగడు తొణక్కుండా బెణక్కుండా "నీ యింట్లో ఎవరూ దొంగతనం చెయ్యలే రన్నావే" అన్నాడు. నాయకుడు "అరే! నీవు చేస్తావని నాకేమి తెల్సు. మరింకోడెవడైనా అయితే మట్టెలు విరగతీస్తాను. నీవు వస్తావనే నేను అనుకోలేదు." అన్నాడు. గంగడు "నీకు కావలసివస్తే జొన్నలు తీసుకో. చెంబు నా క్కావాలి" అన్నాడు. నాయకుడు "మున్సబుతో చెపుతా" నన్నాడు. గంగడు "మున్సబుతో చెప్పేటట్టయితే చెంబుకూడా తీసికోపో. నీయింట్లో ఎవరూ దొంగతనం చేయలే రన్నావు. అందుచేత చేశాను. మునసబుతో చెప్పకుండేటట్టయితే రెండూ తీసుకపో. నాతో పందె మాడేవు. నీ యింట్లో నేను దొంగతనం చేస్తే నే నడిగింది యిచ్చి నీ వస్తువు నీవు తీసికెళ్తా నన్నావు. కనక నే నడిగింది యిచ్చేసి నీ తాతచెంబు తీసికెళ్లు" అన్నాడు. నాయకుడు "సరే, అడుగు ఏమడుగుతావో" అన్నాడు. గంగడు "నే నడిగేది ఏమీలేదు. వల్లడూ నేనూ ఒక పక్షం. నీవు మాపక్షాన ఉండాలి." అంటే నాయకుడు "రాయప్పగారి విషయమా? రాయప్ప పెద్ద రైతు. ఆయనతో తకిలీఫ్ నా కెందుకు" అన్నాడు. నేను "రాయప్ప పెద్దరైతా, నాదొర పెద్దరైతా? నాదొర చచ్చిపోతే రాయప్ప మరీ పెద్దరైతు ఐనాడు కాబోలు" అన్నాను. నాయకుడు "నన్నేమి చేయమంటావో చెప్పు". అన్నాడు. గంగడు కోపంకొద్దీ "నీ కంత యిష్టం లేకపోతే నీచెంబు నీవే తీసుకెళ్లు" అని చెంబు వాకిట్లో పడేశాడు. నాయకుడు నవ్వి "అరే, గంగా, ఏమిరా అంత పొగరు! నీకు? నేను మీపక్షమే పో. చెంబు నీవే మాయింటికి తీసుకోరా" అని వెళ్లిపోయినాడు. గంగడు "యింక వెడితేపోడులే. తాత చెంబుకోసం అంత ఏడిచేవాడు న్యాయాన్ని వదలి ఎక్కడికి పోతాడు?" అన్నాడు.

ఇంక కరణం ఉన్నాడు. కరణాన్ని ఎట్లా సాధించాలో తెలియలేదు. రాయప్ప, కరణం యిద్దరూ జంధెపుపోగువాళ్లు. కనక యిద్దరినీ విడతీయటం కష్టం. అయినా మున్సబు, నాయకుడు నాపక్షం. అయితే కరణం నెమ్మదిగా నాపక్షం తిరుగుతాడులే అని ధైర్యం. కాని ఎత్తొకటి వేసి చూద్దామనిపించింది. కరణంగారికి చెప్పుల జోళ్ల సరదా ఒకటి ఉంది. నాగుబెసలు పెట్టి, అద్దాలు పెట్టి, బనారసు కుంచెలు పెట్టి, కిల్టు ఉండేటట్టుగా పాదమంతా పూజలలో చేసిన చెప్పులుగాని తొడగరు. ఆయన కదొక షోకు. ప్రతి మూడునెలలకూ క్రొత్త జోడు కావాలి. మాదిగ పొబ్బడు పెట్టివాడు. వాడు ఏడాదికి మూడు జోళ్లూ కుట్టి యివ్వాలిసిందే. అందులో ఒక రోజు అటూ యిటూ కాకూడదు. ఆ మరునాడు క్రొత్తజోడు తొడిగే రోజు. పొబ్బడు జోడిచ్చాడు. దానికి చెవలల్లో ఆముదం పోసి ఉంగటాలకూ వారలకీ నువ్వుల నూనె రాచి పాదం అంతా కొబ్బరినూనె పూసి వాకిట్లో ఎండపెట్టాడు. వాకింటి ప్రక్కనే ఒక కమ్మవారి ముసలమ్మ ఉన్నది. ఆవిడకు అరవై ఏండ్లు. కరణంతో ఆడవాళ్లెవ్వరూ మాట్లాడరు. ఆవిడొక్కతే మాట్లాడుతుంది. ఆ మాట్లాట్టంలో ఎకసెకెలుగా మాట్లాడుతుంది. ఆవిడ కాయన అల్లుడు వరస. ఆ వరసమీద పెట్టి ఆయన ఊళ్లో చేసిన తీర్పులన్నిటినీ ఎత్తిపొడుస్తూంటుంది. ఆయన మరీ అన్యాయం చేస్తే ఊరంతా యాగీ చేస్తుంది. ఆవిడంటే ఆయనకు భయం. "నా కెవరన్నా భయం లేదుగాని అత్తా, నీవంటే భయం అన్నా" అంటాడు. వాళ్ల యిల్లూ వీళ్లయిల్లూ ఆనుకొనే ఉంటవి. నే నామధ్యాహ్నం పూట అటు వెళ్తాంటే ఆవిడవాకిట్లో నిలుచుంది. ఆవిడ కెదురుగుండానే యీ చెప్పులు ఎండలో ఉన్నై. ఆవిడపేరు రంగమ్మగారు. ఆవిడ మంచిమాటకారి. దారంబడే పోయేవాణ్ణి నన్ను పిలిచి "ఒరే వల్లా, కరణంగారి క్రొత్తచెప్పులు చూశావుట్రా" అంది. నేను "ఆయన కేమి ధర్మరా"జన్నాను. ఆవిడ పగలపడి నవ్వింది. నవ్వినావిడ ఊరుకోక కరణంగారు వాకిట్లో కూర్చొని

వ్రాసుకుంటున్నాడు. ఆయనదగ్గరకు వెళ్లి "అల్లుడూ అల్లుడూ, విన్నావా వల్లి ఏమంటున్నాడో-నేను కరణంగారి క్రొత్తచెప్పులు చూశావుట్రా అన్నాను. వీడి ఉప్పురాయి మండ, ఆయన కేమి ధర్మరాజు అంటున్నాడు. ఆయనకేమి మహారాజు అనాలిగాని ధర్మరాజు అంటాడా ? నీవు ధర్మరాజువా? నీవు ధర్మరాజువన్నా, రాయప్ప కృష్ణుడున్నా" అన్నది. కరణంగారు అదేమి చిత్రమో నావంక కోపంగా చూట్టం మొదలుపెట్టాడు. నేను "దొరా, నే నట్లా అనలేదు. మహారాజో, ధర్మరాజో నాకేం తెలుసు, ఏదో లోకసామెతగా అన్నాను" అన్నాను. రంగమ్మగారిట్లా అంది: "అవునయ్యా, రాయప్పని వెనకేసుకొని వాడి చిన్నదొరలని నీవు వూళ్లోంచి వెళ్లకొట్టావు. వాడికి కోపం రాదా. ఉన్నమాటంటే ఉలుకెక్కువ" అని "నీకిది తగదు. నువ్వూ, ఆ మునసబూ ఆ రాయప్పపక్షం చేరకపోతే యింత దూరం వస్తుందా. ఆ యిల్లాలు పాపం ఊళ్లో ఉంటానికి వీలులేక యింత చీకటి నెత్తిన వేసుకపోయింది" అన్నది. కరణం "నాదేముందమ్మా. మునసబు ఊరుకున్నాడు. మునసబుదికాని నాదేముంది ? లెఖ్ఖల్లో వాళ్ల దొరపేరే ఉంది. వీళ్ల దొరపేరు కొట్టేసి రాయప్పగారి పేరు వ్రాశానా? ఎవరన్నా వచ్చి అడిగితే పొలం వాళ్లది కాదంటానా?" అన్నాడు. రంగమ్మగారు గడుసరి. అన్నదికదా "ఎందు కంటావులే. వాళ్ల దొర నిన్ను బాగుచేసిన చెయ్యటానికి ఆయన బ్రతికున్నన్నాళ్లూ అన్నయ్యా అన్నయ్యా అని ఆయనవెంట నుండేవాడవు. నీవు ఆయనకు పుట్టెడు జొన్నలు బాకీపడితే పోనీలేరా తమ్ముడూ అని వదిలిపెట్టాడు. నీ పొలం ఆయన ఉన్నన్నాళ్లూ ఆయనగొడ్లతో త్రొక్కించిపెట్టేవాడు. నీ కొకటి చేసి ఒకటి చేయలేవా ? మునసబుక్కీ నీకూ కక్షలొస్తే నిన్ను వెనకేసుకొని సాధించిపెట్టాడు. నీవు ఈఊరు సంసారంతో రాకముందు వారింట్లో పదేళ్లు తిన్నావు. ఏమన్నా అంటే "ఎవడికోసం పెట్టేడు. ఊరికి కరణం కావాలని నన్ను తెచ్చుకున్నాడు. ఈ అమిత్రమధ్యం నాకు ఆయన కాకపోతే మరెవ్వరు పెడతా"రంటావు. ఆ బ్రాహ్మలు ఈ వూరికి నిన్నే తీసుకొరావటమేమి? అందర్నీ తీసుకవచ్చారు. అందరికీ తమ్ములకు చేసినట్లు చేశారా" అని మొదలుపెట్టింది. కరణం "పోవమ్మా, నీ గోల ఎప్పుడూ యింతేను" అన్నాడు. రంగమ్మగారు "నీవు ఇట్లా అంటం కాదు. మళ్లీ వీళ్ల దొరని ఈవూరు తీసుకోవచ్చి నిలబెడతాను అంటే బాగుపడతావు. చెపుతున్నాగా" అంది. ఇంతలో ఎక్కడిదో ఒక గొడ్డు వచ్చి బురద కాళ్లతో ఆయన ఎండపెట్టిన క్రొత్తచెప్పులజత త్రొక్కిపోయింది. కరణంగారి ప్రాణం పైది పైనపోయింది. ఆయన ఆగొడ్డునీ, ఆగొడ్డుకామందునీ వంద తిట్లు తిట్టేడు. రంగమ్మగారు ముసిముసి నవ్వులు నవ్వుతూ కూర్చుంది. ఆ చెప్పులు నీళ్లతో కడిగితేగాని పనికి రావు. కడిగితే బిఱ్ఱబిగుస్తవి. చెప్పుల పొంకం చెడిపోయింది. రంగమ్మగారు కరణంకోపంచల్లారిం తర్వాత యిట్లా అంది: "నేను చెప్పలేదా, ఎదటివాడి మేలోర్వలేకపోతే మన సరదా మంట కలుస్తుందని" అన్నది. నాదారిని నేను వెళ్లిపోయినాను. సాబ్బడికి పినతండ్రి కొడుకొక డున్నాడు. వాడిలాంటి చెప్పుల జతలు చేసి ఇతర ఊళ్లు వెళ్లి కుంచెడికి మానెడికి అమ్మివస్తాడు. వాడిదగ్గర ఇంతకంటె మంచి జోడొకటి తయారులో ఉంది. నేను వాని నడిగి ఆ జోడు కొన్నాను. మరునాడు ప్రొద్దున్నే ఆ జోటితో కరణంగారింటికి వెళ్లాను. కరణంగారు వీథిలో నిలుచున్నాడు. ఉత్తరీయంలో చుట్టిన జోడు తీసి ఆయనకాళ్లముందు వేశాను. ఆయన కెక్కడలేని ఆనందం వచ్చింది. "ఎక్కడ తెచ్చావురా ఈజోడు" అన్నాడు. నే "ఎక్కడ తెస్తే ఏమిబాబూ. మీకు బాగుంటే తీసికోండి" అన్నాను. ఆయనముఖం, ఆయనకన్ను నాపక్షాన ఉండిపోయినై. ఇట్లా ఊరు నావైపుకి తిరిగింది.

౪

ఆ రోజున జొన్నగూడు నూరుస్తున్నాము. అందరూ బువ్వలు తిని వచ్చారు. కొంచెము మబ్బు వేసింది. చల్లగా ఉంది. ఎడ్లను బంతులుకట్టి తొక్కిస్తున్నాము. తొక్కిస్తూంటే పాలేళ్లలో ఒకడు పదం మొదలుపెట్టాడు. అందరూ అందుకున్నారు.

పాడుతున్నారు. నా కెప్పుడూ పదం పాడే అలవాటు లేదు. రాయప్పగారి పెద్ద పాలేరు ఉన్నాడు. వాడూ, రాయప్పగారూ ఏమనుకున్నారో వాడు నాతో కాస్త ఎకసెక్కాలుగా మాట్లాట్టం మొదలు పెట్టేడు. నేను చూశాను. నేను మా గూడెంలో పెద్ద వాణ్ణి. నన్ను తూలిమాట ఎవరూ అనరు. నన్ను కొంచెం గొప్పగా చూస్తారు. వా డిట్లా మాట్లాడు తూంటే తక్కినవాళ్లకు కొంచెం కోపంవచ్చింది. నేను తమాయించి ఊరుకున్నాను. శ్రుతిమించి రాగాన పడు తోంది. వాళ్లల్లో మా అప్పకోడు ఉన్నాడు. వాడు కొంకె పట్టుకొని కంకెలు లాగుతూన్నట్లుగా నటించి రాయప్పగారి పెద్ద పాలేరు పీలమండలకు వేసికొట్టేడు. వాడు కూలబడ్డాడు. అందరూ నవ్వేరు. వాడు తిరిగి మళ్లీ మా మేనల్లుణ్ణి కొట్టబోయినాడు. మావాడు వాడి కందకుండా పారిపోయి "ఏదో తగిలింది, నిన్నేమి కొట్టాలని కొట్టేనా?" అన్నాడు. ఇదంతా పెద్దరవధ కింద దిగింది. రాయప్పగారికి దాంతో తెలిసింది— మాలో మాకు తగాదాలు పెడితే తన పని ఏమీ సాగ దని. ఈ తగవుతో నూర్పిడి కొంతసేపు సాగలేదు. ఆయన ఎన్ని కేకలు వేసినా, బంతులు తోలేవాడు లేడు; కంకులు లాగేవాడు లేడు. పని అట్లా ఆగి పోయి పంచాయితీలోకి దిగింది. చివరకు నలుగురు పాలేళ్లూ కలిసి "ఒరేయి అబ్బాయి, వల్లడు మన కులంలో పెద్దవాడు. వాడంటే ఊరంతా కూడా మర్యాద. వాణ్ణి పట్టుకొని నువ్విలా అంటూంటే మే మెవళ్లం ఒప్పుకోము. పైగా నీ చెంతసేపూ వాణ్ణి ఆ మాటలూ యీ మాటలూ అంటే వాడేమైనా పలి కేడా? నీ మాటలే గాలికి పోయినై కాని. జాగా ఎరిగి మైటో" అన్నారు. పైగా "వాడికీ నీకూ పొత్తేమిటి? వాడిదొరలు పెద్దవాళ్ల పటంతోటే నువ్విక్కడిట్లాగో వాళ్ల పొలాల్లో వాళ్లట్లాగ. ఇవ్వాళ ఆదొరలు పని వాళ్లు గనుక ఇక్కడ ఈ దొరగారు చేయిస్తున్నారు పొలాలు. నువ్వు వాణ్ణి కొట్టేవంటే, చెప్తున్నాము అబ్బాయి, మన గూడెం అంతా రెండు పక్షాలు అవు తుంది. మోది తీసుకోవెళ్లి దూలావ గుచ్చుతున్నా" వని చీవాట్లు పెట్టేరు. వాడూ చప్పపడి ఊరుకున్నాడు. రాయప్పగారు కొంచెం మద్దతిచ్చాడు. "ఏరా, ఒళ్లు పొగరులెక్క కొట్టుకుంటున్నారు. గూడెంలోపక్షాలు పడతయ్యా ఏం? ఊరనుకున్నారా మరేమను కున్నారు? చమడా లెక్క తీస్తాను. వల్ల డేమి దొరా ఏమిరా? కొంకె కాలికి తగులుతుందా? వాడు కొట్టా లనే కొట్టేడు. చూడు వీణ్ణి ఏమిచేస్తానో. రేపు ఏరు వాకపున్నమినాడు యీ వెధవను తీసివేస్తాను. వల్లడు మీఅందరికీ పెద్దవాడైతే వాడికి నాపాలేరు పెద్దవాడు కాడా" అని ఏవో ఏవో జమురుకున్నాడు. సరి, అయిపోయింది. మరునాటి సాయంత్రానికి నూర్పిడి అంతా అయింది. తాలుకంకెలన్నీ లాగేసి పోగు వేశాము. గింజంతా పోగుచేసి బండీ కళ్లంలోకి లాగి దానిమీద తూర్పెత పోద్దామని నే నెక్కను. రాయప్ప గారు "నీవు దిగు, మా పాలేరు ఎక్కుతాడు" అన్నాడు. నేను దిగలేదు. కొంచెంసేపు నేను తూర్పెత పట్టాను. ఇంతలో గాలి ఆగిపోయింది. మళ్లీ గాలితెర మళ్లేటప్పటికి వాళ్ల పాలేరే ఎక్కడు. సరే, జొన్నలరాశి తయారయింది. ఇంతలో ప్రొద్దు గూకింది. రాశిమీద కంకెలు కప్పేము. ఆరాత్రి నేనూ, వాళ్ల పాలేరూ కాపలా పడుకున్నాము. వాళ్ల పాలేరు పేరు సుబ్బడు. మేమిద్దరం కూడు తిని కళ్లా నికి వెళ్లేము. రాయప్పగారు భోజనానికి వెళ్లేడు. నిన్న మధ్యాహ్నంనుంచీ సుబ్బడు నాతో మాట్లాట్టం లేదు. అప్పుడు మేమిద్దరమే అక్కడున్నాము. సుబ్బ డిలా అన్నాడు: "మామా, నామీద నీకు కోపం వచ్చింది కామోలు. నాదొరకి ఆస్తి అంతా కాజేదామని పుట్టింది. నువ్వు పాలేరుగా ఉంటం ఆయన కిష్టం లేదు. ఎట్టాగైనా చిల్లిఖజ్జాలు పెట్టుకొని నిన్ను వెళ్ల గొడదామని చూస్తున్నాడు. నాతో చెప్పారు. నా కెందు కొచ్చింది. చూస్తే దీని మూలంగా మనలో మనకు చెడిపోయేట్టుంది. నేనేమీ పట్టించుకోను. దొరగనక అవును కా దన్నట్టుగా ఉంటాను. ఇంక నీ యిష్టం." అన్నాడు. మనస్సులో నన్ను వెళ్లి పొమ్మని; సుబ్బడికి తెలుసు. వాడు అన్నాడుకదా "వల్లడు వెళ్తాడులే దొరా. నే నుంటాను" అని. అని నన్ను గోకేడు. సుబ్బడి పెళ్లాం నీళ్లాడే రాత్రిళ్లు. నేను అన్నానుకదా — "ఒరేయి, నీ భార్య నీళ్లాడే పొద్దులు. నీ వెళ్లి తేనే మంచిది. నేనే ఉంటాను" అన్నా

ను. సుబ్బడు బయల్దేరేడు. రాయప్పగారి కేమీ తోచింది కాదు. త్రిప్పుకొని అన్నాడు. "అది నీళ్లాడితే నీవేమి చేస్తావురా? పురుడు పోస్తావా? సరే నీవూ ఉండు" అని. ఆయనకు నేను ఒక్కణ్ణే ఉంటేభయంకాబోలు. అట్లాగే పడుకున్నాం. సుబ్బడు గుఱ్ఱుపెట్టి నిద్దరోతున్నాడు. నాకు నిద్రపట్టలేదు, ఆయనకూ నిద్రపట్టలేదు. గుఱ్ఱుకొయ్యలు పొడిచేవేళకు ఆయన లేచి ఇంటికి పోయినాడు. కోమటి "మరునాడు సాయంత్రంగాని కొలగారానికి వీల్లేదు" అన్నాడు. నడినెత్తికి ప్రొద్దు తిరిగేదాకా రాశి రాశిగానే ఉంది. ప్రొద్దు మళ్లింతర్వాత కోమటి రామయ్య కుంచం చంకన పెట్టుకొని రాయప్పగారూ, అతనూ వచ్చేరు. పురికొస, దబ్బనం, ఒత్తిడిసంచులు బండిమీద వేసుకొని నేను వచ్చాను. తన సంచులు తను తెచ్చాడు రాయప్ప. కొలగారం మొదలుపెడతారు. రాశిమీద కంకులన్నీ తీసి నూగంతా చేటలతో దులిపేము. రాశిచుట్టూ గిరిగీసి విఘ్నేశ్వరుణ్ణి చేసి దానిమీద పసుపుకుంకుమ చల్లి రాశిలో దూర్చాము. రామయ్య కుంచం పుచ్చుకొని కూర్చున్నాడు. పాలేరుభాగం నేను తీసుకుంటేనేగాని 'లాభం' అని మొదలుపెట్టటానికి వీలులేదు. సుబ్బడు తటపటాయిస్తున్నాడు. వాడివంక రాయప్పగారు కోపంగా చూస్తున్నాడు. వాణ్ణి తీసుకోమని యిదివరకే చెప్పాడో, యిప్పుడే వాడు ముందుకు వచ్చి తీసికోవాలని ఉద్దేశమో. నే నంతా చూస్తున్నాను. నాకు సామాన్యంగా కోపం రాదు. వచ్చినా ముందూ వెనకా ఆలోచించని ఒళ్లు తెలియని శివం లేదు. ఇప్పు డాలోచిస్తే అప్పుడు నా ఒళ్లు నాకు తెలియలేదని తోస్తుంది. నాకు లోపల మండిపోతూంది. నడుము బిగించాను. పల్లిక పుచ్చుకున్నాను. రాశిమీదికి వెళ్లాను. పల్లిక పుచ్చుకొని పాలేరుభాగం పల్లికెడు జొన్నలు రాశిలోంచి తియ్యబోతూన్నాను. రాయప్పగారు కూర్చున్నవాడు నామీదికి దూకి పల్లిక కాలితో తన్నేడు. నేను చెప్పేనుగా కోపం పట్టరాకుండా ఉందని; ఉరిమి చూశాను. ఆయన "ఎవడురా నువ్వు? నాకళ్లం రాశిలో పల్లిక తీసేందుకు? సుబ్బా, నువ్వు పల్లిక తీసుకో" అన్నాడు. నే నన్నాను కదా—"ఇది నా దొరపొలం. ఈపంట నాదొరది. నే నందులో పాలేరుభాగం తీసికొనేది" అన్నాను. రాయప్పగారు "నీదొర ఎవ్వరు? నీ వెవ్వరు? నా పొలంలో అడుగెట్టావా బండకొయ్య వేయిస్తాను. నీదొరసానీ, పిల్లలూ, నెత్తిన గుడ్డవేసుక వెళ్లారు. ఇక్కడ ఎవరి అబ్బగాడి సొమ్మందని పల్లిక తీశావు? వెత్తి అక్కాయివేసాలు వేశావా పక్కటెముకలు విరగ తన్నిస్తాను. పోయి నీ అబ్బగాడితో చెప్పుకో" అని పరవళ్లు త్రొక్కుతున్నాడు. నేను "నా దొరపొలమే లేదా? ఎట్లా లేదో చూస్తాను." అనేటప్పటికి "ఏమి చూస్తావురా ఏమి చూస్తావు? నీవు చూసేదేమిటి? చూస్తాడుట చూస్తాడు! ఏదీ చూడు" అన్నాడు. నేను "చూస్తాగా, చేసి చూపిస్తాను, ఇదిగో" అని పల్లిక పుచ్చుకొని మళ్లీ త్రవ్వబోయినాను. రాయప్పగారు నామీద కలబడ్డాడు. కొట్టలేదుగాని చేత్తోతోశాడు. నేను కలబడితే విరిచి పోగులు పెట్టేవాణ్ణే. కాని బ్రాహ్మడు. పెద్దరైతు. నేను వ్యవహారం సాధించుకోవలసినవాణ్ణి. ఆయన కొట్టినా నే నూరుకున్నా నని ఊరు చెప్పుకోవాలి. అందుచేత ఊరుకొని, ఈకళ్లంలో నేను కాకపోతే మరెవ్వడు పల్లిక ఎత్తుతాడో ఎత్తమను అని నిలుచున్నాను. రాయప్పగారు సుబ్బడి వంక చూచి "తియ్యరా, పల్లిక తియ్య" మన్నాడు. సుబ్బడు కదలలేదు. వాడు ఎంత గద్దించినా కదలకపోతే వాణ్ణి "పిరికి వెధవా" అని తిట్టి తానే పల్లికనిండా జొన్నలు తీసి యివతలపెట్టి రామయ్యను కొలవమన్నాడు. రామయ్య తటపటాయిస్తున్నాడు. నేను ఇలా అన్నాను. ఆదివరకు రాయప్పగారిని ఎప్పుడూ ఎదురుగా తిట్టలేదు. 'దొరగారూ' అన్నానుగాని ఇంకో విధంగా పిలవలేదు. ఆరోజున ఏమన్నానో జ్ఞాపకంలేదు కాని ఈమోస్తరుగా అన్నట్లు జ్ఞాపకం. "నాదొరఆస్తి నీవువేసుకొనితిందామని చూస్తున్నావు. నాగొంతుకలో ప్రాణం ఉండగా నిన్ను తిననివ్వను. ఈగడ్డతో నా పూర్వులూ వచ్చారు. నీ పూర్వులూ వచ్చారు. ఇక్కడికి కొచ్చిన మొదటి కుటుంబాలు మీరూ మేమూ. బ్రాహ్మలలో పెద్దకుండ మాదొరది. నాకులంలో పెద్దకుండ నాది. నాదొరతో చస్తేచస్తాను బ్రతికితే బ్రతుకుతాను. నాదొరకు మళ్లే ఊరు వదలి

లేకపైనా పోతాను, లేకపోతే నా దొరను తీసుకోవచ్చి ఈ వూళ్లో నిలైనా తొక్కుతాను. నాపట్టు శివంగి పట్టనుకో. మాలవాడుకదా హుష్ అంటే ఎగిరిపోతా డనుకుంటున్నావు. నేను నీ గుండెల్లో కూచుంటాను. నిన్ను సాధించాలంటే లక్షవిధాల సాధిస్తాను. నీయిల్లు దోయిస్తాను. లక్ష చెయ్యగలుగుదును. కాని అవేవీ చెయ్యను. వ్యవహారంగానే సాధిస్తాను. ఇదిగో ప్రొద్దున్నే లేచిపోతున్నాను. నాదొరసానినీ చిన్న దొరలనూ తీసికోవస్తాను. వాళ్లను తీసికొస్తేగాని గంటెడు నీరు పుచ్చుకోను. ఇది ప్రతిజ్ఞ అనుకో. ఊళ్లో రాముడి గుడి ఉంది. ఆ రాముడి పేరు పెట్టి శాపం పెడుతున్నా. సుబ్బడు ఆ పల్లి కడు జొన్నలు తీసికళ్లాడా—సుబ్బడి పెళ్లాం నిండు గర్భిణి. తొలి పొద్దో మలిపొద్దో నీరాడుతుంది. నేను నోటితో అనను. ఏమి చేస్తాడో ఆదేవుడే చేస్తాడు. సుబ్బడు పల్లికడు ఎత్తేడా ఊరంతా రెండుపక్షాలైందన్న మాటే. ఊరంతా దెబ్బలాటలే, కుప్పలు తగలెట్టు కోటాలే, దొంగతనాలే. రామరాజ్యం మల్లే ఉన్న ఊరు హిరణ్యకశిపుడి రాజ్యం చేస్తాను. ఈ పంతం అంతా సుబ్బడితో. ఓయి బ్రాహ్మడా ఇది నీతో కాదు. నీతో వ్యవహారం చేస్తాను. మాలవాడుగా వ్యవహారం చేయలే డనుకుంటున్నావు. చేసి చూపిస్తాను. మాలవాడి వ్యవహారానికీ బాపనాడి వ్యవ హారానికీ భేదం చూపిస్తాను. వ్యవహారం చేయటానికి అక్షరంముక్కలు రావాలనుకుంటున్నావేమో. బుద్ధికీ అక్షరానికీ ఏమీ సంబంధం లేదు. సంబంధం లేదని మాదొర వెయ్యిసార్లు చెప్పాడు. మాదొర ఉన్నన్నాళ్లూ ఆయనవెనుచేతివెనక దాగిఉన్నావు. ఇవ్వాళ ఏరుపడైనావు. ఈపాలం అంతా నాదొర తొక్కించకపోతే బంజరు అయేది. ఆయన వీథిలో నుంచొని అరిస్తే "నాయనా నాయనా అల్లా కాదురా"అని పిల్లిలా ఉండేవాడివి. ఇవ్వాళ కొమ్ము లొచ్చినై. నీకొమ్ము విరగతీయకపోతే నేను మాలాడి కడుపున పుట్టలేదు." అని రివరివా బయల్దేరి వెళ్లాను. నేను వెళ్తుంటే అందరూ నావంక విస్తుపోయి చూస్తున్నారు. నేను వెనక్కి తిరిగి చూడలేదు. ఇంటికి పోవటానికి ప్రాణం ఒప్పలేదు. అట్లాగే బయలుదేరి మాదొరసానిపుట్టిల్లు ఊరుముఖం పట్టేను. వెళ్లాను, వెళ్లాను. ఆదారివెంట ఏమాలోచించానో నాకే తెలియలేదు. ఆలోచనే లేదు. ఒక కట్టె దారమ్మట నడుస్తున్నట్టుం దనుకోండి. ఆఊరు ఈఊరు దాటి వెళ్తుంటే "ఏఊరు మీ"దని ఎవరైనా అడిగితే, అడిగేరని గుర్తేప్ప సమాధానం లేదు. "ఎక్కడికి పోతున్నావు?" అంటారు. ఎక్కడికి పోతున్నానని చెప్పను. అల్లాగే పోతున్నాను. రాత్రి ప్రొద్దోయింది. ఒక ఊళ్లోంచి పోతూంటే నన్ను చూచి కుక్క మొరిగింది. రాయప్పమీది కోపమంతా నాకు దానిమీద వచ్చింది. "నేనేమి ఎరుకలవాణ్ణా, యానాదివాణ్ణా, పాములవాణ్ణా, నన్ను చూసి మొరుగుతుంది" అని దాన్ని కఱ్ఱతో కొట్టేటంత కోపం వచ్చింది. ఛీ, ఛీ రాయప్పనే కొట్టలేదు, దీన్ని కొట్టటం ఎందు కనిపించింది. ప్రొద్దునెప్పుడో తిన్న బువ్వ, కడుపులో ఆకలి మండిపోతోంది. ఎవరి నడిగినా ఇంత కూడు పెడతారు. నేనెవరినీ అడగతలచ లేదు. ఎక్కడనైనా పరుండి నిద్దరోతేగాని మళ్లీ నడవలే ననుకున్నాను. కూర్చోకుండా ముప్పై ఆమడైనా ఒక్క బిగువున పోయేవాణ్ణి-నా కారోజున ఆకలివెయ్యటం,కాలి నొప్పులుపట్టటం నాకే చిత్రంగా ఉంది. ఎంచేతనబ్బా అనుకున్నాను. కోపం నాసత్తువంతా లాగివేసింది. కోపాన్ని తిట్టేను. మాదొర చెప్పేవాడు "ఒకే వల్లా, కోపం చాలా చెడ్డది" అని. నేనూ ఆయనా ఒకేయీడువాళ్లం. నాకన్న కొంచెం చిన్నవా డనుకో. కులాలు భేదంగాని మేమిద్దరం చుట్టాలల్లే ఉండేవాళ్లం. "ఒకే,నాకు కూతురు పుడితే నీకు కొడుకు పుడితే వాళ్లిద్దరికీ పెళ్లిచేదాముంరా" అన్నా డోరోజున. ఆమాట నిజం కాదని ఆయనకూ తెలుసు, నాకూ తెలుసు. కాని ఒకళ్లంటే ఒకళ్లకు మా కల్లా ఉండేది. మాదొర చాలా చదువుకున్న వాడు. భారతాలు, భాగవతాలు చదివేడు. సంస్కృతం అదీ రాదు. కాని మా దొరమనస్సు, బంగారం. చదువెందుకు, బుద్ధి కావాలిగాని. మే మిద్దరం వయస్సుల్లో ఉండేవాళ్లం అప్పుడు. మాదొర 'కోపం చెడ్డదిరా'అంటే నేను "కాదుదొరా, కోపాని కేమిటి, ఎట్లాగైనా చంపుకోవచ్చు. కామమే చెడ్డ"

దన్నాను. మాదొర ఏమన్నాడు, రతనంవంటె మాట అన్నాడు. "ఒరే, కాదురా వల్లా, కాను నేమున్నదిరా ముఖలితనం వస్తే చస్తుంది. కోపం కట్టెల్లో పెట్టినా పోదురా" అన్నాడు. నాదొరా అప్పటికి లేతవాడే. మాదొరఆలోచన చూడండి. మాదొరానూ, రాయప్పానూనా! అంత గొప్పవాడు కనక నే అంత పెందరాడే చనిపోయినాడు. చవల కింతింత బంగారపుముద్దలు పెట్టుకొని ఎఱ్ఱగోర్పడాలు కప్పుకొని ఒస్గ బ్రాహ్మలు మా దొరని మాట్టానికి వస్తే బస్తాలకు బస్తాలు కొలిచేవాడు మాదొర. ఆదొరసంతానాన్ని నేను మళ్లీ నిలపకపోతే నేను ఆదొరదగ్గర నేర్చుకున్న ఈ కోపం చంపటం, తక్కిన ఋణాలమాట అట్టా అట్టే పెట్టినా ఈఋణం ఎట్టా తీర్చటం? ఆకుక్కని ఏమీ చేయలేదు. ఆఊరిచెరువుగట్టు నో చెట్టుంటే ఆ చెట్టుక్రిందపడుకున్నాను. అప్పటికి రాత్రి చాలా ప్రొద్దుపోయింది. అంత ప్రొద్దుపోయి ఒక బ్రాహ్మణఅమ్మవారు చెఱువుకి నీళ్లకు వచ్చింది. నే నాచెట్టుక్రింద పరుంటే "ఎవరాపడుకుంది"అంది. నేను "మేము మాల వాళ్లం, మాది ఫలానా ఊరు"అన్నాను. ఆవిడ "అక్కడ పడుకున్నా వేమిరా, మాగొడ్లపావిట్లో పడుకుందుగాని రా"అన్నది. అని"అన్నం తిన్నావా" అన్నది. నేను అబద్ధం చెప్పేను — "తిన్నానమ్మా"అని. ఎందుకంటే చీకట్లో ఆమెముఖం కనబడలేదు. ఆమెగొంతుమాటే వినిపించింది. ఆగొంతులో ఆమెకు యాభైఏళ్లుంటై. దయ అంతా ఆగొంతులోనే ఉంది. నా కన్నం పెడతా నంటుందేమో. తినక తప్పక వస్తుందని తిన్నా నన్నాను. ఏఊరు పోతున్నా వన్నది. చెప్పాను. ఎందుకన్నది.

ఫలానాఆవిడ మాదొరసాని, ఫలానాఆయన మా దొర. అని నాకథ అంతా కొద్దిగా చెప్పేను. ఆవిడ "అయ్యో నీవు వాళ్లపాలేరువా? మీదొర ఏమి దొరరా. మాఊళ్లో పంటలు తక్కువ. మామగ వాళ్లందరూ యాచన చేసుకుంటూ ఉంటారు. ఎవరు చెప్పినా ఆయనపేరే. దాత అంటే ఆయనగాని యింకోరా అంటారు. నీదొర శిబిచక్రవర్తిట. నీవు అన్నం తినలేదు. అబద్ధం చెపుతున్నావు. మా ఇంటికి రా. ప్రొద్దున్నే పిల్లలకోసం అన్నం అట్టే పెట్టాను. రేపు మళ్లీ వాళ్లకు వండిపెడతానులే. రమ్మ"ని నాప్రాణం తీసింది. నేను పోయి వాళ్ల గొడ్లసావిట్లో పరున్నాను. నేను ఎంత తిన్నానని చెప్పినా తింటే మళ్లీ తినమని నాదుంప తెంచింది. చివరకి ఒక గుమ్మడాకులో పెట్టి ఇంత అన్నం, గోంగూరపచ్చడి తీసికొచ్చి నాదగ్గర పెట్టింది. ఇంక నేను తప్పించుకోలేక "అమ్మా, చెరువుదగ్గిర తిని వస్తాను"అని బయల్దేరాను. ఈఅన్నం నేను తినటానికి తీసికోపోలేదు. అంత దయగల తల్లిమనస్సు కష్టపడుతుందేమోనని తీసుకొచ్చాను. నన్ను చూచి మొరిగిన కుక్క అక్కడే ఉంది. నాచేతిలో అన్నం ఆకట్టిందల్లే ఉంది. నావెంట పడి వస్తున్నది. పెడతానో పెట్టనో తెలియని అన్నంకోసం అంత అనుసరించిందే ఆకుక్క. తరతరాలుగా మాదొరల కూడు తిని బ్రతికేను. నే నెంత చెయ్యాలి? ఆకుక్క అన్నం తింటూ ఉన్నంతసేపూ నేను నాలో నా దొరనీ, ఆకుక్కలో నన్నూ చూచుకున్నాను. ఆ రాత్రి ఆబ్రాహ్మణఅమ్మవారి పంచాదిలో తలదాచుకున్నాను. [సశేషము]

# తెలుగు నవల



= శ్రీ కొప్పిడి లక్ష్మన్న =

తెలుగు సారస్వతంలో పురాణయుగ మనీ, ప్రబంధయుగ మనీ, "నవ్యకవితా"యుగ మనీ వివిధములయిన యుగములు ఉన్నప్పటికీ "నవలాయుగ" మని చెప్పకోదగిన యుగ మొకటి ఉన్నట్టు కనుపించదు. తెలుగు భాషలో నవలలు లేవనికాదు. కాని ప్రజానీకంలో అవి ప్రబంధేత్యాదుల్లాగు బహుళతను గాంచలేదేమో అనిపిస్తుంది. అయినప్పటికీ ఉన్నవాటిలో బహు ప్రశంసా పాత్ర మయిన నవల లున్నాయి. కాని ఆమోస్తరుగా ఉత్కృష్టతను పొందిన నవలా రచన నేడు వెనుకంజ వేసినదేమో నని భయం.

నవల పూర్వచరిత్ర:—

నవల ఇటాలియను "నోవెల్లా" నుండి వచ్చింది. ఇటలీ దేశంలో, వాస్తవికతా మార్గాన్ననుసరించి— దైనందిన జీవితంలో కలిగే మానవ ప్రవృత్తుల్నీ, సంఘటనల్నీ ప్రతిబింబిస్తూ - వ్రాయబడిన కాల్పనికకథలకీపేరు పెట్టబడింది. ఇటలీనుంచి పరాసుదేశం మీదుగా యీ నోవెల్లా ఆంగ్ల దేశంలో 18-వ శతాబ్దాన్ని తలచూపింది. "రొమేన్సు" కిన్నీ "నవల" కిన్నీ భేదం ఉంది. రొమేన్సులోని కథావస్తువు 'నభూతో నభవిష్యతి'గా వుంటుంది; గగనమార్గాల్లో దాని భావనాపథం మిళితమయి వినోదకరంగా ఉంటుంది. కాని నవలలోని కథావస్తువు ముఖ్యంగా వాస్తవికతామార్గాన్ని సంచరిస్తుంది; సమకాలీనమయిన జీవనపథాల్ని, వేషభాషల్ని, మనఃప్రవృత్తుల్ని, జీవిత సంచలనాన్ని ప్రతిఫలిస్తుంది. దీనికి దూరమయి, కథావస్తువు ఎంతవరకూ ఊహాజనితంగా విహరిస్తుందో అంతమట్టుకు ఆ నవలలో రొమేంటిక్ ఎలిమెంటు వుందన్న మాట. ఆదినుంచీ కూడా ఆంధ్రంలోలాగే ఆంగ్లంలోకూడా "కథనం" కలదు. గద్యలోనూ, పద్యంలోనూ కూడాను. అయితే నవలాసారం వాటిలో లేదు. అది చాలావరకు అమాయికత్వంతో నిండి కర్షకపరంగానో, లేక వీరచర్యగణనాపరంగానో వుండేది. పాత్రపోషణ లేదనే చెప్పొచ్చు. లోకవృత్తైతిహాస కథనానికే ప్రాముఖ్యత లభించేది. ఇది యిలా ఉండగా కేవలం కథన పూర్వకంగానూ, పాత్రపోషణపరంగానూ వ్రాయడం 18-వ శతాబ్దిలోనే వేరువేరుగా ఇంగ్లాండులో ఆరంభించేయి. గల్లివరు ప్రయాణాలు, రాబిన్‌సన్ క్రూసో మొదలయినవి ప్రథమ శ్రేణికి చెందినవి; రిఛర్డ్ డిశావర్లీ రెండవతరగతికి చెందింది. ఇంక ఈ రెండువిషయాల్నీ క్రోడీకరించడమే తరవాయి. అలాగ పాత్రపోషణా, కథా అనే రెండు విషయాల్నీ సమన్వయం చేసినవాడు రిఛర్డ్సన్. తరవాతి సుప్రసిద్ధ రచయిత ఫీల్డింగ్. ఇతని రచనలు నేటికికూడా తమ అగ్రస్థానాన్ని నిలుపుకున్నా యనడంలో అతని నవలల్లో ఉన్న స్వారస్యం, కథలో గల చమత్కృతీ,

పాత్రపోషణలో ఉండే ఔచితి స్పష్టపడతాయి. రానురాను జాన్సన్, గోల్డ్‌స్మిత్, మిస్ ఎడ్జివర్త్, హోరెస్‌వాల్పోలు మొదలయినవారు నవలకి మెఱుగులు పెట్టేరు. స్కాట్‌లో చరిత్రాత్మకమయిన నవల సానపట్టిన వజ్రంలాగ వెలిసింది. 19-వ శతాబ్దంలో డికెన్సు, థేకరే, ఛార్లట్ బ్రాంటీ, ఛార్లెస్ రీడ్, జార్జి ఇలియట్, కింగ్స్‌లీ, స్టీవెన్సన్లు నవలని అత్యద్భుత పరిణతికి తెచ్చేరు. ఇహ పిమ్మట అధునాతనులే. ఇలాగ్గా 18-వ శతాబ్దాన్ని మొలక లెత్తిన నవలారచన నేటికి గూడా అప్రతిమప్రతిభతో వెలుగొందుతోంది ఆంగ్లంలో.

ఉర్దూ నవల :—

ఉర్దూలో నవలలు వ్రాయడం 19-వ శతాబ్దాంతంలో జరిగింది. రతన్‌నాథ్ సెర్షార్ అనే ఆయన 1875 ప్రాంతంలో "ఫుసానై అజాద్" (అజాద్ కథ) అనే నవల నాలుగు సంపుటాల్లో వ్రాసేడు. నవాబుల కాలంలో లక్నో పట్నంలో గల నాగరికతను తెలుపుడు చేస్తుంది యీ నవల. ఇది సర్వాంటీస్ వ్రాసిన "డాన్‌క్విగ్జోట్"కి చాలా దగ్గరగా వుంటుంది. సర్వాంటీస్ నవలలో వున్న "సేంకో పాంజా"ని తిరిగి మూర్తీభవింపజేసేడు సెర్‌షార్ "ఖోజీ"లో. ఆంగ్లంలో స్కాట్ మోస్తరుగా ఉర్దూలో సుప్రసిద్ధమైన చారిత్రాత్మకనవలలు వ్రాసినవాడు అబుల్‌హాలీమ్‌షేరర్. వీరితరువాత ఉర్దూ సారస్వతంలో రొమేంటిక్‌సంచలనం బయల్దేరింది. ఈఫక్కీలో తుర్కీ-సారస్వతాన్ని ఆధారంగా చేసుకుని సరళంగాను, స్వారస్యంగాను వ్రాసినవాడు సాజిద్ హైదర్ యాల్ద్రిమ్. వాస్తవికతామార్గంలో పాత్రనిరూపకమయినట్టిన్నీ, దేశసంబంధమయినట్టిన్నీ విషయాల్ని కథావస్తువుగా చేసుకుని మిక్కిలి ప్రఖ్యాతిగన్నవాడు ప్రేమ్‌చంద్. ఇతడు 1936 లో ఓవంగతుడయినాడు. "చౌగానీహస్తీ" అనేది ఇతని అత్యుత్తమమయిన నవల. ఇందులో మానవజీవితం ఒక పోలోఆటగా పరిగణింపబడింది; యిదే హిందీలో "రంగభూమి" అనేపేరుతో తర్జుమా చేయబడింది. కథానాయిక సోఫియా ఆసీబెసెంటుకి ప్రతి. ఈవిధంగా నేటికికూడా తీసిపోకుండా నవలారచన సాగుతోంది ఉర్దూలో. కథానికలవంటి నవ్యసాహిత్య రూపాలవల్ల ఉర్దూలో నవలారచనకి ఏమీ అంతరాయం కలగలేదు. 'అయంవిశేషః' ఏమిటీ అంటే, ఆదిని 'చిన్నకథలు' (Short Stories) వ్రాయ నారంభించినవారు కూడా క్రమేణా నవలారచనకి పూనుకుంటున్నారు. క్రిందటిసంవత్సరంలోనే ఒక క్రొత్తనవలను వ్రాసినటువంటి కిషన్‌చందే యిందుకు నిదర్శనం. ఈతరగతికి చెందినవారిలో మరొకడు ఒపేంద్రనాథ్ అష్క్.

బెంగాలీనవల :—

ఉర్దూభాషలోకన్నా ఒక యాభైసంవత్సరాలు ముందుగా బెంగాలీలో నవలారచన ప్రారంభమయింది. 1825 నుంచీ బెంగాలీ నవలలు ఉత్పన్నమయినా యని స్థూలంగా చెప్పొచ్చు. ఈభాషలోకూడా వ్యావహారిక (గ్రామ్య)వాదంతో మహాసంచలనం కలిగినటువంటి రోజు లవి. అంతకుముందు గల వంగసారస్వతమంతా గ్రాంథికభాషానిబిడీకృతమైవుండేది. ఆదికాలంలో గ్రామ్యవాదాన్ని పురస్కరించుకుని వ్రాసినవాడు టేక్‌చంద్. "అలాలేర్‌ఘూరేర్‌దులాల్"

(గారాబమయిన గొప్పయింటి బిడ్డ) అనే నవలను కేవలం గ్రామ్యంలో వ్రాసేడు. అంచేత దీనిలో చాలావరకు అశ్లీలతకూడా మిళితమయిఉంటుంది. నాటిరోజులలో యీ గ్రామ్యవాదాన్ని ప్రతిఘటిస్తూవుండేవాడు ఈశ్వరచంద్ర విద్యాసాగర్. మధుసూదనాదులు యితని వాదాన్ని ఆమోదించి వ్రాస్తూఉండేవారు. క్రమంగా గ్రామ్యగ్రాంథికవాదాలకి రాజీయేర్పడింది. కృతకమయి, సంస్కృతభూయిష్ఠమయినవంగభాష మూలపడింది. సర్వజనసుబోధకమయిన సరళవంగభాష పేర్పడింది. ఇట్టి భాషలో మిక్కిలి హృదయంగమంగా వ్రాసినవాడు బంకిం చంద్రుడు. త్వరలోనే ఇతని "కపాలకుండలి" దశదిశలూ ప్రాకిపోయింది. బంకించంద్రుణ్ణి వంగభాషలో నవలాపితామహు డన్నారు. ఆంగ్లంలో స్కాట్‌లాగా, ఉర్దూలో అబుల్ హాలీంషేరర్‌లాగా బంకించంద్రుడు వంగభాషలో మిక్కుటంగా చరిత్రాత్మకమైన నవలలు వ్రాసేడు. స్కాట్‌నవల ఇత నప్పటికి చదవలేదన్నప్పటికీ, ఇతని "దుర్గేశనందిని" ఐవన్హోతో సమానంగా ఉంది. ఇతని కాల్పనికనవలల్లో (Romantic Novels) "బిశ్వాబిఖ్యా" అనేది బహుశ్లాఘాపాత్రంగా ఉంది. ఇతని తరవాత పేరుమోసినవాడు సరోజచంద్రుడు. ఇతని "దత్త", "పరిణీత", "చరిత్రహీన్" అనే నవలాత్రయం సర్వజనవిదితం. ఇల్లాగ్గా పురుషరచయితలే కాక, స్త్రీ రచయితలుకూడా వంగదేశంలో వెలిసేరు. స్వర్ణకుమారి, అనురూపాదేవి, సీతాదేవుల కీర్తి శతధా వ్యాపించింది. నేటి బెంగాలీ రచయితల్లో పేరెన్నికగన్నవారుబిభూతిబంద బద్ధాయ్, బుద్ధదేవ బొసులు. అందరిసీ అన్ని సారస్వత రూపరచనల్లోనూ మించి కౌస్తుభమణిలాగా దేదీప్యమానంగా వెలిగిపోయి అఖండ అమరత్వాన్ని చేకూర్చుకున్న తేజోమూర్తి రవీంద్ర దివ్యమూర్తి. సారస్వతరచనలలో ఆమహనీయుడు చేపట్టని రూపమే లేదు. నవలకి నవ్యరుచు లొప్పించి నవీన మార్గాల్లో నవనీతపేశలంగా నడిపించేడు రవీంద్రుడు.

తెలుగు నవల :—

తెలుగులో నవల ముఖ్యంగా ఆధునిక యుగానికి చెందింది. కాశీమజిలీల లాంటి కథలు మన దేశంలో పురాతనంనించీ ఉన్నాయి; కాని కథలోని ఔత్సుక్యంతో పాత్రపోషణను మేళవించి సమకాలీన మయినటువంటి నాగరికతను ప్రతిబింబిస్తూ వ్రాసినటువంటి నవలారచనమట్టుకు పూర్వకాలంలో లేదు.

ముద్రణాలయ ప్రాబల్యంతోనే నవయుగ మారంభమయిం దని చెప్పవచ్చును. 1820 నుంచీ కూడా పరిశోధక ప్రతిభ (Spirit of Research) మొలకలెత్తింది. వార్తాపత్రికా ప్రాచుర్యం, విద్యాలయాల ప్రతిభాకూడా యీకాలంలోనే సంప్రాప్తించేయి. అనేక విధాలుగా గద్యరచన సాగింది. గద్య కవిబ్రహ్మ రా॥ బ॥ కందుకూరి వీరేశలింగం పంతులుగారే నవలారచనలో ప్రథములు. తరువాత బహుప్రశంసా పాత్రంగా వ్రాసినవారు శ్రీ చిలకమర్తి లక్ష్మీనరసింహం పంతులుగారు. శ్రీ వెంకట పార్వతీశ్వరుల నవలలు సకల జనాదరణాన్ని పొంది నవలాసారస్వతంలో అమృతత్వాన్ని సంపాదించుకున్నాయి. శ్రీ ఉన్నవ లక్ష్మీనారాయణగారి "మాలపల్లి" సాంఘిక సంస్కరణావేశపూరితం. యిటు

వంటి ఉత్తమ సాంఘిక నవలలు ఎన్నైనా వెలువడవలసి ఉన్నాయి. శ్రీ భోగరాజు నారాయణమూర్తి పంతులుగారి "విమలాదేవి", "చంద్రగుప్త", "ఆంధ్ర రాష్ట్ర"దులు చారిత్రాత్మకములు. శ్రీ ఎ. వి. నరసింహం గారు, వ్యావహారికభాషలో వ్రాసిన శ్రీ చింతా దీక్షితులుగారున్ను పరిశోధకనవలా రచయితల్లో చిరపరిచితులు. ప్రస్తుతం వెలువడిన నవలలు చూస్తే సుప్రసిద్ధులైన శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారివంటి బహు కొద్దిమందివితప్ప మిగిలినవన్నీ కుక్కమూతి పిందెలే! లెక్కకు మిక్కుటంగా నేటికీ వ్రాస్తున్నవారు శ్రీ కొవ్వలి లక్ష్మీనరసింహారావు పంతులుగారు. వీరివి అన్నీ "రైల్వే బుక్ స్టాల్సు" నో వెల్సు. ఈసరికి ముఖ్యమయిన నవలారచయితలనందరినీ ఇందుమించుగా పేర్కొన్నట్లే. కాని అంతా ఎంతమంది? ప్రబంధకర్తలతో తైపారువేస్తే వీరు ఎన్నోవంతు?

శ్రీ కందుకూరివారు అన్నివిధాలయిన సారస్వతరూపాల్నీ కరతలామలకం చేసికొని నవ్యరీతుల్లో పండిత పామరుల కందరికీ సులభబోధకంగా విరచించిన విద్యావంతుడు, సంస్కర్త, ద్రష్ట. వీరి "రాజశేఖరచరిత్ర" గోల్డుస్మిత్ వ్రాసిన Vicar of Wakefield కి సరియయిన తెలుగు. హాస్య నిరూపణంలో నీలాద్రిపాత్ర మరుపుకురాదు. సుబ్రహ్మణ్యం చాదస్తమూ, బైరాగి స్వర్ణవిద్యా కడు వినోదకరంగా కొనితేబడ్డాయి. శైలి మృదుమధురమయి బహుమనోజ్ఞంగా ఉంది. చారిత్రాత్మక మయిన నవల మొట్టమొదట వ్రాసింది చిలకమర్తివారు. "హేమలత" ని చూడని సారస్వతాభిమాని ఉండడు. కథ షైలరు చాంద్ బీబీ విషయమయి వ్రాసినదానినుండి గ్రహింపబడింది. "అహల్యాబాయి" కూడా యిట్టిదే. ఈరెండున్నూ మహారాష్ట్ర, పఠాను యుగాలకు చెందినవి. జాతీయతా, స్వాతంత్ర్యాభిమానమూ, వీరోద్రేక పౌరుషములూ, ప్రాచీన భారతీయ విజ్ఞాన ఔన్నత్యమూ అనే విషయాలతో యీ రెండు నవలలూ చదువుతూన్నకొద్దీ చవులు పుట్టించి దేశంయొక్క పూర్వపు ఔన్నత్యాన్ని పునః పునః స్ఫురింపజేస్తూ దాని అంతస్తును బహు ఉత్తేజవంతంగా నిరూపిస్తున్నాయి. వీరిని ఆంధ్ర స్కాట్ అనడంలో అతిశయోక్తి లేదు. "సౌందర్యతిలక" పౌరాణిక గాథను చెబుతుంది. విషయంలో స్పష్టతా, సూటీ కనిపిస్తాయి. ఆత్మరసానుభూతివలన కలిగిన దివ్యరుచిరమూర్తిసందర్శనం యిందులో దృగ్గోచరం అవుతుంది. వీరి నవలల్లో కౌస్తుభమణి "కర్పూరమంజరి". కథ కాల్పనికం; అద్భుతాశ్చర్యాల్ని పురస్కరించుకు నడుస్తూఉంటుంది. ఆంగ్లంలో రొమాంటిక్ అన్న పదానికి తెలుగులో సమమయిన నిర్వచనం చెయ్యడం దుస్సాధ్యం. ఎంచేతా అంటే, ఆపదాన్ని అనేక సందర్భాల్లో అనేక అర్థాలు స్ఫురించేటట్టుగా ఉపయోగిస్తున్నారు. భాషాకోవిదులకి Romanticism అంటే ఏమిటో అవగాహన అవుతుంది; తన్నిరూపణ మాత్రం వీలుపడదు. కాని పంతులు గారి "కర్పూరమంజరి" చదివితే Romanticism ఎన్నివిధాలుగా ఉంటుందో తెలుస్తుంది. ఆ పదంలో ఉన్న సర్వతోముఖభావం సమగ్రంగా బోధపడుతుంది. సాంఘిక, అపరాధ పరిశోధక నవలల్లో శ్రీ వెంకట పార్వతీశ్వరకవులది ఆరితేరిన చేయి. "భూతగృహం", "264" చదివి

దిగ్భ్రమ చెందకుండా ఉండడం చాలాకష్టం. వీరు వంగభాషలోంచి చేసిన తర్జుమాలు కూడా అతి హృద్యంగా వున్నాయి. ఆంధ్ర ప్రచారిణీ గ్రంథమాల నవలలు వీరివేనని నిరాఘాటంగా చెప్పొచ్చు. "తిరుగుడు పెండ్లి" లో సాంఘికనవల తీర్చుదిద్దింది. పెళ్ళియీడుపడుచుల సౌమనస్యం, అమాయికత్వం, నవ్యంగా అవ్యక్తంగా మొలకలెత్తుతూ ఉండే ముగ్ధప్రేమా, కించిత్తుగా తెలుసుకుని మనఃపూరితంగా చేస్తూన్న దేశసేవా సువ్యక్తమయినాయి. "కుంకుమబరణి" లో సహజంగా హైందవ స్త్రీకి గల సహనశక్తీ, అమితమయిన పత్యనురాగమూ, పతిసౌఖ్యానందాలకోసం చేయుబడిన ఆత్మసౌఖ్యత్యాగమూ సునిశితంగా క్రోడీకరింపబడ్డాయి. తన భర్త యెక్కడో క్యాంపులో కలుసుకున్న స్త్రీని చూసి మోహించేడని తెలుసుకుని, కించిత్తైనా ఈర్ష్య లేకుండా అతని ద్వితీయవివాహాన్ని తన పెద్దరికంక్రింద జరిపించడమే కాకుండా, నోరారా "చెల్లెలా" అని పిలిచి "సౌఖ్యవతివయి పతిని ఆనందపరచ" మంటూ వైవాహిక పారితోషికంగా కుంకుమబరణి నవతికి యిస్తుంది యిందులో కథానాయిక. హజారీబాగ్ కలకత్తా దృశ్యాలు కళ్లకు కట్టినట్టుంటా యిందులో. శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారి "ఏకవీర", "వేయిపడగలు" "చెలియలికట్ట" మొదలయినవి అందరికీ తెలిసినవే.అవి అందరిచేతా గొప్పగా శ్లాఘింపబడినఉత్తమరచనలు.ఇంకా ఇటువంటి నవలలు ఎన్నో వెలువడవలెనని నాఉద్బోధన. భోగరాజువారి చరిత్రాత్మకమయిన నవలల్ని గురించి ప్రశంసించేం. వీరి శైలి స్వర్గంగాప్రవాహంగా నడిచిపోతూ ఉంటుంది. కథ చరిత్రాత్మక మవడంచేత, వీరసాహసకార్యనిరూపణల్లో ఒళ్లు జలదరిస్తుంది. అయినా వీరు రెండవతరగతికి చెందినవా రయ్యేరు. ఇంక మూడవ తరగతికి చేరినవారు శ్రీ కొవ్వలివారు. వీరు ఎన్నో నవలలు వ్రాసిన మాట వాస్తవమే. కాని, వీరివి ఒకటి రెండు నవలలు చదివినతరువాత మరోటి చదువుదామని ఆసక్తి కలగదు-విషయంలో గభీరత లేకపోవడంచేత. శైలి పేలవ మయినప్పటికీ మృదువుగా వుంటుందనడానికి సందేహం లేదు; కాని భావగంభీరతా, భావనా సౌకుమార్యంమట్టుకు కొఱత వడ్డాయి వీరి రచనల్లో. వీరి నవలల్లో సమస్యావిష్కారం (Problem) లేదు. వీరి ఉత్తమరచనలు "ఇంతి" "చేమంతి" "పూబంతులు."

ఈ పై సింహావలోకనంవల్ల తేలిన విషయాలు: (i) నవల అనేది ఆంగ్ల సారస్వత అవగాహనా పర్యవసానంగా వెలువడింది; (ii) వంగదేశపు నవలలు తెలుగు నవలకి దోహదాలయినాయి; (iii) తక్కువరకపు నవలలు కొంత అవినీతికరంగా ఉన్నాయి; (iv) మొత్తంమీద చూస్తే నవలా రచన పురాణ, ప్రబంధ రచనల్లాగ అమితమయిన ఉద్రేకాన్ని రచయితల్లో కలిగించలేదు. కాబట్టి వాటిలాగ యివి ఎక్కువ ప్రాచుర్యాన్ని పొందలేదు. ఈ నాలుగో విషయాన్నే యింకోవిధంగా చెబితే నవలారచన నేడు తీవ్రంగా సాగడం లేదనవలసివస్తుంది.

దీనికి కారణాలు:—(i) మన సారస్వతంలో నవలేత్యాది రూపాలు నవీనాలు. ఆంగ్లభాషాపరిచయం వల్ల గ్రాంధిక వ్యావహారికభాషాసంచలనం రేగింది. చివరకి—పరీక్ష పేపర్లలోనూ, అతి ఛాందసులలోనూ

తప్ప—శిష్ట వ్యావహారికమే రచనాప్రవృత్తిగా నిలిచింది. గద్యరచన నాలుగువిధాలా నాటుకుని బాగా ఫలించే సమయానికి ఖండాంతరాల్లో "చిన్నకథల"కీ, "ఖండకావ్యాల"కీ అగ్రస్థానం లభించింది. తత్పర్యవసానంగా ఆంధ్రవాఙ్మయంలోకూడా ఖండకావ్యాలూ, చిన్నకథలూ పెక్కులు బయల్దేరేయి. మన ఆంధ్రులకి నవ్యత అంటే మక్కువ ఎక్కువ. ఆ ఉద్రేకంలో అప్పుడే బాగా నాటుకుంటూన్న నవలని అలాగ్గా వదిలేసి యీ క్రొత్తరీతులని ఆదరించేరు; ఆదరిస్తున్నారు. (ii) ఇలాగ్గా ఆరంభశూరత్వంలో పడిపోయి ఖండకావ్యాదుల్ని పురస్కరించుకుని నవలల్ని విస్మరించేరని కేవలంగా రచయితల నెత్తిని యీ నిందమోపడం కూడా అసమంజసం. కాలపరిస్థితులను గూడా గమనించాలి. ప్రస్తుతపు యుగం అమిత సంచలనంతో కూడుకున్నది. ఇది కార్మికయుగం అనికూడా అనొచ్చును. టైము ఫేక్టర్ (Time Factor)కి మనమందరమూ వశులమయిపోతున్నాం. "పెద్దపుస్తకాలు" చదవడానికి తీరిక లేదు. ట్రాములో ఆఫీసుకి పోవునప్పుడూ, రైలుకోసం నిరీక్షిస్తున్నప్పుడూ, కచ్చేరీలలో విరామసమయంలోనూ "చప్పున ముగించెయ్యగల" రచనలు చూడ్డానికే తీరుబాటు. కాక, యుద్ధమూ లాన్ని ఆర్థిక, రాజకీయసమస్యలకే ఎక్కువ ప్రాముఖ్యత లభిస్తోంది. (iii) ప్రజానీకానికి యిప్పుడు చిన్నకథలంటేనే ప్రీతి. ఈసందర్భంలో ప్రజాబాహుళ్యంలో ఉండే అభిరుచినిబట్టి వాఙ్మయరూపం వృద్ధిపొందుతుందని అన్నప్పటికీ ఆప్రజాభిరుచిని తీర్చిదిద్దే పూచీ రచయితలమీదే ఆధారపడివుంటుందన్న మాట స్మరింపతగ్గ విషయం.

అత్యద్భుతమానవజీవితంలో గల సంచలన ఆవేగాల్ని అవగాహనచేసుకుందామని ప్రతీవ్యక్తికీ ప్రతీదేశంలోనూ ఉండే ఆసక్తే నవల ఉత్పన్నమవడానికి బీజం; సారమున్నూ. సారస్వతరూపాల్లో చివరను వెలువడింది నవల. అంచేతనే దానిలో కళకీ సంఘానికీ సంబంధించిన వివిధాలయిన సంఘటనలూ, పరిస్థితులూకూడా యిమడడానికి అవకాశం, స్థలం వున్నాయి. నాటకంలో తదనుకూల్యత లేదా అని ప్రశ్న రావచ్చును. నాటకం అనేది అనేకకళలయొక్క క్రోడీకరణం. దానికి రంగం - చిత్రరచనా, నటుడూ - నాట్యకౌశలమూ, (అంటమూ) ముస్తాబూ - గానమూ మొదలయిన యితర కళల ఔపకరణం కావాలి. నవలకి యీ ప్రతిబంధకాలు లేవు. అంచేత నవలలో కథావస్తువు - నాటకాల్లోలాగ కాకుండా - ఎక్కుడు విస్తీర్ణతా, గమనికా కలిగి స్వచ్ఛందంగా సాగుతుంది. నాటకాలకి ఉన్న ప్రతిబంధకాలు వాటి రూపాంతరమే అయిన "టాకీ"లకి లేవుగదా అనొచ్చును. నిజమే. కాని టాకీలుకూడా మూడుఘంటల పరిమితి దాటితే విసుగెత్తిస్తాయి. నవల మూడువారాలయినప్పటికీకూడా అందులోని స్వారస్యం కోల్పోకుండా చదువుకోవచ్చును.

చిన్నకథలూ, ఖండకావ్యాల్తో నవలకి పోటీ తగులకూడదు. ఖండకావ్యంగురించి యిక్కడ ప్రశంసించడం అనుచితం. కథావస్తువునిబట్టిచూస్తే చిన్నకథలు నవలల్తో పోటీ చెయ్యలేవు. (చిన్నకథలలో కళాకౌశలం ఉండదని నాఅభిప్రాయం కాదు. వాటి

పరిమితి తక్కువ అనిమాత్రమే నామనవి.) ఎంచేతా అంటే, అవి ఒక పాత్రజీవితంలో కలిగిన ఒక సంఘటనని చెప్తాయి. ఆ కారణం చేత వాటిల్లో పూర్తిఅయిన పాత్రనిరూపణానికి అవకాశం లేదు. కళ్లద్దాలచాట్నుంచో, రైలుప్లాటుఫారంమీదో, వల్లెవాటుమాటునో కాస్సేపు వాళ్లనిచూస్తాం; మళ్లీ వాళ్లు కనపడరు. ఆ చిన్న సంఘటనే చిరస్థాయిగా మనలో నాటుకుపోవచ్చు. అది మరోవిషయం. మనుష్యులతాలూకు ప్రవర్తన, భావాలు, ఆశయాలూ తెలియా లంటే వారితో మనం కొంతకాలం ఉండాలి; లేకపోతే వారి నిజమయిన అంతస్తు గుర్తించలేం. ఈమాట జీవితంలో ఎంత నిజమో, జీవితప్రతిబింబమయిన సారస్వతంలోనూ అంతే. చిన్నకథలలో మనం చూచేది ఒక ఛాయ; ఒక భావం; ఒక పరిస్థితి; ఒక సంఘటన. అంతే. పూర్తిఅయిన పరిణామం వీటిలో మనకి లభించదు. నవలలో అది సాధ్యపడుతుంది. నవలలో ఆర్థిక, సాంఘిక, రాజకీయసమస్యలూ, వాటినిగురించి రచయితయొక్క అభిప్రాయాలూ, పాత్రలయొక్క పూర్తిజీవితాలూ, కథావస్తువులో పరిపూర్ణతా సమగ్రంగా మనకు లభిస్తాయి. పాత్రలని వారి జీవిత పరిమాణాంతం అన్ని అవస్థలలోనూ మనం చూస్తాం. వారితో మనకి సానుభూతి యేర్పడుతుంది. నవలయొక్క చిరత్వం యీ అంశాలమీదే ఆధారపడివుంటుంది. ఏయే విషయాలైతే ముఖ్యంగా సంఘజీవితంలోనూ, ప్రత్యేకించి మానవఅంతరంగికజీవనంలోనూ తీవ్రసంచలనం కలిగిస్తాయో వాటిని పురస్కరించుకుని వెయ్యాలి నవలకి పునాది. అప్పుడే దాని గొప్పతనం. అటువంటి నవల దైనందిన జీవితంలో ఉండే దుఃఖభాజనత్వాన్ని కొంత తగ్గించి మనస్సుకి ఆనందాన్నీ, రుచిరత్వాన్నీ ఆపాదించి, జీవితంలో ఆదర్శనియమాల్ని ఏర్పరుస్తుంది. ఇది మూలపడ కూడదు.



# అభిసారిక

—శ్రీ వింజమూరి శివరామ రావు—



ఇరుల జాడ కార్మొగిలు దొంతరల నీడ
నేనడియు లేని యేసాయమేని రాని
నడికిరేయి నీకోస మీ యడవిదారి
నడచివచ్చు గొల్లలయింటి పడుచునోయి !

మెర పీ దూతిక వచ్చి చెప్పినది సామీ ! నాకు నీకోర్కె తొం
దర; నా నెచ్చెలి రేయి మేలుకొలిపెఁ నాగుండెలో గుండె ని
ద్దుర; వెల్గిచ్చెడు తోడు నావలపు నాతోనుండి చూపించె నీ
దరి కే జేరెడు దారి; వచ్చితిని నాథా! నిన్ను సేవింపగా.

లలిత వకుళమాలా పరీమళము పిలువ,
సరసమోహన వేణు నిస్వనము పిలువ,
క్రమతర కలాపి కలాపకాంతి పిలువ,
నీకడకు రాక నే నెట్లు నిలువ నేర్తు ?

పొడిపొడి యైన గందముల పూతలు నామెయినుండి రాలె; క్రొ
మ్ముడి విడె రేకురేకులుగ పూవులు; ముత్తెము లొక్కటొక్కటే
పడినవి త్రోవ నెల్లెడల; బంగరు గజ్జెల మువ్వ లెన్నియో
యడుగులనుండి జారినవి యాదవ! నీకొర కేను వచ్చుచో.

మేని సింగారములు చూచుకొనె లేదు;
తలచుకొన లే దీ చీకటుల; నెడంద
తొందరలు పెట్ట వచ్చితి నందతనయ !
నావలపు నీ పిలుపు నాకు త్రోవ చూప...

---

# తానొకటి తలిస్తే....!

[ కథ ]

= శ్రీ అందే నారాయణస్వామి =

వడకకుర్చీలో పండుకుని పత్రిక చదువుకుంటూ వున్న జగన్నాథం ఏదో అతిముఖ్యవిషయం గుర్తుకువచ్చి నట్టు తటాలున పత్రిక మడిచి లేచికూర్చుని భార్యను పిలిచి "పన్నెండు కావస్తున్నది, ఇవ్వాళ అమ్మడు యింకా బడి నుంచి రాలేదు యెందువల్లనో" అన్నాడు.

"నేనూ అదే అనుకుంటున్నానండీ. రోజూ యింతకు ముందే యింటికివచ్చే బిడ్డ యివ్వాళ ఎందుచేతనో యింత వరకూ రాలేదు" అన్నది మహాలక్ష్మమ్మ.

"రాముణ్ణి యిట్లా పిలు, బడికి పంపుదాం"

"యిందాకా వాణ్ణి తోటకు పంపితిరిగదూ"

"యెవ్వరూ వున్నట్టు లేదు. సరే! నేనే వెళ్లివస్తాను"

జగన్నాథం ఇంట్లోకి వెళ్లి, చొక్కా వుత్తరియ్యం వేసుకుని బయలుదేరబోతూవుండగా, అరవింద పలుగురు జరకత్తెలను వెంటవేసుకుని వచ్చింది. వయస్సు పదకొండు సంవత్సరాలు. పచ్చని శరీరచ్ఛాయ, అరవిందాలవంటి పెద్ద కళ్లు, అందమైన ముఖం.

కుమార్తె రాగానే జగన్నాథం ఆనందంతో ఆమెను దగ్గిరికి తీసుకుని తల నిమురుతూ "అమ్మడూ! యివ్వాళ యింత ఆలస్య మయిందేం? స్కూలు విడిచిపెట్టగానే యింటికి రావూ! యింతసేపటిదాకా ఎక్కడున్నావమ్మా? నీకోసమే బయలుదేరుతున్నాను" అన్నాడు.

"విమలగారింట్లో వున్నాను నాన్నా! మేము బొమ్మల పెళ్లిళ్లు చేసుకుంటున్నాం. యిప్పుడు మేము ఆడపెండ్లివా రింటికి తరలిపోవాలి నాన్నా!" అన్నది ముద్దులొలికే మాట లతో అరవింద.

"ఇంకేం! ఆటలాడుతూ కూర్చున్నది. ఇంటికి వచ్చి అన్నం తినిపోకూడదూ తల్లీ!" అన్నది మహాలక్ష్మమ్మ.

"వాళ్లింటి కెందుకమ్మా వెళ్లడం? మన యింట్లోనే ఆడుకోకూడదూ. కావలసినంత విశాలం వున్నది" అన్నాడు జగన్నాథం.

"అదేమిటి నాన్నా! వాళ్ల ఆడపిల్లను మనింటికి పంపుతారా?" అన్నది అరవింద.

ఆ ముద్దుమాటలకూ యీడుకు మించిన ఆ లోకపరి జ్ఞానానికీ తల్లిదండ్రుల హృదయాలు ఆనందంతో పొంగి పోయినవి. బిడ్డభావిజీవితంగూడా యిటువంటి శుభసంఘట నలతో నిండుగాక అని వారి ప్రేమహృదయాలు లోలోన దీవెనలిచ్చినవి.

"ఓహో! అట్లాగటమ్మా! నాకింకా తెలియదు! మగ పెండ్లివారేం మీరు? మామనవణ్ణి నా కెప్పుడూ చూపించ లేదేం తల్లీ?" అన్నాడు జగన్నాథం.

"నీదంతా యెగతాళి నాన్నా!" అంటూ తండ్రిచేతుల్లో నించి విడిపించుకుని పలకాపుస్తకాలతో యింట్లోకి పరుగు పెట్టింది అరవింద. కుమార్తెవెంట యింట్లోకి వెళ్లారు దంప తులు.

"భోజనానికి కూర్చుందాం రా అమ్మడూ!" అన్నది మహాలక్ష్మమ్మ. "వాళ్లు వెళ్లిపోతారేమోనే అమ్మా! వుండ మని చెప్పివస్తాను" అన్నది అరవింద.

"యింకా ఆకలి కావటంలేదటమ్మా? నువ్వు బట్టలూ ఆపీ విడువు. వుండమని నేను వాళ్లతో చెప్పివస్తానులే" అని జగన్నాథం హాల్లోకి వచ్చి ఆపిల్లలతో వుండమని చెప్పి యింట్లోకి వెళ్లిపొయ్యాడు.

తల్లితండ్రుల సరసన భోజనానికి కూర్చున్న అర వింద త్వరత్వరగా భోజనం ముగించి వాళ్లకంటే ముందుగా లేచి చెయ్యి కడుక్కుని జతకత్తెలను కలుసుకుని డాబాపైకి వెళ్లిపోయింది. జగన్నాథం, మహాలక్ష్మమ్మ భోజనాలవద్ద నుండి లేచి హాల్లో కూర్చుని తాంబూలం వేసుకుంటూవుం

తగా రాముడు తోటనుంచి గంపనిండా బత్తాయినారింజపండ్లు తీసుకవచ్చి వారికి వప్పగించి తన పనిమీద రాను వెళ్లిపొయ్యాడు. "అమ్మణ్ణి పిలు. ముందుగా తన యిష్టంవచ్చిన కాయలు తీసుకుంటుంది. ఏరిపారవేసిన కాయలు నాకు పద్దని తర్వాత పేచీపెడుతుంది" అన్నాడు జగన్నాధం భార్యతో. ఆమె వెళ్లి అరవిందను పిలుచుకవచ్చింది. "నీయిష్టంవచ్చిన కాయలు యేరుకో అమ్మడూ!" అన్నాడు జగన్నాధం. "చాలా మంచిపండ్లు నాన్నా! మన తోటలోవేనా యివి? మా పసుపు కుంకాల్లోకికూడా పనికివస్తవి నాన్నా" అంటూ యెంతో ఆనందంతో అరవింద కొన్నిపండ్లు యేరుకొని అందులోని నాలుగుపండ్లు తన జతకత్తెలకు నలుగురికీ ఇచ్చింది. అమ్మడి ఔదార్యం చూడమన్నట్లు భార్యాభర్తలు ఒకరి ముఖంకేసి ఒకరు చూసుకుని మురిసిపొయ్యారు. అరవిందా, జతకత్తెలూ పండ్లూ, పసుపూ పళ్లాల్లో పెట్టుకుని వెళ్లిపోతూవుండగా "త్వరగా రా అమ్మడూ!" అని చెప్పాడు జగన్నాధం.

రాత్రి భోజనానంతరం జగన్నాధం పడకకుర్చీలో కూర్చున్నాడు. ప్రక్కగా చాపమీద మహాలక్ష్మమ్మ కూర్చున్నది. తల్లికి దగ్గరగా అరవింద కూర్చుని మొల్లరామాయణం చదువుతున్నది. జగన్నాధం అర్థం చెపుతున్నాడు. వీధినే ఎవరిదో వూరేగింపు వెళ్లతూవుండడంవల్ల చదవటం ఆపి అరవిందా, మహాలక్ష్మమ్మా పెండ్లివారిని చూడ్డానికి వీధిలోకి వెళ్లారు. జగన్నాధం కూర్చున్నవాడల్లా లేచి కిటికీలోగుండా ఆ వూరేగింపును చూస్తున్నాడు. పెండ్లివారు ధనవంతులు కామాలు. పూలపల్లకీ, లెఖ్ఖలేనన్ని గ్యాసులయిట్లు, బాణసంచా, రకరకాల వాయిద్యాలతో జంయ్యిమంటూవున్నది ఆ వూరేగింపు. అమ్మడి పెండ్లి యింతకంటే వైభవంగా చెయ్యాలనుకున్నాడు మనసులో జగన్నాధం. వూరేగింపు సాగిపోవడంవల్ల మహాలక్ష్మమ్మా, అరవిందా లోపికి వచ్చారు. "అమ్మడి పెండ్లి యిట్లా యెప్పుడు చూసుకుంటానో!" అన్నది మహాలక్ష్మమ్మ భర్తకేసి చూస్తూ.

"అదీ యెంతోదూరంలో లేదు. అమ్మడికి యిప్పుడు పదకొండో సంవత్సరం అనుకో. ఈశ్వరకృప చక్కగా వుంటే యింకా రెండేళ్లకు"

"త్వరగా చెయ్యండి. యెప్పటి మే లప్పుడే. ఒక్కగాను ఒక్కబిడ్డ. పెండ్లి యెంత బాగా చెయ్యాలనుకున్నారు? అట్లా పూలపల్లకీ, మంచిమంచి మేళాలూ తెప్పించాలిసుమా?"

"అమ్మడికి కాకపోతే మనం యింకెవరికి ఖర్చుపెట్టబోతాము? ఇంకెవరి వేడుక చూసుకోబోతాము గనక. యిక మన జీవితంలో ఆమెవివాహంకంటే చెయ్యబొయ్యే కార్యాలేమున్నవి? కల్యాణాలూ అవీ కాకుండా అమ్మడి పెండ్లికి పదివేల రూపాయలు ఖర్చుచెయ్యాలని అంచనా వేసుకున్నాను. సరేనా?"

ఆమాటకు మహాలక్ష్మమ్మముఖం వికసించింది. అరవింద వాళ్ళ మాటలు ఆలకించనట్టు పుస్తకంలో పేజీలు తిరగవేస్తూవున్నది.

"చూడండి; అప్పుడు పట్టుపట్టుమంటే మంచి సమ్మంధాలు యెక్కడ దొరుకుతవి? యిప్పట్నించే దేవులాడుకుని యేదో మంచిసమ్మంధం మాట్లాడుకుని వుంచుకుంటే మంచిది"

"మంచిసమ్మంధం దొరకదని నీకేమీ సందేహం వద్దు. మనకేమీ ధనవంతుడైన వరుడు కావాలని లేదుగదా? అమ్మడికి కావలసినంత ఆస్తి వుంది! అత్తవారు పేదవాళ్లయినా ఫరవాలేదు."

"అయితేమాత్రం యింకేమీ మంచిచెడ్డలు వద్దుటండీ?"

"పుత్రవాడు బాగా చదువుకున్నవాణ్ణిగా చూద్దాం. అంతేగా?"

"చదువు వొక్కటుంటే చాలుటండీ? పుత్రవాడు రూపవంతుడూ, గుణవంతుడైవుండాలి. సంప్రదాయం మంచిదికావాలి. చాలామంది బంధువులుగలవాడై వుండాలి"

"నువ్వు చెప్పిన లక్షణాలన్నీ గల వరుడు ధనవంతుడైవుండి దొరకటం దుర్లభంగాని పేదవాళ్లలో కావలసినంత మంది దొరుకుతారు"

"అట్లని అశ్రద్ధచేస్తే తీరా మంచిసమ్మంధాలన్నీ అయిపొయ్యాక తక్కూర్తి పడవలసివస్తుంది. చూడండి : బిడ్డకు తగిన వరుణ్ణి తేలేకపోతే మనం ఎంత ఆస్తి యిచ్చినా ప్రయోజనం వుండదు. ఆతబిడ్డమీద తల్లిదండ్రులకు ఎంత అనురాగంవున్నా ఆ అనురాగాన్నంతా ఆమెకు తగిన వరుణ్ణి తెచ్చేటందుకే వినియోగించాలి కాదుటండీ? ఆమెజీవితానికి వన్నెపెట్టేవాడు భర్త."

"నిజమే. వాళ్లిద్దరూ అనుకూలదాంపత్యంతో చక్కగా వుంటే మనం చూసి సంతోషించవలసినవాళ్లమే. చూడు. ఇక మన జీవితంలో అమ్మడి శ్రేయస్సుకంటే కోరదగ్గ కోరికలేమున్నవి? ఆమెకు వరుణ్ణి తేవడంలో అశ్రద్ధ యెన్నటికీ జరగదు. అన్నివిధాలా తగిన వరుణ్ణి తెద్దాం. అమ్మడికేం రాజా! ఆమెకు యెందులోనూ యేలోటూ జరగదు. ఆమె విషయంలో నీ కేలాటి సందేహం వద్దు"

"మీకు తెలియదటలేండి. నేను వూరికే అంటున్నాగాని" అని సంబాళించుకున్నది మహాలక్ష్మమ్మ.

అరవింద ఆవలిస్తూవుండడం చూసి జగన్నాధం "అమ్మడూ! నిద్ర వస్తున్నదా? పొద్దుపోయింది. ఇక పోయి పండుకో" అన్నారు.

౨

జగన్నాధం ధనవంతుడు. స్థిరచరాస్తులు మొత్తం రెండు లక్షలకు వుంటవి. వయస్సు దాదాపు యాభై యేళ్లుంటవి. కాయపాఢమనిషి. వారికి అరవింద ఒక్కతే సంతానం. అరవింద వారికి అమరవింద. అరవిందకు పన్నెండవ యేడు రాగానే తల్లిదండ్రులు ప్రయత్నం చెయ్యకుండానే చీమలు బారుపెట్టినట్టుగా ఎన్నో సమ్మంధాలు రా మొదలు పెట్టినవి. పిల్లా చక్కని చుక్క! అంతకంటే విశేషమయింది ధనం వకటి. ఇంకేం! కామినితోపాటు కాంచనంగూడా లభిస్తూవున్నప్పుడు సమ్మంధాలకేం కొదవ? వచ్చిన సమ్మంధాల్లో కుర్రవాడికి చదువు వుంటే రూపం లేక, రూపం వుంటే చదువులేక, ఆ రెండూ వుంటే సంప్రదాయం నచ్చక యెన్నో సంబంధాలు తిరుగుముఖం పట్టినవి. ఆఖరుకు ఏలూరులో ఒక సమ్మంధం కుదిరింది. వరుడు యం. ఎ. వరకు చదువుకున్నాడు. స్ఫురద్రూపి. అది వాళ్లకు అన్నివిధాలా నచ్చిన సమ్మంధం. అతని పేరు జనార్దనస్వామి. ఎన్నో తరాలనుండీ వాళ్ల కుటుంబీకులు పేదవాళ్లు. యీసమ్మంధం ఖాయపడగానే జనార్దనస్వామీ, అతని తల్లిదండ్రులూ ఆవేళ పడ్డ ఆనందానికి అంతులేదు.

అయితే సమ్మంధం ఖాయంచేసుకునే ముందు జనార్దనస్వామితండ్రి వెంకటనారాయణ జగన్నాథాన్ని ఒక విషయం అడిగాడు. "మీకు వుత్తరోత్తరా యెవరినయినా తెచ్చుకుని దత్తతచేసుకోవాలని వున్నదా?" అని.

అందుకు జగన్నాథం "అలాటి వుద్దేశం మాకు లేదు బావగారూ. మా అనంతరం మాకున్న యావదాస్తీ మా అమ్మడికే చెందుతుంది" అని సమాధానం చెప్పాడు.

అరవిందకు పదమూడవ యేడు రాగానే అరవిందకూ, జనార్దనస్వామికీ వైభవంగా వివాహం జరిగిపోయింది. జగన్నాథానికీ మహాలక్ష్మమ్మకూ అల్లుణ్ని తెచ్చుకుని తమయింట్లోనేవుంచుకోవాలని సంకల్పం. అల్లుణ్ణి వొక్కణ్ణే వుండమని అడిగేటందుకు అతడు తల్లిదండ్రులకు వొక్కడే కొడుకు. అతనివల్లనే వాళ్లు జీవనంచేస్తున్నారు. ఆవక్కణ్ణి పంపమని యెట్లా అడుగుతారు? అందువల్ల వివాహం అయిన నెలలోనే జగన్నాధం ఏలూరు వెళ్లి "ఇక మీరంతా వచ్చి మా యింట్లోనే వుండవలసినది బావగారూ! నేనూ పెద్దవాణ్ణయిపోతున్నాను. జనార్దనస్వామే నాకు చేదోడువాదోడుగా వుండీ యింటి వ్యవహారాలన్నీ జరుపుకుపోతా"డని వియ్యంకుడితో అన్నాడు.

అందుకు వియ్యంకుడిట్లా అన్నాడు: "మేమంతా వచ్చి మీయింట్లోనే వుండనవసరంలేదు బావగారూ. మేమెక్కడ వున్నా మీవాళ్లమే! మాదంపతులం పెద్దవాళ్లమయిపొయ్యాము. ఇక మేము బ్రతికే కొద్దికాలంగూడా యిక్కడే గడపదలచాము. మీమాట తోసివేశామని అనుకోవద్దు. తీరిక యినప్పుడల్లా అబ్బాయి వచ్చి మీవ్యవహారాలు చూస్తూ వుంటాడు. మీకు అవసరంవచ్చినప్పుడల్లా కాకితో కబురు చెయ్యండి. వెంటనే సెలవయినా పెట్టివస్తాడు."

వారిని బలవంతపెట్టడం మంచిపనిగా తోచలేదు జగన్నాధానికి. ఇక వాళ్లూ బ్రతకబొయ్యేది కొద్దికాలమే. పోనీ. వాళ్ల అనంతరమే తన అల్లుడు తమయింటికి వస్తాడనుకుని "పెద్దలు తమ మాటకు అడ్డుచెప్పగలనా బావగారూ" అని సంబాళించుకున్నాడు జగన్నాధం.

ఆసంవత్సరంలోనే అరవిందకు సారెయిచ్చి కాపరానికి పంపారు పుట్టింటివారు. కోడలు తెచ్చిన వస్తుసముదాయంతో నిండి వారి యిల్లంతా కళకళ్లాడింది. అరవిందఅత్త పని కట్టుకుని ఆరోజల్లా ఇరుగుపొరుగు అమ్మలక్కల్ని పిలుచుకవచ్చి కోడలుతెచ్చినవస్తువులు చూపించి తన ఆనందపు ఉద్ధృతాన్ని తగ్గించుకున్నది. తాను తెచ్చిన వెలగల వస్తువులు ఆయింట్లో ఎక్కడివి అక్కడ అమర్చి అరవింద తిరుగాడుతూవుంటే ఆయింటికి ఒక నూతనశోభ వచ్చింది. కోడలు ప్రవేశించగానే లక్ష్మి తమయింట అడుగుపెట్టినట్లుగా వున్నది వారికి.

కోడలు రావడంతోనే అత్తకూ కోడలికీ ఒకవిషయంలో కలహం ప్రారంభమయింది. కోడలు ధనవంతుల యింట్లో పెరిగింది; అవతలపుల్ల యివతల పెట్టియెరగదు; ఆమెను యేపనీ చెయ్యనివ్వకూడదని అత్త. అత్తగారు పూజ్యులు; అందులో పెద్దవారయ్యారు; ఆమెను యేపనీ ముట్టనివ్వకూడదని కోడలూ. అత్త చేసే పనికి కోడలు అడ్డువెళ్లడం, కోడలు చేసే పనికి అత్త అడ్డువెళ్లడం ఇదీ వారి కలహకథ. ఆఖరుకు కోడలే గెలిచింది. తనమీద కాలుదువ్వినందుకు అత్తను నిర్బంధంలో వుంచి పగతీర్చుకున్నది కోడలు.

ఇక భార్య రావడంతోనే యిల్లొక స్వర్గంగా మారిపోయింది జనార్దనస్వామికి. భార్యాభర్తలకు ఒకళ్లంటే ఒక

ళ్లకి ఎంతో శీపి. ఎంతో గౌరవం. అతడు ఒంటరిగా ఆఫీసు కేమివెళ్లివస్తాడో అంతే: తతిమ్మా కాలమంతా భార్యను విడిచివుండడు.

అతనిది ముప్పైరూపాయల నౌకరీ. అదివరకు వాళ్లు ఏపూట కూరతోనో గడుపుకునేవాళ్లు. అరవింద కాపరానికి వెళ్లాక ప్రతిరోజూ ఒక వేపుడూ, ఒక పులుసూ, ఒక పచ్చడీ. వారాని కోపిండివంటా ఇట్లా ఖర్చు అధికం అవటంవల్ల భర్త డబ్బుకు కనాలాపడుతున్న సమయం కని పెట్టి అరవింద తన పెట్టెలోనించి కొంత పైకం తీసి భర్తకు యివ్వబోతుంది. అతడు "అవసరంలే"దంటాడు. "అవసరం లేదంటారేం? మన సొమ్ము మనం ఖర్చుచేసుకోవడానికి సందేహిస్తారేం?" అంటుందామె. "అవి నీ ఖర్చుకోసం తెచ్చుకున్నావు, వుంచుకో" అంటా డతడు. "ఖర్చుపెట్టడానికి నా కింతకంటే సద్వినియోగం ఏమీ కనిపించలేదండీ" అంటూ భర్తను వాడిచూపులతో లొంగదీసుకుని ఎట్లయి తేనేం పైకం యిస్తుంది అరవింద. "చిన్నరాణీ వుండగా మాకేం కొదువ" అంటూ జనార్దనస్వామి చుంబనమో, లేక కౌగిలో ఆమెకు బహుమానం చేస్తాడు.

ఒకరోజున బిచ్చపుది వాళ్ల వాకిటిముందుకు వచ్చి "పాత బట్ట యేదైనా వుంటే యివ్వు తల్లీ!" అని దీనంగా అడుగుతూవున్నదీ. అరవిందఅత్త "లేదు వెళ్లిపొ"మ్మని బిచ్చపుదాన్ని కసిరికొడుతున్నది. అది వెళ్లడంలేదు. యింతలో అరవింద యింట్లోనుంచి బయటికివచ్చింది. బిచ్చపుదాని శరీరంలో యెముకలు సులువుగా లెక్కపెట్ట టందుకు వీలున్నదికాని అది కట్టుకున్న చీరయొక్క చిరిగినపేలికలనుమాత్రం లెక్కపెట్టడానికి దుస్సాధ్యం. దాన్ని చూస్తే అరవిందకు ఎంతో జాలివేసింది. "ఉండు అత్తయ్యా! నాపెట్టెలో ఒక పాతచీర వుండాలి" అంటూ ఇంట్లోకి వెళ్లి తన దొక చీర తెచ్చి బిచ్చపుదాని కిచ్చి దాని చేతిలో కొంత చిల్లర పెట్టి వెళ్లిపొమ్మన్నది. అది చూసి అత్తగారు "అన్నపూర్ణ మాయింట్లో అవతరించిం" దని ఆనందపరవశురా లయిపోయింది. యింటిముందువసారాలో ఆఫీసుకాగితాలు చూసుకుంటున్న జనార్దనస్వామి తల యెత్తి చూసి "అరవిందకాదు; ఆశ్రితవింద"-అని మనసులో అనుకుని మురిసిపొయ్యాడు.

3

ఒకసంవత్సరం గడిచింది. మహాలక్ష్మమ్మకు విషజ్వరం అంకురించింది. పూరివైద్యులవల్ల కాకపోవడంచేత జగన్నాథం గుంటూరునించి నిపుణులైన ఇంగ్లీషువైద్యులను పిలిపించాడు. వ్యాధి ఏమీతగ్గలేదు. జగన్నాథం వెనకా ముందూ చూడకుండా డబ్బును వెదజల్లాడు. లాభం లేకపోయింది. ప్రకృతి నెదుర్కొనేవారెవరు? మహాలక్ష్మమ్మ ఈ భౌతికదేహాన్ని విడిచిపెట్టి వెళ్లిపోయింది.

మహాలక్ష్మమ్మచావుతో యీప్రపంచమంతా వట్టి మిథ్యగా కనిపించింది జగన్నాథానికి. "యీ దేహం నీటి మీది బుగ్గవంటిది. అది తెలుసుకోలేక తొందరలో ప్రాణం వున్నంతసేపూ అది నాది. యిది నాది అని ప్రాకులాడ తారు వెర్రిమానవులు. ఈ ధనధాన్యాదులు కల్ల. భార్యాబిడ్డలు మిథ్య" అన్న శుద్ధవైరాగ్యంలోకి దిగిపొయ్యాడు జగన్నాథం. "ఇక ఈధనం, ఇల్లూ, వాకిలీ నాకెందుకు?" అనుకుని యిదంతా కూతురికీ అల్లుడికీ వప్పగించివేసి తాను కాశీ వెళ్లిపోయి మోక్షసాధనకు మార్గం చూసుకోవాలని నిశ్చయించేసుకున్నాడు. అసలే తల్లి పోయి దుఃఖంలో వున్న అరవిందకు ఈవార్త తెలియనిస్తే మరింత దుఃఖపడుతుందని ఆమెకు తెలియనివ్వకుండా అల్లుణ్ణీ, వియ్యంకుణ్ణీ ఏకాంతంగా పిలిచి ఇట్లా అన్నాడు. "నే నిక కాశీ వెళ్లిపోయి శేషించిన జీవిత మంతా అక్కడే గడపదలుచుకున్నాను. ఈ యావదాస్తీ మీరే చూసుకుంటూవుండవలసినది. నాకు నెలకు పాతికో పరకో పంపుతూవుండండి. నేనొకమాట మీకు చెప్పదలుచుకున్నాను. మా అమ్మణ్ణి మీ రెలా చూసుకుంటారో. అది తల్లిలేని బిడ్డ! ఇక తండ్రికూడా లేనిదానిలో జమే! ఎంతో గారాబంగా పెరిగిన బిడ్డ. ఆమెకు ఏలోటూ జరగకుండా చూడాలి. యిదే నా తుది కోరిక". ఆఖరిమాటలు నోటివెంట వచ్చేటప్పటి కల్లా ఆతని కళ్ల వెంట బొటబొట నీళ్లు కారినవి. కంఠం రుద్ధం అయి పోయి యిక మాట్లాడలేకపొయ్యాడు. ఆమాటలు వినేసరికి అనుకోనంత త్వరలో తమకు కలగబోతున్న మహర్దశకు తండ్రీకొడుకులు మనసులో ఉప్పొంగిపోతూ, పైకి వెళ్లవద్దని యెంతో దూరం ఆయనకు చెప్పారు.

శుభవార్తవిన్నదగ్గరనుంచి తండ్రీకొడుకుల ఆనందానికి వూహలకి అంతులేదు. "మామగారు అటువెళ్లిపోవడం తోనే వాళ్ల పూరికొంప వదిలివేసి మామగారి దివ్యభవనంలో కాలంగడపొచ్చు; రానిక వెధవసేవకావృత్తి చెయ్య నవసరం లేదు. తానే పదిమందికి యజమానిగా వుండి హాయిగా స్వతంత్రజీవనం చెయ్యొచ్చు. దగ్గరలో వున్న బెజవాడలో బిజినెస్ ఒకటిపెట్టి దానిమీద నలుగురు గుమాస్తాలను వేసి తాను కారొకటికొనుక్కుని రోజూవెళ్లి అజమాయిషీ చేసుకుంటూ ఉండొచ్చు" అని జనార్దనస్వామీ; "కొడుకును ఒకవెయ్యి

రూపాయలడిగి పుచ్చుకుని వియ్యంకుడు ఉత్తరంబయలుదేరితే తాను దక్షిణయాత్రలకు బయలుదేరవలెననీ దక్షిణయాత్రలన్నీ పూర్తిచేసుకుని ఆఖరుకు కాశీవెళ్లితే అక్కడవున్న వియ్యంకుణ్ణి చూడవెళ్లినట్టూ వుంటుంది. కదలలేకుండా తనకు కాశీయాత్రాఫలంగూడా సిద్ధిస్తుంది; ఈవిధంగా తనకు ఎన్నాళ్లనుండో గల కోరికను తీర్చుకోవచ్చని వెంకటనారాయణ—ఇట్లా తండ్రీకొడుకులు గాలిమేడలు నిర్మించుకొంటున్నారు. ఆ ఆనందంతో ఆరాత్రి వాళ్లకు సరిగా నిద్రకూడా పట్టలేదు.

వారంవెళ్లి రెండోవారం వచ్చింది. రోజుగడిచినకొద్దీ ప్రపంచానికీ మానవుడికీ ముడివేయబడిన ఆశాపాశం జగన్నాథాన్ని అతనిసంకల్పంనుండి ఒక అడుగు వెనక్కు లాగుతున్నది. కర్మ వెళ్లిపోయింది. అతడు కాశీవెళ్లిపోతానని అన్నమాటను చెల్లించుకోవలసిన కాలం వచ్చింది. "కాశీలో వున్న విశ్వనాథుడూ, మనఊరి ఆలయంలోవున్న విశ్వనాథుడూ ఎందుకు ఒకటికారు? శ్రమపడి వృథాగా అంత దూరం వెళ్లడం దేనికి?" అనుకుని జగన్నాథం ప్రతినిత్యం ఆవూరి శివాలయంలోకివెళ్లి పగలల్లా అక్కడ గడపడం మొదలుపెట్టారు.

రోజుగడిచినకొద్దీ జగన్నాథాన్ని వెనుకకు లాగుతూ వున్న ఆశాపాశం క్షణంగడిచినకొద్దీ జనార్దనస్వామినీ, అతని తండ్రినీ ఒక అడుగు ముందుకు వేయిస్తున్నది. "ఇంకా కాశీ వెళ్లడేం? ఇంకా కాశీవెళ్లడేం?" అని వాళ్లహృదయాలు మారుమోగుతున్నవి.

మూడోవారంవచ్చింది. "ఈశ్వరుణ్ణి సర్వాంతర్యామి అన్నారుగదా? అనవసరంగా శివాలయంలోకి వెళ్లడందేనికి? ఆదేవుడు ఇక్కడమాత్రం ఎందుకులేడు? మనోనిశ్చలం ప్రధానంగాని" అనుకుని జగన్నాథం శివాలయంలోకి వెళ్లడం మానివేసి ఇంట్లోనే ఏకాంతంగా కూర్చుని కొంతసేపు ప్రార్థన, కొంతసేపు సద్గ్రంథపఠన రోజంతా ఇట్లా గడపటం మొదలుపెట్టాడు. జగన్నాథం బయటికిరాకుండా యింట్లోనే గడపటంచూసి తండ్రీకొడుకులు "ఇంతవ్యవహారం చప్పున వదిలిపెట్టి వెళ్లడమంటే మాటలా? రావలసిన బాకీలూ, నిల్వ రొక్కం, వున్నభూములూ, యిట్లా అవీ శ్రద్ధపట్టి లెక్కలు తేలుస్తున్నాడు. లెక్కలుతేల్చి యిచ్చిగాని ప్రయాణంకట్ట"డని నిశ్చయించారు.

నాలుగోవారంవచ్చింది. "భక్తితో ఈశ్వరునినామం ఒక్కపర్యాయం స్మరించినంత మాత్రంచేతనే ఎందరోభక్తులు తరించినట్లు చరిత్రలువుండగా రోజంతా ఇట్లావృథాచెయ్యడం దేనికి?" అనితలచి జగన్నాథం అందులో సగం కాలాన్ని ఇంటివ్యవహారాలకు వినియోగించి వాటిని పునరుద్ధరించాడు. అయినా ఆశాదేవత జనార్దనస్వామీ వెంకటనారాయణా హృదయవీధుల్లో విహరించడం మానలేదు. ఇంకా అతడు కాశీవెళతాడనే వాళ్లు ఎదురుచూస్తున్నారు.

నెలవెళ్లి ఒకరోజు గడిచింది. అది చైత్రమాసం. రాత్రిపూట ఇంట్లో ఉక్కపోస్తూవున్నందువల్ల ఆవేళ ఆరుబైట మంచంవేయించుకుని పండుకున్నాడు జగన్నాథం. అది శుక్లపక్షం. పిండిఆరబోసినట్టు వెన్నెలకాస్తున్నది. దూరాన్నుంచి కోయిలమధురగానం వినవస్తున్నది. పందిరికి అల్లబడిన సన్నజాజిపూలమీదినుండి వచ్చే సుగంధం ఆప్రాంతమంతా ఘుమాయిస్తున్నది. జగన్నాథానికి నిద్రపట్టడంలేదు. నిజానికి చల్లనిగాలి వీస్తూవుంది. పైగా చల్లనివెన్నెల కాస్తూవుంది. ఎందుకు నిద్రపట్టదు మరి? వసంతుడు అతనివెన్ను చరిచాడు. ఆవెన్నెలతాకుడుకు మిగిలిన వైరాగ్యంకాస్తా సూర్యరశ్మికి విడిపోయిన మంచువలె విడిపోయి హఠాత్తుగా అతనికి రాగోదయమై పూరుకుంది. అతని తలపులన్నీ శృంగారరసంలో మునిగితేలుతున్నవి. చంద్రుడు తెల్లనిఇస్త్రీ మడతలనువేసుకుని షోగ్గా ఏప్రియురాలిదగ్గిరికో ప్రయాణం కట్టాడు. తెల్లమేఘాన్ని వడిసిపట్టుకుని ఒక నల్లమేఘం ముద్దు పెట్టుకుంటున్నది. కాముకుడిబారినుండి తప్పించుకు వెళ్లే యువతివలె ఒకమేఘం ముందు పరుగెత్తుతూవుంటే వేరొక మేఘం వెంటబడి తరుముతున్నది. వసారాచూరులో గూడు పెట్టిన పిచ్చుకల జంట గుసగుసలాడుకొంటున్నవి. అతని మంచానికి దాపులో వున్న రెండుగులాబిమొక్కలు గాలిని తోడుచేసుకుని కావిలించుకొంటున్నవి. ఆరాత్రంతా అతనికి జాగరణ.

ఆతెల్లవారి సూర్యోదయం కాకముందే మంగలి యింటికి వచ్చాడు. నెలరోజులనుండీ యెదిగిన గడ్డాన్ని నున్నగా గీయించి మీసాల్లోవున్న తెల్లని వెంట్రుకలన్నీ తీయించి వేసి శరీరం యెర్రగా కందేటట్టు గంటన్నరసేపు నలుగుపెట్టించుకొని స్నానంచేసి ఇస్త్రీమడతలువేసుకొని పెండ్లికొడుకులాగా తయారయ్యాడు జగన్నాథం. అతని హృదయంలో నిలుపుకుని ఆరాధిస్తున్న ఈశ్వరుణ్ణి గెంటివేసి ఆస్థానాన్ని సుందరాంగి ఆక్రమించుకున్నది. అదివరకు బట్టలకు వేయించుకోవాలని తెచ్చి అలమరలో వుంచిన కావిరంగుపొట్లం దూరంగా పారవేయబడి ఆస్థానాన్ని వెంట్రుకలకు వేసుకునే నల్లరంగు అలంకరించింది. జగన్నాథం మామూలు మనిషి అవడమే కాకుండా పాతికేళ్ల పడుచువాడుకూడా అయ్యాడు. ఇక వధువుకోసం అన్వేషణ ప్రారంభమయింది.

జగన్నాథంవివాహఝంఝామారుతం జనార్దనస్వామి. వెంకటనారాయణల ఆనందజ్యోతిని ఆర్పివేసి వాళ్ల ఆశాసౌధాన్ని పునాదులతోగూడా కూలదోసి విరిచి పెట్టింది. తమకు చెందుతుందనుకున్న ఆస్తి అతడు మళ్లీ పెళ్లిచేసుకుంటే ఎలాచెందుతుంది? ఆస్తి అంతా కూతురికే నని ముందు చెప్పి పెద్దమనిషి ఇప్పు డీ పనికి పూనుకుంటాడా? తండ్రీకొడుకులను దిగులు, చింత, ద్వేషం జలగల్లా పట్టుకున్నవి. ఈనెలరోజులనుంచి వాళ్లకుటుంబం జగన్నాథంఇంట్లోనే వుంటున్నది. ఇక అక్కడ ఉండకూడదనుకుని స్వగ్రామం వెళ్లిపోయేటందుకు వాళ్ల మూటాముల్లే సర్దుకుంటూ వుండగా జగన్నాథం చూసి వాళ్ల ఉద్దేశ్యం కనిపెట్టి తండ్రీకొడుకులను ఏకాంతంగా పిలిచి వియ్యంకుణ్ణి "బావగారూ!" అన్నాడు. అల్లుణ్ణి "అబ్బాయీ!" అన్నాడు. "ఇప్పుడు మీరు వెళ్లిపోవడానికి కారణ మే మొచ్చింది? నేనిప్పుడు వివాహంచేసుకున్నందువల్ల మా అమ్మాయికి అన్యాయం జరుగుతుందని మీరెన్నటికీ అనుకోవద్దు. ఆమెకంటే నాకు ముఖ్యు లెవరు? నేను యెవరి కిచ్చేది వాళ్ల కే ఇస్తాను. ఒకళ్లకిస్తే ఒకళ్ల తృప్తి పడకపోవడానికి ఇదేం కాస్తా కూస్తా ఆస్తికాదు. ఇప్పటిధరలనుబట్టి కిమ్మతుకడితే మూడులక్షలకు పైచిలుకుమాటే కాని తగ్గదు. మీరేమనుకున్నారో? ఇచ్చింది చెడగొట్టుకోకుండా కాపాడుకుంటే పిల్లపిల్లతరానా అనుభవించవచ్చు. అదీ నేను ఇప్పుడైనా చేసుకునేవాణ్ణి కాదు. స్నేహితులూ, బంధువులూ నీకేం ఈడు మించిపోయిందని బలవంతం చేయడంవల్ల తలవూపక తప్పిందికాదు" అన్నాడు. తననెవరూ బలవంతంచెయ్యకపోయినా కమ్మకోకతప్పిందికాదు జగన్నాథానికి.

అతనిమాటలు విని తండ్రీకొడుకులు చల్లపడ్డారు. జగన్నాథానికి ఆగ్రామంలోనే సమ్మంధం కుదిరింది. పిల్ల పెద్దది. కొద్దిగా చదువుకున్నదికూడా. వివాహం జరిగిపోయింది.

పెండ్లయిన మాసంలోనే దుర్గమ్మ కాపరానికివచ్చింది. ఆమెను అరవింద "పిన్నీ!" అని పిలుచుకుని ఆనందపరవశురాలయిపోయింది. మళ్లీ జంట బస్తీకావడంతోనే జనార్దనస్వామి కుటుంబం అరవిందతోసహా ఏలూరు వెళ్లిపొయ్యారు.

౪

సంవత్సరం పెళ్లి రెండో సంవత్సరం వచ్చేటప్పటికల్లా దుర్గమ్మ కొడుకుని కన్నది. వయసుభార్య! అందులో మగసంతానం! బంగారపు కంచం, పాయసం. అంతకంటే తృప్తినిచ్చే దేముంటుంది? వీణా, అఠాణారాగం; అంతకంటే ఆనందాన్నిచ్చే దేమున్నది? పూలవనం, మందమారుతం; సుఖానికి లోటేమిటి? అద్దాలమహలు, మణిదీపం; అంతకంటే భాగ్యమేమున్నది? అల్లుణ్ణీ కూతుర్నీ వచ్చి చూసిపోవలసిందని సంతోషంతో ఏలూరుకు ఉత్తరం రాశాడు జగన్నాథం.

పోష్టుజవాను ఇచ్చివెళ్లిన ఆవుత్తరం చదువుకునేసరికి జనార్దనస్వామిముఖం కళావిహీనమయింది. తనకు తమ్ముడు పుట్టాడన్న వార్త వినేసరికి అరవిందముఖం వికసించింది. ఆమెఆనందానికి అంతు లేదు. భర్తతోకూడా తన తమ్ముణ్ణి చూసేటందుకు వెళ్లుతుంది: అక్కడ వున్న నాలుగురోజులూ పాపాయితోనే గడుపుతుంది: వెళ్లేటప్పుడు తన చిట్టితమ్ముడికి గింకపండ్లూ అపీ పట్టుకెళ్లుతుంది; తమ్ముడు పెద్దయ్యాక తనను అక్కా అని పిలుస్తుంటే తా నెంతో ఆనందిస్తుంది— యిటువంటి తలంపులతో ఆ సంతోషవార్త అత్తగారితో చెప్పటానికి ఇంట్లోకి పరిగెత్తింది అరవింద.

ఇంతలో వీధిలోనుంచి ఇంట్లోకి వచ్చిన వెంకటనారాయణ వుత్తరం పట్టుకుని విచారంతో వున్న కొడుకును చూసేటప్పటికల్లా యేఆప్తులదగ్గిరినుంచి అశుభవార్త వచ్చిందోనన్న గాభరాతో "ఎక్కడనుంచి వచ్చిందిరా వుత్తరం అబ్బాయీ?" అన్నాడు ఆదుర్దాగా.

"మామగారికి కొడుకు పుట్టాడుట" అన్నా డతడు.

తాపీగా కొడుకును చూసి యే చెడువార్తని గాభరా పడ్డాడో యీవార్తా అటువంటిదే అయిం దతనికి. "ఆస్తి అంతటికీ వారసుడు పుట్టాడు! మన కింకేం వస్తుంది?" అన్నాడు వెంకటనారాయణ శత్రువు రాజ్యాన్ని ఆక్రమించిన ఆసామీముఖం వేసి.

"అతడు యెప్పుడైతే రెండోపెళ్లి చేసుకున్నాడో లా ప్రకారం మనకేమీ రాదు"

ఇంకా అత డేదో అనబోతూవుండగానే వెంకటనారాయణ అడ్డువెళ్లి "అట్లని ఊరుకోవలసిందేనా?" అన్నాడు ఆదుర్దాగా.

"చెప్పేదంతా శాంతంగా వినవయ్యా. యెట్లా వూరుకుంటాం? ఆతడు మనకు వ్రాసియిస్తా నన్నాడుగదా. అడిగి వ్రాయించుకుందాం"

"వ్రాసియివ్వద్దూ? మొదట మొత్తంఆస్తి పిల్లకే అన్నారు. రెండోపెళ్లి చేసుకునేటప్పటికి సగమయింది. యిప్పుడు కొడుకు పుట్టాక ఇంకెంతవుతుందో! లేక అసలే గల్లంతౌతుందో!"

"అట్లా జరగకూడదు నాన్నా. పెద్దమనిషి అన్న మాట తప్పుకుంటాడా? కూతురంటే అతని కెంతో ప్రేమ. అది మనకు తెలిసినవిషయమేగదా. అటువంటివాడు కూతుర్ని అన్యాయంచేస్తాడా?"

"అట్లనుకుని తృప్తిపడి ఇక నీళ్లనములుతూ పూరుకుంటే ప్రయోజనం లేదోయి అబ్బాయీ"

"యెట్లా పూరుకుంటాం? అడుగుదాం, యింకా ఆగుతామా?" అని క్షణం ఆగి "అయితే; అడిగేటందుకు యిది సమయం కాదనుకుంటాను" అన్నాడు జనార్దనస్వామి.

"సమయమేమిట్రా సమయం: వాకపేపునుంచి ముంచుకొస్తూవుంటేనూ"

"కొడుకుపుట్టినవెంటనే పెళ్లి అడగడం అంతబాగుండదు. తొందరపడి చేసేది లేదు. ఆయనమనసుకు నొప్పి కలగకుండా శాంతంగా మందలించి వ్రాయించుకోవాలి. అంతకంటే మనకు వేరేమార్గం లేదు"

"అదను పోగొట్టుకున్నతర్వాత అంతకంటే ఇంకేముంటుంది? అసలు పెండ్లికాలమందే వ్రాయించుకోవలసింది. యిప్పుడనుకుంటే ఏం లాభం?" యీమాటలు అనేటప్పుడు రైల్లో పర్సు తీసి లెక్కపెట్టుకుంటూవున్న నోట్లు గాలికి కిటికీలోనించి కొట్టుకుపోయినవాడి ముఖం వేశాడు వెంకటనారాయణ.

"అప్పు డెట్లా వ్రాయమని అడుగుతాం? అడిగేటందుకు వీలేదీ? ఇంకా వారికి వేరే సంతానం ఏమన్నా వున్నది కనకనా? వున్నది ఒక్కపిల్లాయె. ఒకవేళ వ్రాయమని అడిగినా వాళ్ల వ్రాసేవారా? యింతకీ అత్తగారు పోవడంవల్ల యిన్ని చిక్కులూ" అన్నాడు జనార్దనస్వామి.

"అంతే; ఆయిల్లాలేగనక బతికివుంటే యిన్నిచిక్కులు వుండేవా మరి?"

"ఆమె అట్లా అకస్మాత్తుగా పోతుందని కలలోనైనా అనుకున్నామా?"

"అదీ మన దురదృష్టమేరా. కాకపోతే ఆమె బతికివుండి ఇతను పోలేదూ?"

"మన దరిద్రదేవత మృత్యుదేవతై ఆమెను మింగివేసింది"

"అంతేరా నాయనా: మహాలక్ష్మమ్మేగనక బతికివుంటే లక్ష్మి మన యింటికి తనంతట తానే నడిచివచ్చేది. జరిగిందేమో జరిగిపోయింది. యిక త్వరపడి వ్రాయించుకోవాలి."

* * *

ఆరుమాసాలు గడిచినవి. జనార్దనస్వామీ, వెంకటనారాయణా గోవర్ధనపురం వెళ్లారు. అల్లుడూ వియ్యంకుడూ జగన్నాథంగారి గడపతొక్కేటప్పటికల్లా నేతితో నిండిన కళాయి పొయ్యిమీది కెక్కింది. ఆపూట పిదికిన పాలలో తోడువెయ్యలేదు. తోటలో చెట్లపాదుల బరువు తగ్గిపోయింది. ఆపగలల్లా గడచిపోయింది. రాత్రి భోజనాలయ్యాక జగన్నాథం, జనార్దనస్వామి, వెంకటనారాయణ ముగ్గురూ దాబాపైకి వెళ్లి తాంబూలాలు వేసుకుంటూ లోకాభిరామాయణం ప్రారంభించారు. అడగటానికి యిదే సమయం అన్నట్టు జనార్దనస్వామి తండ్రివంక చూశాడు. దాన్ని 'కని పెట్టి వెంకటనారాయణ అందుకున్నాడు. "తమ కీసంవత్సరం యెన్నిపుట్ల ధాన్యం అయింది బావగారూ?" అన్నాడు సంభాషణ మార్చి.

"మాకా? ఈసంవత్సరం గింజ బాగానే రాలింది. యాభైపుట్ల వడ్లూ, పాతికపుట్ల కందులూ, పదిపుట్ల పెసలూ, పదిపుట్ల మిర్చీ అయినవి" అన్నాడు జగన్నాథం.

"పిల్లజమీందార్లు-మీకేం బావగారూ! అయితే నేనొక మాట అనదలచుకున్నాను. మీరు వ్రాస్తామన్న ఆస్తి అమ్మాయిపేర వ్రాసివేస్తే బాగుంటుంది. యెప్పటిమేలప్పుడే"

"ఇప్పు డేమంత తొందర వచ్చింది? నేను వ్రాయనని మీకే మన్నా అనుమానం వేసిందా?"

ఆమాటకు తండ్రీకొడుకు లిద్దరూ ఒక్కమారుగా "అబ్బే! యెంతమాట సెలవిచ్చారు" అన్నమీదట వెంకటనారాయణ ఆపకుండా చెప్పకెళ్లుతూవున్నాడు. "మీరు వ్రాయరని కాదు బావగారూ, ఈజీవితం శాశ్వతమైంది కాదు. కాళ్లూ చేతులూ చల్లగా వున్నప్పుడే వ్రాసివేస్తే బాగుంటుందని మావుద్దేశం"

"మా కాలాటి అనుమానం యెందు కుంటుంది మామగారూ? మీ అమ్మాయిక్షేమం కోరే విషయంలో మీకంటే మేమేమీ అధికులం కాము. మీరు వ్రాయరని ఎలా అనుకుంటాము? ఆ శ్రద్ధ మీకుగాక మరెవరికి? మేమనే దేమిటంటే, మీఅనంతరం వున్నవాళ్ల చిక్కులుపడకుండా చెయ్యమని" అన్నాడు జనార్దనస్వామి. "అంతే అంతే బావగారూ: మేము కోరేది. మీరు మేము చెప్పేటంతటి వాళ్లము కాము" అని అందుకున్నాడు వెంకటనారాయణ.

ఇక జగన్నాథం ప్రారంభించాడు: "వ్రాయడానికి నాకేమీ సందేహం లేదు. యెప్పుడైనా వ్రాసేదే కాని. యిప్పుడే వ్రాసేటట్లయితే కొన్ని చిక్కులు వున్నవి. అవి

గూడా మీకు చెబుతున్నాను. నేనా చేసుకున్నది రెండో పెళ్లి! అమ్మాయిపేర వ్రాయడంతోటే మాకుకూడా వ్రాయమని అవతలవాళ్లు తప్పకుండా కూర్చుంటారు. అప్పుడు యిద్దరికీ మొత్తం ఆస్తి వ్రాసియివ్వవలసివస్తుంది. అందువల్ల వూర్లో నా పరపతికీ, గౌరవానికీ హానివస్తుంది."

జనార్దనస్వామి అడ్డువచ్చి అన్నాడు: "వాళ్లు తమ పేర వ్రాయమని యెందుకు కోరడం? కోరే అవకాశం కలగదనుకుంటాను. మీరన్నప్రకారం మీఅమ్మాయిపేర సగం వ్రాసివేస్తే మిగతాసగం మీపేరనే వుంటుంది. మీపేర వున్న ఆస్తి లాప్రకారం మీఅనంతరం వాళ్లకే చెందుతుందిగదా?"

ఇంతలో దుర్గమ్మ ఏపనిమీదనో డాబాపైకి వచ్చింది. జగన్నాధం ఏదో చెప్పబోతున్నవాడల్లా ఆమెను చూసి ఆపాడు. దుర్గమ్మ వెళ్లిపోయినతర్వాత అన్నాడు:

"అట్లని వాళ్లు వూరుకోరు. అబ్బాయీ! నువ్వింకా చిన్నవాడివి. లోకానుభవం తక్కువ. బావగారు అంతా గ్రహించేవుంటారు. ఎప్పుడైతే అమ్మాయిపేర సగమాస్తి పెట్టానో అప్పుడు యిక నన్ను వాళ్లు నమ్మే అవకాశం యెట్లా వుంటుంది? ఇట్లాగే తతిమ్మాఆస్తికూడా వాళ్లకు చెందకుండా దుబారుచేస్తానని అనుకోవచ్చు. ఇప్పుడు అమ్మాయిపేర వ్రాయగానే తప్పకుండా వాళ్లూ వ్రాయమని కూర్చుంటారు. అంతవరకు నిజం. తీగ లాగితే డొంకంతా కదులుతుంది. తొందరపడవద్దు. మీ రిప్పుడేమీ ఆదుర్దాపడే అవసరం లేదు. నా శరీరపటుత్వాన్నిబట్టి చూస్తే ఇంకా నేను చాలానాళ్లు జీవిస్తాను. యిప్పట్లో నాకేమీ పరవాలేదు. ఆఖరుకు నేను ఒకమాట చెబుతున్నాను. ఆస్తి నాబిడ్డపేర పెట్టకుండా బొందెలోనుంచి యీప్రాణాలు లేచిపోవు. నిజంగా నమ్మండి"

జగన్నాథం చెప్పిన సమాధానం తండ్రీకొడుకులకు తృప్తిని కలిగించకపోయినా అతడు చూపిన కారణాలనుబట్టి ఏమీ మాట్లాడలేకపొయ్యారు.

---

జగన్నాథం వధువుకేలుపట్టిన వేళావిశేషం యెటువంటిదో కాని రత్నాలవాన కురిసినట్టు ఇల్లంతా మగబిడ్డలు. మళ్లీ సంవత్సరం వెళ్లి రెండోసంవత్సరం వచ్చేటప్పటికల్లా దుర్గమ్మ కవలపిల్లలను కన్నది. ఇద్దరూ మగపిల్లలు. యీ వార్త అరవిందఅత్తవారికి జోడుగుళ్లదారువలె పోయి తగిలింది.

జగన్నాధానికి తొలిసారి కొడుకు పుట్టడంతోనే అరవిందఅత్తవారికి ఆమెపైన పూర్వం వాళ్లకున్న ప్రేమగౌరవాలు కొంత తగ్గినవి. మళ్లీ యిప్పుడీ పుత్రద్వయం కలిగిందన్న వార్త వినగానే వారు అరవిందతో సరీగ్గా మాట్లాడడమే మానివేశారు. భర్త ఆమెతో అనుమతిగా వుండడం లేదు. అత్తమామలు ఎడముఖం పెడముఖంగా వుంటున్నారు. యిది ఆమె సుకుమార హృదయానికి చాలా బాధ కలిగించింది. వాళ్ల కోపకారణ మేమిటా అని ఆమె ఆలోచించింది. తనవల్ల ఏమీ లోపం లేదు. తాను ఎవరికీ కోపంవచ్చే పనిగూడా చెయ్యలేదు. మరి తానంటే ముగ్గురికీ గిట్టకపోవడానికి కారణం యేమైవుంటుంది? అదంతా తన పుట్టింటిమీది కోపమే నని గ్రహించుకున్నది.

ఆనాటి రాత్రి పడకగదిలో అరవింద భర్తమంచం మీద కూర్చుని "ఏమండీ! నామీద కోపంగా వుంటున్నారు దేనికి?" అన్నది. అతడు పలకలేదు. "ప్రతిపనికీ అత్తగారినే పిలుస్తుంటిరి. మధ్యాన్నం పండు యివ్వవస్తే పుచ్చుకోకపోతిరి. అదంతా ఎందుకు? యిట్లా మంచంమీద నేను కూర్చుంటే ఎప్పుడైనా మౌనంగా వూరుకుని ఎరుగున్నారా? అత్తగారుగూడా సరీగా పలకటం లేదు. మామగారు అమ్మాయీ అమ్మాయీ అంటూ ఎంతో ఆదరణతో పిలిచేవారు: వారూ సరీగా మాట్లాడటం లేదు. ఆ కారణ మేమిటో నా కెలా తెలుస్తుందండీ?" అన్నది.

"ఎవరికైనా ముందుమాటలు తర్వాత వుండవు. అన్నప్రకారం జరిపే దెంతటివాళ్లో" అన్నా డతడు.

"ఎవరికి ముందుమాటలు తర్వాతలేవు? ఎవరు అన్నప్రకారం జరపలేదు? ఏమిటండీ?" అన్నది అరవింద.

"తెలియదా? నీతండ్రి!" అన్నా డతడు.

అప్పుడు ఆమెకు అర్థమయింది. సంవత్సరంక్రిందట తన భర్తా, మామా గోవర్ధనపురం వెళ్లివచ్చి ఆస్తివీళ్ల వ్రాయమని అడిగినట్టూ, ఆయన తర్వాత వ్రాస్తానని చెప్పినట్టూ వాళ్లు అనుకున్న మాటలు కర్ణాకర్ణికగా తాను విని వున్నది. తన పనేమో తానేమో గాని వేరే గొడవలు ఆమెకు అసలే పట్టవు. మధ్య తీరికసమయంలోగూడా పుస్తకం చదువుకోవటమో. లేక కుట్టుపనో చేస్తుంది. అదేమిటని యీమె వాళ్లను అడగనూలేదు; యిదిట్లా జరిగిందని వాళ్లు యీమెకు చెప్పనూలేదు.

"ఆస్తి వ్రాసే విషయమా?" అన్నది అరవింద.

"అది గాకపోతే యింకేమున్నది?"

"మళ్లీ యిప్పుడు ఆయనను వ్రాయమని అడిగితే కాదన్నాడా ఏమిటండీ?"

"మళ్లీ ఎవరడిగా రంటావు?"

"మరి మీభయానికి కారణమేమిటి?"

"తెలియదూ, మళ్లీ కొడుకులు పుట్టిన సంగతి?"

"మీకోపానికి కారణం అదేనటండీ! వాళ్లకు యింకా ఎంతమంది కొడుకులు పుట్టినా మన విషయంలో వ్రాయరన్న అపనమ్మకం మీకేమీ వద్దు"

"వ్రాస్తాడని ఏమి టానమ్మకం? కొడుకులు పుట్టిన కొద్దీ అతని మనస్సు మారిపోవచ్చు"

"మానాన్ననుగురించి మీరట్లా ఎన్నటికీ అనుకోవద్దు. ఆయన అన్నప్రకారం తప్పక వ్రాసితీరతాడు"

"ఎప్పుడో వ్రాస్తాట్ట! వ్రాస్తాడని ఏమి టాగ్యారంటీ! అప్పటికి రాజెవరో, రెడ్డెవరో!"

"ఆయననుగురించి మీ కేలాటి అనుమానమూ వద్దు. మానాన్న సంగతి మీకు తెలియదు."

"కొడుకులు జాస్తీఐనకొద్దీ ఆస్తి పంచుకుంటానికి వాళ్ల కే చాలదనుకుని నీకు ఎగరగొట్టవచ్చు"

"మానాన్నకు తమ్ములు వొకటీ నేను వొకటీ కాదు. వాళ్లను ఎక్కువా, నన్ను తక్కువా చూస్తా డనుకున్నారా? ఆయ నట్లా ఎన్నటికీ చెయ్యరు"

"నువ్వు చిన్నదానివి. యిటువంటి పెద్దవిషయాలు నీకేం తెలుసు? అటువంటి పిచ్చినమ్మకాలమీద ఆధారపడితే లాభంలేదు. ముందుగానే బిగించుకోవాలి"

"మీ కెందుకు? ఆయనచేత వ్రాయించే భారం నాది. నామాట నమ్మండి"

"యెప్పటి సంగతో యిప్పుడు నువ్వెట్లా భారపడ గలవు? అప్పటికి నీమాట ఆయనవింటాడని ఏమి టానమ్మకం? ఇప్పటి నీమీదిప్రేమ అప్పటికి లేకపోవచ్చు"

"పోనీ, యిప్పుడే వ్రాయవలసిందని అడగండి"

"మేము అడిగితే వ్రానేటట్లయితే యింకేం?"

"నన్ను అడగమన్నారా?"

"అడగమనాలా? ఇంకో తెలివికల ఆడపడు చైనట్లయితే వాకిటిముందు కూర్చుని మరీ వ్రాయించుకోకపోయిందనుకున్నావా? నీపేరుతోనేగదా మేము వ్రాయమనటం? అసలు వాళ్లకే శ్రద్ధ లేనప్పుడు యెవరేం చేస్తారు?"

"యీవిషయం యిదివరకు ఎప్పుడైనా నాకు చెప్పారటండీ? ఇప్పుడేగా నాకు తెలియడం? యిక అడుగుతాను"

"అడగడమేకాదు; పట్టుపట్టి మరీ వ్రాయించుకోవాలి. నీతండ్రికి నీమీద యెంతప్రేమున్నదో యిప్పుడు కనపడాలి!"

"మీరు చెప్పినప్రకారం గట్టిగా అడిగి వ్రాయించుకొస్తాను. మీరుమాత్రం నామీది కోపాన్ని తీసివేసుకోండి. యీరెండురోజులనుంచీ మీరు సరీగా మాట్లాడకపోతే నాకు రెండు రోజులూ రెండు యుగాల్లాగా వున్నవంటే నమ్మండి"

రెండురోజులు ఆగినతర్వాత జనార్దనస్వామి అరవిందను వెంటపెట్టుకుని వెళ్లి పుట్టింట దిగవిడిచివచ్చారు.

తండ్రి హాల్లో ఒంటరిగా వుండగా అరవింద వెళ్లి అతని దగ్గరగా కుర్చీలో కూర్చున్నది. "ఏమమ్మా! ఏమిటి విశేషాలు?" అన్నాడు అనురాగపూరితమైన స్వరంతో జగన్నాథం.

"ఆస్తి వ్రాయమని అడిగారుటగా నాన్నా?"

"అవును తల్లీ! ఆ విషయమై యిప్పు డేం వచ్చింది?"

"యెప్పుడో వ్రాస్తా నన్నావుటగా నాన్నా."

"అవునమ్మా, వీలుచూసి వ్రాస్తానని చెప్పాను. వాళ్లు నిన్నడగమన్నారా తల్లీ?"

"అవును నాన్నా."

"నీచేత అడిగించవలసివచ్చిందీ తల్లీ? అన్ని విషయాలూ నేను వాళ్లతో మాట్లాడాగా."

"యెప్పుడైతే నేం, యిప్పుడే వ్రాసివెయ్యి నాన్నా."

ఈ మాటలు అనేటప్పుడు అరవింద కంఠధ్వనిలో గారాబం ఇమిడి ఉన్నది. కాని ముఖంలోమాత్రం విచార రేఖలు పొడచూపినవి. ఆమెముఖంలో మార్పును కనిపెట్టి జగన్నాథం "నిన్నేమన్నా వాళ్లు అన్నారా అమ్మా?" అన్నాడు తత్తరపాటుతో. ఏమీ అనలేదన్నట్టు తలకాయ మాత్రం తిప్పింది అరవింద. అంతటితో అతనికి మనశ్శాంతి కలగక లేచి కూతురి తల నిమురుతూ "చెప్పుతల్లీ! నాదగ్గర దాచబోకు. నీ కష్టసుఖాలు నాకు గాక మరెవరికి చెప్పుకుంటావు?" అన్నాడు. తండ్రిచేతులో పసికూన అయిపోయింది అరవింద. ఆమెకళ్లు అప్రయత్నంగా చెమ్మగిల్లినవి. "వాళ్లు నాతో సరీగా మాట్లాడ్డం లేదు నాన్నా" అన్నది.

ఆ కాస్త మాటను పురస్కరించుకొని కూతురికి ఎంతో కష్టం కలిగినట్టు కన్న హృదయం కంపించింది. "నిన్ను వత్తిడిచేస్తున్నారా తల్లీ! ఎంతోదూరం వాళ్లకు చెప్పాను. వాళ్ల పట్టు వాళ్లదేగాని మంచిచెడ్డలు వద్దూ?

ఇటువంటివాళ్ళని నేనెన్నడూ అనుకోలేదు. నీసుఖంకంటే నాకష్టసుఖాలుగూడా నాకు ఎక్కువైనవి కావు తల్లీ. ఇక వ్రాసివేస్తాను" అన్నాడు.

వీళ్ల సంభాషణ అంతా దుర్గమ్మ కిటికీఅవతల వుండి ఆలకిస్తున్నది.

౬

ఆమర్నాడు భర్త కోటకు వెళ్లినప్పుడు పుట్టింటికి కబురువెళ్లింది. దుర్గమ్మతండ్రి రెక్కలుకట్టుకుని వచ్చి వాలాడు. తండ్రీకూతుళ్లిద్దరూ చాలాసేపు గుసగుసలు చేశారు.

రాత్రిపూట భోజనం అయ్యాక జగన్నాథం గదిలో మంచంమీద కూర్చున్నాడు. దుర్గమ్మ వాడుకప్రకారం వెండి పళ్లెంలో ఆకులూ, వక్కపొడీ వుంచి మంచంముందు ముక్కాలిపీటమీద పెట్టి భర్తకు ఎదురుగా నిలుచున్నది. తాంబూలచర్వణం చేస్తూ జగన్నాథం ఎదురుగా నిలుచున్న అర్ధాంగిశరీర అవయవసౌష్ఠవాన్ని తిలకిస్తూ ఆనందంలో మునిగిపోయ్యాడు.

"ఇందాకా అరవిందతో ఏమిటి వ్రాస్తా నంటున్నారు?" అన్నది దుర్గమ్మ.

ఈమాటలు హఠాత్తుగా వినవచ్చేసరికి ఉలిక్కిపడ్డా డతడు. రెండవకంటివాళ్లకు తెలియకుండా వ్రాసి వెయ్యాలని అతని సంకల్పం. ముఖ్యంగా ఎవరికి తెలియ కూడదని అత డనుకున్నాడో వాళ్లకే తెలిసింది. సమర్థించ టానికి అతని బుద్ధి పనిచేస్తున్నది.

"అ, ఏమీ లేదు. అది వేరేవిషయం. చూడు, మొన్న సీతమ్మగారి పెండ్లికి ఏదో సహాయం చెయ్యమని అడిగావు కదూ? ఎంత యివ్వమన్నావు, చెప్పు. పాపం, వాళ్లూ పేద వాళ్లు!" అన్నాడు సంభాషణ మార్చివెయ్యాలని.

"ఏమీ లేదంటారేం? నాకు తెలియదనుకొన్నారా? మీరనుకొన్న మాటలన్నీ విన్నాను. మాతమ్ముడి పెండ్లి సంగతి అడ్డంతెచ్చి పెడతారేం? ఆసంగతి యిప్పుడు మిమ్మల్ని యెవరడిగారు? ఆఖరుకు నన్ను మరపించాలనికూడా చూస్తు న్నారు. ఆస్తంతా కూతురిపేర పెట్టి పిల్లల్నీ నన్నూ యేం చెయ్యతలుచుకున్నారు?" అంటూ దుర్గమ్మ పమిటచెంగుతో కళ్లు అద్దుకున్నది.

"ఆస్తంతా పెడతా ననుకున్నావా యేమిటి? మిమ్మల్ని మాత్రం వెడగొట్టుకుంటానా? ఆస్తంతా పెడతానవేనా నువ్వు ఇంత ఇదికావటం? పిచ్చిపిల్ల! అట్లా నువ్వెన్నటికీ అనుకో బోకు. ఆమె ఎక్కువా మీరు తక్కువా కాదు. ఉభయులూ నాకు సమానులే"

"అంతా కాకపోయినా కొంతమాత్రం ఎట్లా వ్రాస్తారు? మగబిడ్డ లుండగా ఎవరైనా ఆడపిల్లకు ఆస్తి కట్టబెట్టేవా ళ్లున్నారా?"

"ఈసందర్భం వేరు. అమ్మడి వివాహకాలంలో జరిగిన మాటలు నీకేం తెలుసు? అప్పుడు ఆస్తంతా ఆమెదే నని అన్నాము; అటువంటప్పుడు సగమైనా వ్రాయకపోతే ఎట్లా?"

"సగం కాదు గదా, ఆఖరుకు పూచికపుల్లయినా ఇచ్చేటందుకు వీల్లేదు."

"ఇదిగో, నువ్వు చిన్నదానివి. ఇటువంటి వ్యవహా రాలు నీకు తెలియవు. ఇదేం ఎంతమంది పంచుకున్నా తరిగే ఆస్తి కాదు. వ్రాయకపోతే వీల్లేదు. అడ్డం చెప్పవద్దు."

"మీరు వ్రాయదలుచుకున్నారా, నన్నూ, నాపిల్లల్నీ ఏగంగలోనో తోసి మరీ వ్రాయండి. అప్పుడు తండ్రీ కూతు ళ్లు సుఖంగా వుందురు గాని."

జగన్నాథం తనభార్య మిగతా సగం ఆస్తి తనపేర పెట్టవలసిందని అడుగుతుం దనుకున్నాడు గాని అరవింద పేర ఇట్లా అసలే వ్రాయవద్దని పట్టుపడుతుం దనుకోలేదు.

"ఇంత ఆలోచన లేకుండా మాట్లాడతా వనుకోలేదు. అమ్మాయికి అత్తవారివల్ల చాలా వత్తిడి కలిగింది. ఆడపిల్ల ఉసూరుమనటం మనకు మంచిదా" అన్నాడు.

ఆమాటకు ఆమెకు ఎక్కడలేని కోపమూ వచ్చింది. తనపేరును సార్థకపరుచుకున్నది. "మగబిడ్డలు ఉసూరు మనడం మీకు సంతోష మన్నమాట. ఆస్తి కూతురిపేర వ్రాయదలుచుకున్నవారు మళ్లీ ఈ జంఝాటాన్ని ఎందుకు పెట్టుకున్నారు? ఏడిస్తే వాళ్లే ఏడ్చి పోతారుగదా అనా? వీళ్లు గనక అడ్డంలేకపోతే ఆస్తంతా కూతురిపేర పెట్టుకుని తండ్రీ కూతుళ్లు సుఖంగా వుండేవాళ్లుగా?"

"................................"

"రత్నాలవంటి మగబిడ్డలను చూసి ఇనా వ్రాస్తానన టానికి మీమన స్సెలా అంగీకరించిందండీ?"

"................................"

"ఏమీ తెలియని కసికందుల్ని అన్యాయం చెయ్య టానికి మీప్రాణం ఎలా వప్పిందండీ?"

"................................"

"అటువంటివాళ్ల ఎందుకు కన్నారు?"

ఆమెకఠినవాక్యాలను ఆలకిస్తున్న జగన్నాథంశ్రవణేంద్రియంతో ఆమెలావణ్యాన్ని వీక్షిస్తున్న అతని చక్షురింద్రియం స్నేహం కలుపుకున్నది. ఆమె చిన్నగా మాట్లాడితే చిలకపలుకుల్లాగానూ, బిగ్గరగా మాట్లాడితే కోయిల కూతలాగానూ వున్నదతనికి. జగన్నాథం అంత ధనవంతుడయ్యీను సౌందర్యధనముందు అతని ధనం యేమీ పని చెయ్యలేదు. ఆమెయెదుట లక్షాధికారిముందు భిక్షాధికారిలాగా అయిపోయ్యాడు.

దుర్గమ్మ భోజనం చెయ్యకుండా గదిలో చాప పరుచుకుని పండుకున్నది. పక్కగదిలో పండవేసిన కవలపిల్లల్లో ఒక కుర్రవాడు గుక్కపట్టి ఏడుస్తున్నాడు. అరవింద ఎంత సముదాయించినా వూరుకోలేదు. తన పినతల్లిని పిలుచుక వద్దామని పినతల్లిగదిలోకి వెళ్లింది అరవింద. అరవింద వెళ్లేసరికి తనతండ్రి పిన్నిని లేవమని బ్రతిమలాడుకుంటున్నాడు.

అరవింద అన్నది: "పిన్నీ! తమ్ముడు ఏడుస్తున్నాడు. ఎంత సముదాయించినా ఊరుకోవడంలేదు. ఏడ్చిఏడ్చి గొంతెండి పోతున్నది. లేచి పాలివ్వు".

దుర్గమ్మ కోపంతో "పోనీలేవమ్మా తల్లీ! వాళ్లకుగనక గొంతెండిపోతే అందరి కళ్లూ చల్లపడతవి," అన్నది.

తన పినతల్లికోపానికి కారణ మేమిటో అరవిందకు అర్థంకాలేదు. మారుమాట్లాడకుండా చిన్నపుచ్చుకుని వెళ్లి పోయింది.

"ఏమి టామాటలు? అమ్మాయి ఎంత కష్టంతో వెళ్లిందో చూడు. ఇదిగో నామాట వినవు? ఎంత చెప్పినా అంతేనా? లేచి పిల్లవాడికి పాలిచ్చి అన్నం తిను. ఎందుకట్లా యిదిఅవుతావు" అన్నాడు జగన్నాథం.

"నాతిండిగోలి మీకెందుకు? నేను తింటేనేం, తినక పోతేనేం? ఆస్తి కూతురిపేర పెట్టుకుని మీరూ మీరూ సుఖంగా వుండండి. నేనూ, నాపిల్లలూ యెట్లా పోతే మీ కెందుకు?" అంటున్నది దుర్గమ్మ.

ఆమాటలు వెళ్లిపోతున్న అరవిందకు వినిపించినవి. తన పిన్నికోపానికి కారణమేమిటో ఆమెకు బోధపడ్డది. ఆస్తివిషయంలో తన అత్తవారు తొందరపడుతున్న దెందుకో అప్పు డామెకు అర్థమయింది. ఆస్తి వ్రాయించుకుని వెళ్లటం తాను అనుకున్నంత సులభమైన పని కాదనికూడా అప్పు డామెకు తెలియవచ్చింది. ఆమెమనస్సు వికలమైపోయింది. వెళ్లి గదిలో చాప పరుచుకుని పండుకుని తన పోయినతల్లిని తలుచుకుని దుఃఖపడ్డది.

జగన్నాథం ఎంత బతిమలాడినా దుర్గమ్మ లేవక పోవడంవల్ల తానే ఏడ్చే కుఱ్ఱవాడిని ఎత్తుకుని వెళ్లి తల్లి పక్కలో పండవేశాడు. అప్పుడు రాత్రి పదిగంటలవుతుంది. జగన్నాథం అరవింద పడుకున్న గదిలోకి వెళ్లి "అమ్మా! అన్నం తిన్నావా?" అని అడిగాడు.

"లేదు నాన్నా!" అన్నది అరవింద.

"ఇంత ప్రొద్దుపోయినా నువ్వెందుకు తినలేదు తల్లీ?"

"నా కాకలిగా లేదు నాన్నా".

"ఆకలి లేకపోవట మేమిటమ్మా? లేచి ఆకలి ఐన వరకే తిను తల్లీ!"

అరవింద పండుకున్నదల్లా లేచికూర్చుని "పిన్ని అలిగి పండుకున్న దెందుకు నాన్నా?" అన్నది.

"అది నామీది కోపంలే తల్లీ!"

"మన ఇద్దరిమీది కోపం నాన్నా. యిందాకా పిన్ని మీతో అంటున్న మాటలు నాకు వినిపించినవి. వ్రాస్తానన్నందుకు మీమీదా, వ్రాయమన్నందుకు నామీదా."

"నీమీద దానికి కోపం వుండదు తల్లీ!"

"ఇందాకా నేను వస్తే యెలా విదిలించివేసిందో విన్నావుగా నాన్నా?"

"అదీ నామీది కోపమే తల్లీ! మీపిన్ని వట్టి వెర్రి బాగులది. తెలియని మూర్ఖం!"

"తప్పకుండా వ్రాయించుకుని వస్తానని వారిని నమ్మించి వచ్చాను నాన్నా!"

"మీపిన్ని వట్టి బోళామనిషి తల్లీ! మంచికి దానంత మనిషి లేదు. దాన్ని సమాధానపరిచి వ్రాసివేస్తాను. నువ్వేమీ విచారించక లేచి భోజనం చెయ్యి తల్లీ!"

అరవిందకు భోజనంచెయ్యాలని మనస్సులేనందున తండ్రికి ఏదో సమాధానం చెప్పి పంపింది.

కాలుగాలిన పిల్లిలాగా జగన్నాథం మళ్లీ భార్య పడుకున్న గదిలోకి వెళ్లాడు. భోజనం చెయ్యకుండానే దుర్గమ్మ పిల్లలను పక్కలో వేసుకుని నిద్రపోతున్నది. ఆమెపొట్ట వెన్నుకంటుకునివున్నది. జగన్నాథాని కెంతో జాలివేసింది. తానుతిన్న అన్నంకూడా నీరై పోయింది.

౭

ఆ తెల్లవారి సూర్యోదయం కాక ముందే దుర్గమ్మ లక్షణంగా భోజనం చేసి యథాస్థానాన్ని అలంకరించింది. భార్య భోజనం చేస్తూవుండగా జగన్నాథం చూసి చాలా

సంతోషించాడు. తన ఆకలి చల్లారినట్టుగా వున్న దతనికి. అరవిందకు మనస్సు స్తిమితంగా లేదు. అదివరకు ఎప్పుడు చూసినా ఆమెచేతులో తమ్ముడుగాని, లేక పుస్తకంగాని వుండేది. ఆవేళ ఆమె ఏమీ ముట్టుకోలేదు. తండ్రి చెప్పగాలేచి భోజనంమాత్రం చేసింది. జగన్నాథం భార్యను ఒకటి రెండు సార్లు పలకరించబోయాడుగాని ఆమె సరిగా మాట్లాడలేదు.

ఆసాయంత్రం "అక్కయ్యా!" అంటూ దుర్గమ్మ తమ్ముడు వచ్చాడు. దుర్గమ్మ సంతోషంగా తనతమ్ముడితో ఏవో మాట్లాడి తమ్ముడు వెళ్లతూవుంటే అతనితో వీధి వాకిలిదాకా వెళ్లింది. దుర్గమ్మ ప్రొద్దుటినించీ పక్క వదిలి పెట్టనిదల్లా స్థానం విడిచి అప్పుడు వీధివాకిట్లోకి వెళ్లడం, ఆమెముఖం సంతోషంగా వుండడం శుభలక్షణాలు చూస్తే జగన్నాథానికి ఎంతో సంతోషం అయింది. త్వరగా ఇంట్లోకి వెళ్లి తాటాకులబుట్టనిండా కలకత్తాజామపండ్లు వేసుకుని వీధివాకిట్లోకి పట్టుకువెళ్లి తన బావమరదితో ఛలోక్తిగా "ఒరే బావా! మీ అక్కకోపాన్ని మోసుకెళుతున్నావుకదూ, జతగా ఇవిగూడా మోసుకెళ్లు" అంటూ బుట్ట అతని భుజం మీద పెట్టాడు.

దీపాలు వెలిగించాక జగన్నాథం భార్యగదిలోకి వెళ్లి "మీతమ్ముడికి పిల్ల కుదిరినట్టేనా?" అని భార్యతో సంభాషణ మొదలువేశాడు.

"అంతా ఎరగనట్టు అడుగుతారు; మీకు తెలియందే కుదురుతుందాఏమిటి పిల్ల!"

"చూడు, పిల్లకు వస్తువులేవో వాళ్లు పెట్టుకుంటే తతిమ్మాఖర్చులన్నీ మనం భరించి పెండ్లిచేసివేద్దాం. మన వాళ్లకు మనం ఆదుకోకపోతే యెట్లా?"

క్షణం ఆగి జగన్నాథం అన్నాడు: "అమ్మాయి ఎంత దిగులువేసుకుందో చూశావుకదూ?"

అరవిందమాట తెచ్చేసరికి మళ్లీ పుట్టెడుకోపం ఆమెమీదకు దొర్లింది. "ఇంకేం, దిగులు తీర్చండి." అని విసురుగా అన్నది.

"మన బిడ్డదిగులు మనం కాకపోతే ఎవరు తీరుస్తారు మరి?"

దుర్గమ్మముఖం ఎర్రపడ్డది. "అయితే మీ వుద్దేశం ఆస్తి వ్రాసివెయ్యాలనే నన్నమాట? ఎవరితరపువాళ్లమీద వాళ్లకు ప్రేమ. ఎవరికీ పట్టనిబిడ్డ వెక్కివెక్కి ఏడ్చాడుట! యీ పాడు పిల్లలు ఎవరు పుట్టమని యేడ్చారు? పుట్టక పోయినా యీగోలంతా లేకపోను. ఆస్తి నా కేమన్నా కావాలని అఘోరిస్తున్నాను గనకనా? మేమంటే మీ కంత ఇష్టం లేకపోతే నన్నూ నాపిల్లల్నీ మాపుట్టింటికి పంపివెయ్యండి."

"మనసు కనిపెట్టకుండా అట్లా తొందరపడి మాట్లాడితే యెట్లా? నాకు భేదం ఎంతమాత్రం లేదు. ఉభయులూ నాకు సమానులే. నువ్వు భేదంగా మాట్లాడుతూ పైగా నన్నంటావు. నీబిడ్డ అయితే వొకటీ, నీ సవతిబిడ్డ అయితే వొకటీనా?"

దుర్గమ్మ ఆవేశంతో అన్నది: "మీ తప్పు మీరు తెలుసుకోలేకుండా పైగా నన్నంటున్నారా? ఉభయులూ సమానం అనటంలోనే కనపడుతున్నది మీ భేదబుద్ధి. సిసలుగా మగపిల్లలకు చెందవలసిన ఆస్తిని అంతాగాని కొంతగాని ఉభయులూ నాకు సమానులే అంటూ ఆడపిల్లకు వ్రాస్తాననటం అటువైపు మమకారం కాకపోతే మరేమిటి? ఆడ పిల్ల అయినందుకు వచ్చి నెల్లాళ్లు వుండి తినమనండి. సారెలూ చీరెలూ యివ్వండి. అంతవరకే ఆడపిల్లకు పుట్టింటిలోని హక్కు. మీ రొక వందరూపాయల చీర తెచ్చి ఆమెకు పెడతా నంటే నేను వద్దన్నప్పు డనండి నాది భేదబుద్ధని."

జగన్నాథం నిలవతొక్కుకుని అన్నాడు: "నువ్వు చెప్పేది సామాన్యంగా లోకంలో జరిగే విషయంగాని అమ్మాయికి అది వర్తించదు. నిన్ను చేసుకోకపూర్వం ఎప్పుడో జరిగినమాటలుకాని యిప్పటివి కావు. అన్నమాటను ఏస్థితిలోనైనా జరిగించటం ధర్మమేగా?"

"అయితే మగబిడ్డల్ని మోసంచెయ్యటం మీకు ధర్మ మన్నమాట?"

"సంగతి గ్రహించుకోకుండా భర్తను ఎదిరించి మాట్లాడటం ఆడదానికి తగునా? మూర్ఖం వదిలి కాస్త మంచి దాని వనిపించుకో."

ఆమాటకు దుర్గమ్మకోపం విజృంభించి ఏడుపుగా మారింది. "మంచిదాన్ని కాకపోవటానికి నేనేమన్నా బజార్లు పట్టుకుని తిరుగుతున్నానా? నేనేమన్నా అందర్నీ నోటికివచ్చి నట్లల్లా కూస్తున్నానా? పిల్లల గొంతు కోయటానికి నేనూ తయారైనట్టయితే మంచిదాన్నే! బిడ్డలు తండ్రికే విరోధు లౌతారని యెన్నడైనా అనుకున్నానా? పిల్లలిట్లా దిక్కూ దివాణం లేనివాళ్లయిపోతారని కలలోనైనా అనుకుని యెరుగున్నానా? యెవరికీ గిట్టనప్పుడు యిక్కడ మేమింకా వుండి దేనికి?"

భార్య సరాగాలు తీస్తున్నది. జగన్నాథం లేచివెళ్లి హాల్లో కుర్చీలో కూలబడ్డాడు. వ్రాద్దామంటే భార్యపోరు:

వ్రాయకపోతే కూతురి గోడు: వెనుక నుయ్యి, ముందు గొయ్యి: దారీ తెన్నూ తెలియక అయోమయంలో పడిపోయ్యా డతడు.

ఆరాత్రి ఎవరూ భోజనాలు చెయ్యలేదు. అరవింద తనతండ్రికీ పినతల్లికీ జరిగిన ఘర్షణ విన్నది. ఆమె ఇంత గొడవ జరుగుతుం దనుకోలేదు. ఆమె హృదయం అతికోమలమైనది. తన విషయమై తాను పడుతూ వున్న చింతకాక తననుగురించి తన తండ్రి పడుతూ వున్న మనస్తాపంకూడా ఆమెకెంతో చింతకు కారణమైంది. ఆరాత్రి తండ్రి భోజనం చెయ్యకపోయ్యేసరికి ఆమెహృదయం ఎంతో బాధపడ్డది. తన తండ్రి పిన్ని అంగీకారం లేకుండా వ్రాయడని ఆమె తెలుసుకున్నది. చూస్తే పిన్ని ఒప్పుకునేటట్లు ఆమెకు కనపడలేదు. ఇప్పటికే పిడుపులూ పస్తులూదాకా వచ్చింది. ఇంకా తన తండ్రి పిన్ని అంగీకారంకోసం ప్రయత్నిస్తే రభస పెరిగిపోవటంతప్ప ప్రయోజనం వుండదు. వ్రాసేదిలేకపోగా అనవసరంగా వాళ్లకూ వాళ్లకూ రభస పెరిగి మళ్లీ నిలవపెట్టుకున్న ఆయనసంసారం చిందుచిందుకావడం దేనికి? తన తండ్రిని మందలించాలని అరవింద ఆరాత్రి ఆలోచించుకున్నది.

తెల్లవారి తన తండ్రి ఇంట్లో ఏకాంతంగా కూర్చుని వుండగా అరవింద వెళ్లి "నాన్నా! ప్రస్తుతం యీవిషయం ఇక పిన్నిదగ్గర తేవద్దు. ఆగవలసిందని వాళ్ళకు నేను యేదో విధంగా నచ్చచెబుతాను" అన్నది.

ఆమాటలు జగన్నాథానికి ప్రవాహంలో పడి కొట్టుకొటుతున్న వారికి పూతలాగా పనిచేసినవి. కుమార్తెదీక్షకు ఎంతో ఆనందించాడు. ఆమర్నాడే అరవింద ప్రయాణమై అత్తవారింటికి వెళ్లిపోయింది.

౨

ఆరోజుసాయంత్రం అఫీసునుండి ఇంటికి వచ్చిన జనార్దనస్వామి పుట్టింటివద్దనుండివచ్చిన భార్యను చూసి ఆమెను యింట్లోకి పిలిచి "నువ్వు వెళ్లిన పని ఏం చేసుక వచ్చావు?" అని అడిగాడు.

"మా నాన్న ఏమీ అడ్డుచెప్పలేదు. వ్రాస్తానన్నాడండి"

"వ్రాశాడా మరి?"

"యిప్పుడే వ్రాయటానికి ఆయన పూర్తిగా ఒప్పుకున్నాడు కాని—"

జనార్దనస్వామి మధ్యలో అందుకున్నాడు: "ఏమిటి కాని? మళ్లీ యేమన్నా పానకంలో పుడక పడ్డదా యేమిటి?"

"మరేమీ లేదండీ, కొంచెం ఆలస్యం. అంతే."

"పొడుగూనా వాకటే ఆలస్యం. వ్రాయడానికి ఆయన పూర్తిగా అంగీకరించా డని గదా చెపుతుంటివి. ఆయన అంగీకరించినప్పుడు యింకా ఆలస్యం దేనికి?"

"మా పిన్నిది కాస్త ఒప్పించవలసివచ్చింది."

"అట్లాచెప్పు. మీనాన్నకు కొత్తపెళ్లాం సలహా తీసుకుంటేనే గాని ఏపనీ చెయ్యలేనంతటి అవస్థ పట్టిం దన్న మాట!"

"అబ్బే! అట్లా అంటారేమండీ? యీ విషయం మా నాన్న ఆమెకు చెప్పే అవసరమే లేదు."

"చెప్పే అవసరమే లేనప్పుడు ఆమెను ఒప్పించే అవసర మెందు కొచ్చింది?"

"మేము అనుకునే మాటలను ఆమె విన్నది."

"అదా సంగతి? పనిపట్టి మీరనుకునే మాటలను విని వ్రాయవద్దని పేచీపెట్టుకుని కూర్చున్నదన్నమాట. యిప్పుడు నా కంతా అర్థమైంది. ఆస్తి ఎక్కడ కూతురిపేర వ్రాస్తాడో అని మొగుణ్ణి వెయ్యికళ్లతో కనిపెడుతూవున్నదన్నమాట. అయితే కథ చాలా లోతుకు వెళ్లిందన్నమాట"అని జనార్దనస్వామి నిట్టూర్పు విడిచాడు.

"ఏదో ఆడవాళ్లగోల ఎరగరూ? మాపిన్ని ముందు కాదన్నా తర్వాత ఒప్పుకోకపోదు."

"అసలు వాళ్లను ఒప్పించేదేమిటి? వ్రాసివేస్తే తొత్తుఖానా ఏంచేస్తుంది? మీనాన్న కసలు మనస్ఫూర్తిగా వ్రాయాలని వుందేగా?"

"అట్లనకండి. మానాన్న వ్రాయలేక కాదు. ఇంట్లో గుల్లకలతలు యెందుకని ఆమెను ఒప్పించే వ్రాయాలని చూస్తున్నాడు. మనం వాళ్ల కష్టనిష్ఠూరాలుకూడా పారచూసి కొంత ఆలస్యానికి సహించుకోవాలి".

జనార్దనస్వామి కోపంతో "ఆవిడ ఒప్పుకుని మీ నాన్న వ్రాస్తాడని నీ కంత నమ్మకం వుంటే అందాకా అక్కడనే వుండి వ్రాయించుకుని రాలేకపోయ్యావూ? యిక్కడ ఏం మునుకు పోయిందని వచ్చావు?" అన్నాడు.

ఆమాటకు అరవిందకళ్లల్లో నీళ్లు తిరిగినవి. "మీరు వుండగలిగినా మిమ్మల్ని విడిచి నేనుమాత్రం వుండలేను"

వెంకటనారాయణ, అతనిభార్యా కొడుకువల్ల సంగతి సందర్భం తెలుసుకున్నారు. వెంకటనారాయణ నిరాశతో మంచులాగా గడ్డకట్టుకుపోయ్యాడు. ఆయనభార్య ఉద్వేగంతో పరవళ్లు తీసింది. "ఆగమంటే యెందాకని ఆగుతారు? చెప్పే

వాళ్లకైనా వుండాలి, వినేవాళ్లకైనా వుండాలి. యిప్పుడు పెళ్లాం వంక వకటి దొరికింది. ఎగవెయ్యడానికి యెన్ని సాకులయినా తెచ్చిపెట్టుకుని యెట్లాగైనా కాలం గడుపుకోవచ్చు. యింత దగా యెక్కడైనా వున్నదా? అంతా మీకేనని అరటిపండు వొలిచి చేతిలో పెట్టినట్టు మాటలు చెపితే నిజమేకామాలని కాపీ కట్నం పుచ్చుకోకుండా పిల్లను పుచ్చుకుంటే ఆఖరుకు యీవిధంగానా మాట్లాడేది? పెద్దమనిషి కిది తగునా? చిక్కిన తగువా చిక్కని తగువా అన్నారు. వేలకివేలు కట్నం పిల్లవాడి కాళ్ల దగ్గిర పోస్తామని ఎంతోమంది వస్తే వాళ్లనూ వదులుకుంటిమి. ఎకరాలకు ఎకరాలు మాగాణి లగ్నకాల మందు చదివిస్తామని ఎంతోమంది బతిమలాడితే వాళ్లనూ మానుకుంటిమి. మంచికి మంచి యెక్కడైనా వున్నదా? వాళ్లను ముందు యేవిధంగా నమ్మించి దించామూ అన్న గుర్తుండవద్దూ? పని గడిచినతర్వాత గడిచిన మాటలు! యేదో మర్యాదస్థులూ, సాంప్రదాయీకులూ అనుకున్నాము గాని యిలా రెండోమాటకు వస్తా రనుకోలేదు. నలుగుర్లోకి వచ్చేపొయ్యేవాడుగదా యిట్లా చెయ్యడం అతనికి తగునా?"

అత్తగారి విసుర్లు విని అరవింద తన్నవాళ్లను తిట్టించేటందుకు పుట్టానుకామాలని తనను తాను నిందించుకుని వూరుకున్నది.

అరవింద పూర్వం వాళ్ల దృష్టిలో పిల్లజమీందారిణి. యిప్పుడు ఆస్తీ పాస్తీ లేని సామాన్యనికృష్టస్త్రీ. అరవింద వాళ్ల చేత పూర్వం ఎంత గౌరవంగా చూడబడిందో యిప్పుడు వాళ్ల కంత గిట్టనిదై పోయింది. అత్తగారు ప్రతిపని వద్దా రుంజుకోవడం, సూటీపోటీమాట లనడం, మూతివిరుపులూ ముక్కువిరుపులూ ప్రారంభమైనవి. భర్త ఆమెతో మాట్లాడ్డం మానివేశాడు. అరవిందకు అరణ్యంలో వున్నట్టుగా వున్నది. ఆమెహృదయవేదన చెప్పటానికి అలవికాదు.

ఆరోజు జనార్దనస్వామి చీకటిపడగానే యింటికి వచ్చి తొమ్మిది కొట్టేటప్పటికల్లా భోజనం చేసి పడుకున్నాడు. అరవింద భోజనం చెయ్యకుండానే భర్త పడుకున్న మంచం దగ్గిరికివెళ్లి "మీరు నాతో మాట్లాడడంలేదు. నామీదకోపానికి నే నేం చేశాను చెప్పండి?" అన్నది వినయంగా. అతడు జవాబు చెప్పలేదు.

"చూడండి. ఆయన తప్పక వ్రాసితీరతాడు. ఒకవేళ మీరనుకున్నట్లు వ్రాయకపోతాడా. పోనివ్వండి. వాళ్ల మాట వాళ్లకే వుంటుంది. వాళ్లు వ్రాసియివ్వనంత మాత్రాన మనంతట మనం బతకలేకపోము. యెందుకు నామీద కోపం చెప్పండి?"

ఆమాటలకు జనార్దనస్వామికి ఉక్రోషం ఎత్తుకుని వచ్చింది. "యిట్లా నాటకం ఆడి మమ్మల్ని కాస్తా బుట్టలో వేసుకోమని మీతండ్రి నేర్పివంపా డన్నమాట? యీమాట లేమీ యిక్కడ చెల్లవు. వెళ్లి ఆస్తిలో మాగడప తొక్కు"

ఆమాటకు తలమీద పిడుగు పడ్డట్టయింది అరవిందకు. అప్రయత్నంగా ఆమె కళ్లవెంట రెండు నీటిబిందువులు జారి భూమిమీద పడ్డవి.

"నేను ఏమాట మాట్లాడినా మీకు తప్పుగానే వున్నది. మీరు కోపంగా వుంటూవుండబట్టి ఆయన వ్రాయకపోతే మనంతట మనం బతకలేమా, కోపంగా ఎందుకుంటారు అన్నాను. యిందులో నా కాయన నేర్పివంపిం దేమిటండీ నాబొంద? నన్ను ఆస్తిలో గడపతొక్కమంటున్నారు. మీ మనస్సు యింత కఠినమైందని నేనెన్నడూ అనుకోలేదు. ఆభారం నామీద వెయ్యడానికి మీరూ మీరూ ముందు ఏమి మాట్లాడుకున్నదీ నేనేమన్నా ఎరుగుదునటండీ? మధ్య నన్ను బాధించటం న్యాయమేనా? మీతో చెప్పినప్రకారం వెళ్లి ఆయనను అడిగి వ్రాయించుకోండి."

"అంతేనా? మేము అడగవలసిందేకాని నీకేమీ పని లేదన్నమాట. ఔను. నువ్వుగనక అడిగితే నీమాట తీసి వెయ్యలేక ఆస్తి ఎక్కడ వ్రాసివేసి మీతండ్రి నష్టపడి పోతాడో అన్న భయం నిన్ను పీడిస్తూవుంటే ఎందు కడుగుతావు?"

"అయ్యో! యెట్లాగండీ? నే నెందుకు అడగను? మొన్న వెళ్లి అడిగివస్తినిగదండీ. మీరు ఆస్తిలో గడప తొక్కమంటూవుంటే అంత భారం నామీ దెందుకు వేస్తారు. మీరు వెళ్లి అడగండి అన్నానుగాని".

"నువ్వు అడగటం చెప్పనా, మాకళ్లనీళ్లు తుడిచేటందుకు వెళ్లి అడిగావు. మీరు మాలలను బాగా కనుక్కున్నారు. మీతండ్రి మాలో సత్తా తెలుసుకుని వాళ్లేం చేస్తారని మమ్మల్ని చెవులుపట్టుకుని ఆడిస్తున్నారు. యివతలవాళ్లు ఎంత పిచ్చివాళ్లయినా మిమ్మల్ని చూసిఐనా నేర్చుకోరూ? యీదెబ్బతో అన్నీ తేలతవి."

తాను ఏది మాట్లాడినా భర్తకు తప్పుగా కనబడుతున్నందున అరవింద యిక ఏమీ మాట్లాడలేదు. తన పుట్టింటివద్ద పరిస్థితులు అనుకూలంగా లేవు. యిక్కడ పరిస్థితులు చూస్తే యిట్లా విషమించినవి. ఆమెస్థితి కత్తినాగలి వందున చిక్కుకున్నట్లయింది. ఆరాత్రి అరవింద నిద్ర పోలేదు.

వాళ్ల కోపతాపాలముందు వుండటం అరవిందకు బుసలుకొట్టే సర్పాల మధ్య నివసిస్తున్నట్టుగా వున్నది. అందలం ఎక్కినవాళ్లు అందలం మొయ్యటం కష్టం. అయినా ఎంతో ఓర్పుమీద అట్లాగే కొన్నిరోజులు గడిపింది.

ఆరోజుఉదయం భర్త ఆఫీసుకు వెళ్లడానికి ఇంట్లో బట్టలు వేసుకుంటూవుండగా అరవింద వెళ్లి "నేను వుండటం మీ కంత కష్టంగా వుంటే నన్ను మాపుట్టింటికి పంపి వెయ్యండి" అన్నది.

"రోగి పాలే కోరాడు. వైద్యుడూ పాలే చెప్పాడు" అంటూ జనార్దనస్వామి రంద్రిని పిలిచి "పుట్టింటికి వెళ్లతుందట. వెళ్లి దిగవిడిచి రమ్మని చెప్పాడు. వెంకటనారాయణ బండికోసం వెళ్లాడు.

జనార్దనస్వామి బట్టలు వేసుకుని వెళ్లిపోవడానికి సిద్ధం అయ్యాడు. అప్పుడు అరవింద దుఃఖస్వరంతో "వెళ్లి వస్తాను. యీదీనురాలిమీద దయమాత్రం వుంచండి" అంటూ వంగి భర్తరెండుపాదాలనూ కళ్ల కద్దుకుని కన్నీటితో భర్తకు పాదాభిషేకం చేసింది.

"దీనురాల వనుకుంటానికి నీకేం ఖర్మం! లక్షాధికారి ముద్దులకూతురి వైతే" అని జనార్దనస్వామి నోట్లో నోట్లో గొణుక్కుంటూ వెళ్లిపోయ్యాడు. అరవిందకు ఆయింట్లో ప్రియమైన రెండోవస్తువు ఆవువొకటి. ఆఆవు వాళ్ల పుట్టింటివాళ్ల తోలిపెట్టినది. అదంటే ఆమె కెంతో ప్రాణం. పెరట్లో కట్టివేసివున్న ఆవుదగ్గరకి వెళ్లింది అరవింద. ఏలాటి చీకూ చింతా లేకుండా మానవులకు లభ్యంకాని అనిర్వచనీయమైన ఆనందసుఖాన్ని అనుభవిస్తూ నెమరువేస్తున్న దా మౌనమూర్తి. "తల్లీ, నిన్ను వదిలిపెట్టిపోతున్నాను. మళ్లీ నిన్నెప్పటికి చూస్తానో" అంటూ కన్నీళ్లతో ఆవుశిరస్సును తడిపివేసింది.

ఇంతలో గుర్రబ్బండి వచ్చి వాకిటిముందు ఆగింది. బండివాడు అరవిందపెట్టెబేడా బండిలో పెట్టాడు. అరవిందా, వెంకటనారాయణా బండియెక్కి రైలుస్టేషనుకు వెళ్లిపోయ్యారు.

౬

రైలు గోవర్ధనపురంస్టేషనులో ఆగింది. అరవింద, వెంకటనారాయణ బండిదిగారు. వెంకటనారాయణ ఒంటెద్దు బండి మాట్లాడగా అరవింద బండిలో యెక్కింది. స్టేషనుకూ, ఊరుకూ నాలుగు ఫర్లాంగుల దూరం. బండి ముందు వెళ్లుతూ వుండగా బండివెనక వెంకటనారాయణ నడుస్తున్నాడు. బండి వూరు సమీపించి గల్లీ తిరిగేటప్పటికల్లా బండివెంటవస్తున్న వెంకటనారాయణ వెనకవెనకనే మాయమయ్యాడు. బండి అరవిందపుట్టింటి ముందు ఆగింది. బండి వాకిటిముందు నిలవగానే ఇంట్లోనించి జగన్నాథంపెద్దకొడుకు సంతోషంతో గంతులువేసుకుంటూ బండిదగ్గిరికి వచ్చాడు. అరవింద బండి దిగగానే ఆకుర్రవాడు అరవిందను కా[illegible]చేసుకున్నాడు. అరవిందకు ఆ కుర్రవాడు ఎంతో మాలెం. అరవింద పుట్టింటి వద్ద వున్నన్నాళ్లూ ఆకుర్రవాడు తల్లిదగ్గిరికైనా పోడు. "ఒరేః చంద్రం! మీ అక్కయ్యను తీసుకవెళ్లడానికి యెదురు వచ్చావుట్రా?" అంటూ అరవింద వాడిని చంకనవేసుకుని ఇంట్లోకి వెళ్లింది.

ఇంటి చివరిగుమ్మంవద్ద వున్న దుర్గమ్మ అరవింద వీథిద్వారంవద్ద వుండగానే చూసి ముఖం చిట్లించుకుని "దోచుకుంటానికి వస్తున్నది" అని మనసులో అనుకుని చూడనట్టు వెంటనే ముఖం తిప్పుకుని అవతలకు వెళ్లిపోయింది. అరవింద ఇంట్లో కాలుపెట్టగానే ముందు పనిమనిషి కోటిలింగ కనిపించింది. అరవిందముఖంలో పూర్వపు ఆనందం, పూర్వపు కళ లేవు. తల దువ్వుకోనందున ఆమె జుట్టు రేగివున్నది. ప్రయాణం చేసేటప్పుడు కట్టుకునే చీరకాకుండా మామూలుచీరే కట్టుకొనివున్నది. పూర్వం ఆమెను ఒకసారి చూచినవాళ్లకుసైతం ఆమెలోని మార్పు స్పష్టంగా కనిపిస్తున్నది. కోటిలింగ బిందె పుచ్చుకుని నీళ్ల తేవడానికి వెళ్లబున్నదల్లా అరవిందను చూచి ఆగి గడ్డంమీద చెయ్యి వేసుకుని "అట్లా వున్నావేమ్ అరవిందమ్మగోరూ? యిదేనా రావటం? జరం తగులుతున్న దేంటమ్మా అట్లా వున్నావు" అన్నది.

"అవును కోటిలింగా! వంట్లో బాగుండటంలేదు. సరే కాని మానాన్న కనిపించలేదు. తోటకుగాని వెళ్లాడా?"

"తోటకు కాదమ్మా. నిన్ననంగా గుంటూరు వెళ్లారు. ఇంకా రాలేదు. తమ్మయ్య అప్పిడే సంక యెక్కాడు. పిల్లలంటే నీకెంత పానం? దేవుడు నీకింకా వదికట్టలేదు" అన్నది కోటిలింగ విచారాన్ని సూచించే ముఖం పెట్టి.

"మా పిన్ని కనపడలేదు, యింట్లోగాని వున్నదా?"

"మీపిన్నమ్మ యింట్లోనే వున్నదమ్మా. గదిలో యేదో చేస్తున్నది"

అరవింద దుర్గమ్మ వున్న గదిలోకి వెళ్లింది. దుర్గమ్మ కొంత దూరంలో వుండగానే అరవిందచంకలో సంతోషంతో పొంగిపోతున్న చంద్రం తల్లిని చూడగానే "అమ్మోయ్!

అక్కడయ్యా వచ్చిందేవ్" అని కేకపెట్టారు. పెట్టె తెరచి చీరలు లెక్కపెట్టుకుంటూవున్న దుర్గమ్మ కుర్రవాడు అన్న మాటలు వినపడనట్లు తలతిప్పిఅయినా చూడకుండా యిస్త్రీ మడతలు తిరుగా బోర్లా వేస్తున్నది. అరవింద ఆమె దగ్గిరికి వెళ్లి "పిన్నీ ! ఏం చేస్తున్నావు ?" అన్నది.

దుర్గమ్మ అప్పుడు తలయెత్తిచూసి "యెప్పుడొచ్చావమ్మా?" అన్నది. అరవిందను పలకరించడం తప్పనిసరి అయినందున దుర్గమ్మగొంతును పెకలించుకుని వచ్చింది ఆఖొస్తమాటా.

"యిప్పుడే పిన్నీ. నాన్న గుంటూరు వెళ్లాడుటగదూ"

"కోర్టుపని వుండి పిన్ననంగా వెళ్లారు. పిన్ననే తిరిగి వస్తానని రాలేదు. యివాళ రావాలి" అన్నది దుర్గమ్మ పెద మొఖం పెట్టి.

జగన్నాథం ఆరోజుసాయంత్రానికి ఇంటికి తిరిగి వచ్చాడు. అరవిందను చూసి "యెప్పుడొచ్చావమ్మా" అన్నాడు బరువెక్కిన గుండెతో.

"మధ్యాన్నం వచ్చాను, నాన్నా"

"మరీ అట్లావున్నావేమమ్మా, అక్కడి విశేషాలేమిటి?"

"విశేషాలేమీ లేవు నాన్నా. నాలుగురోజులు వుండి పోదామని వచ్చాను"

"చెపితే బాధపడతా వని దాస్తున్నావా తల్లీ? మీపక్కయింటి కృష్ణమూర్తి నాకు గుంటూరులో కనపడి అంతా చెప్పారు. మీఅత్త నిన్ను రంపానరాస్తున్నదటగా? ఇంట్లో ఎవ్వరూ నీతో సరీగా మాట్లాడ్డం లేదటగా? ఒకనాడు కృష్ణమూర్తి వాళ్ల దొడ్డిగుమ్మంవద్ద నిలుచుంటే నువ్వు ఆపుకు కుడితిపెడుతూ కళ్లనీళ్ల పెట్టుకుంటున్నావట. అతను అంతా నాకు చెప్పారు. ఎవ్వరో చెప్పడం దేనికి? నిన్ను వాళ్ల వేపుకుతింటున్నట్టు నీ వునికే చెపుతున్నది. ఎలా వుండేదానివి ఎలా అయిపొయ్యావు తల్లీ."

జగన్నాథం అంతలో వుగ్రుడై "వాళ్ల పత్తిమూర్ఖులు. ఎద్దెమంటే తెద్దెమనేరకం. వాళ్ల అర్రు వంగిందాకా యిక నువ్వు వాళ్ల గడప తొక్కవద్దు. ఇక్కడ నీకేం తక్కువ తల్లీ? నువ్వూ ఒక మగబిడ్డ ననుకుంటాను" అని జగన్నాథం అక్కడనుంచి వెళ్లిపొయ్యారు.

అరవిందను చూస్తే దుర్గమ్మ ఎప్పుడూ కొరకొరలాడుతూవుంటుంది. అరవింద పిలిస్తే దుర్గమ్మ పలకటమే కష్టం. అరవింద పొకపూట తింటే పొకపూట తినదు. ఆమె హృదయం దుఃఖాతిరేకంచేత లోలోపల కుమిలిపోతున్నది. ఆమె ఏకాంతంగా కంట తడిపెట్టని రోజు లేదు. ఆమెశరీరం రోజురోజుకూ కృశించిపోతున్నది. ఆమెజీవితం దుఃఖమయం అయిపోయింది.

ఒకరోజున నలుగురైదుగురు కుంటీ, గుడ్డివాళ్లు కలిసి దీనంగా పాడుకుంటూ వాకిటిముందుకు వస్తే అరవింద వాళ్లకు దోసెడు వడ్లు వేసింది. తన గదిలో నిలువుటద్దం ముందు నిలుచుని తలకు సువాసననూనె రాచుకుంటూవున్న దుర్గమ్మ అరవింద ఇంట్లోనుంచి వడ్లు పట్టుకవెళ్లడం చూసి చిఱుబుస్సులాడుతూ "ఈ ఇంట్లో అందరివీ పెత్తనాలే. వచ్చిన వాళ్ల వచ్చినట్టు వూరుకోరు, కాసినా కూసినా, అమ్మయ్యో! ఎన్ని వడ్లు? యెన్ని వేసినా వాళ్ల పొమ్మేమన్నా పోతుంది గనకనా?........." అని ఏవేవో అంటూవుండగా అరవింద విన్నది. అసలే చింతతో కృశించిపోతున్న ఆమెహృదయానికి ఆమాటలు శూలాలవలె నాటి ఎంతో బాధకలిగించినవి. "పుట్టినింటివాళ్లకు వున్న సిరీ సంపదా, ఇల్లూ వాకిలీ అంతా తనదేననుకుని అమాయకపుటానందంతో పెరిగి పెద్ద అయిన ఆడబిడ్డ తీరా పుట్టిల్లు వదిలి అత్తవారింట్లో అడుగు పెట్టగానే పరాయిదై పోతుంది. పుట్టింట్లో పూచికపుల్ల నయినం ముట్టుకునేటందుకు తనకు హక్కు లేదు. ఆస్తిమీది హక్కు తనతో సమంగా రక్తాన్ని పంచుకవచ్చిన పురుషులకు. ఇంటిలోని పెత్తనం మధ్యవచ్చిన స్త్రీలకు. ఇక తాను నోచుకున్నది పూటమెతుకులకుమాత్రం. ఆడబిడ్డ చేసిన ఘోరపాపం ఏమిటి?" అని అరవింద చాలా దుఃఖపడ్డది.

అరవిందచింత, దుర్గమ్మయీర్ష్య రోజు రోజుకూ పెరిగిపోతున్నవి. పక్షంరోజులు వాటంతట అవి వెళ్లిపోయినవి. దుర్గమ్మ పీటమీద పెట్టి పిల్లిమీద పెట్టి అరవిందను సూటిపోటిమాటలనడం మొదలుపెట్టింది. అరవిందకు అవి ఎంతో బాధాకరంగా వున్నవి. ఆమె ఒకళ్లచేత అనిపించుకునదిగాని, ఒకళ్లను అనిగాని ఎరగదు. అందులో ఆమె పడుతూవున్న తీరని మనోవ్యథగాక పైగా యీమాటలు ఒకటి. ఆమెకు శగలుచిమ్మే అగ్నిగుండంమధ్య నివసిస్తున్నట్టుగా వున్నది. పుట్టిల్లని వస్తే యిక్కడా ఆమెకు శాంతి లేదు.

ఆరోజు వుదయం దుర్గమ్మ నడవలో పోసివున్న జొన్నలను చూసి "ఈగొడ్లగింజలు పిన్ననంగా యిక్కడ పోసినవి యెవరికీ కనిపించనేలా ? ఎలుకలూ పందికొక్కులూ యెన్ని తినివేసినయ్యో. అవి యెట్లా తగులబడిపోతే యెవరికేం పట్టింది ? పడిదగ్గర లెక్కకు చాలామంది కనపడ

తారుగాని పవిదగ్గర ఒక్కళ్లూ కనపడరు. అవతలపుల్ల యివతల పెట్టబోతే తేరగా తినేందుకు ఎక్కడనించి వస్తుంది? కోటిలింగా! ఎక్కడ చూశావు. యీగింజలు పీకు కనపడ లేదా" అంటూ నాలుగు విసుర్లు విసిరింది.

దావులో దంతధావనం చేస్తూవున్న అరవింద దుర్గమ్మ అన్న మాటలను విన్నది. అన్నది తననేనని ఆమెకు తెలుసు. "తేరగా తింటున్నది యెవరమ్మా" అని దుర్గమ్మను అడుగుదా మనుకున్నదిగాని ఆమెతో వాగ్వాదానికి దిగే రాహాతు లేకపోవడంవల్ల ఏమీ మాట్లాడకుండా యింట్లోకి వెళ్లిపోయింది. దుర్గమ్మ విసిరిన మాటల తుపానుకు ఆమెలో స్తంభించివున్న దుఃఖ కెరటాలు పొంగి ఆమెను ముంచివేసినవి. కన్నీళ్ళతో ఆమెగుడ్డలన్నీ తడిసిపోయినవి.

అప్పుడు మధ్యాహ్నం రెండుగంటలవుతుంది. జగన్నాధం అరవింద వున్న గదిలోకి వచ్చాడు. భోజనమైనా చెయ్యకుండా అరవింద అప్పటివరకూ ఏడుస్తూనేవున్నది. పుట్టింటికి వచ్చినతర్వాత అరవింద దుఃఖిస్తూవుండగా తండ్రికళ్ల పడటం అదే తొలిసారి. జగన్నాధం ఆదుర్దాతో అన్నాడు: "ఎందుకమ్మా ఏడుస్తున్నావు? ఇక్కడ నీకేమైనా లోటు జరిగిందా? లేక నిన్నెవరైనా యేమైనా అన్నారా? చెప్పమ్మా."

అరవింద దుఃఖాన్ని దిగమింగివేసి "నా కేలాటిలోటూ జరగలేదు నాన్నా. నాదురదృష్టానికి యెవరేమి చేస్తారు" అన్నది.

"భర్తను విడిచిపెట్టి ఏఉత్తమస్త్రీ పుట్టింట సంతోషంగా వుండగలదు" అని జగన్నాధం తన మనస్సులో సమాధాన పరుచుకొని అక్కడనుంచి ఎకాయెకీ భార్యగదిలోకి వెళ్ళాడు. జగన్నాధం వెళ్లేసరికి దుర్గమ్మ తలలో అమర్చుకోవడానికి సన్నజాజుల చెండు కూరుస్తూవున్నది.

"అమ్మాయిపరిస్థితులు చూస్తే నాకు చాలా విచారంగా వున్నది. యిక్కడికి వచ్చాక ఎలా చిక్కిపోయిందో చూశావుకదూ? అన్నీ తెలిసిన పిల్లాయె. భర్తను వదిలి యిక్కడ ఎలా సంతోషంగా వుండగలుగుతుంది? ఆమెను యిక్కడ వుంచితే యిక చేతికివచ్చేటట్టు నాకు కనుపించటం లేదు. వాళ్ళ కళ్ళనీళ్లు తుడిచేటందుకైనా ఏదో కొద్దిఆస్తి ఆమెపేర పెట్టి యిక అత్తవారింటికి పంపివేయదలుచుకున్నాను. చేసే పని నీకు చెప్పి చేద్దామని" అన్నాడు జగన్నాధం.

దుర్గమ్మ ఆమాటలకు తోకతొక్కిన తాచువలె లేచి చేతిలో పూలచెండు విసిరి నేలకు వేసికొట్టి "మీవృద్ధేశాన్ని యింకా మార్చుకోలేదన్నమాట. తెల్లని కాగితంమీద అట్లా నల్లని గీత పడ్డదా యీశరీరం ఏనూతిలోనో గోతిలోనో వుంటుంది. బాగా ఆలోచించుకుని మరీ చెయ్యండి" అన్నది.

ఆదెబ్బతో అతనికి ఎక్కిన తిక్క కాస్తా దిగిపోయి ముచ్చెమటలుపోసినవి.

"అట్లా అశ్లీలాలు పలకబోకు. మగనాలికి అటువంటి సాహసంమాటలు తగవు. చేతిలో పూలచెండు అట్లా నేలకు వేసి కొట్టవచ్చునా?" అంటూ జగన్నాధం నేలమీద వున్న చెండును తీసి పీటమీద వుంచి ఇక గదివెలుపలకు వచ్చివేశాడు. "అరవింద లగ్నకాలమందే కొంత ఆస్తి ఆమెపేర వ్రాసివేసినట్లయితే ఎంత బాగుండేది?" అని తన మనస్సులో అనుకుని చేతులు నలుపుకుంటూ హాల్లోకి వచ్చి నిలబడ్డాడు. ఎదురుగా గోడకు తగిలించివున్న అతని ప్రథమభార్య మహాలక్ష్మమ్మఫొటో కనిపిస్తున్నది. అపటాన్ని చూసేసరికి దొంగతనం చేసినవాడిలాగా అతని గుండెలు గబగబా కొట్టుకున్నవి. "దుర్మార్గుడా! కొత్తపెళ్లాన్ని చేసుకుని కులుకుతూ దానిమాటలు విని నాబిడ్డను అధోగతిపాలు చెయ్యదలుచుకున్నావా?" అని మహాలక్ష్మమ్మ తనను నిలవదీసి అడిగినట్లయింది. జగన్నాధం యిక ఆపటంఎదట నిలబడలేక కదిలి అవతలకు వెళ్లిపొయ్యాడు.

రాత్రి పదిగంటలైంది. అరవింద అప్పటివరకూ పచ్చిగంగైనా ముట్టలేదు. ఏడ్చి ఏడ్చి ఆమెకళ్లు వాచిపోయి వున్నవి. దుర్గమ్మ అన్న మాటలు గుర్తుకువచ్చినప్పుడల్లా ఆమెకడుపులో కత్తులు మెదిలినట్లుగా వున్నది. ఇంట్లో అందరి రాత్రిభోజనాలూ అయినవి. నువ్వు తిన్నావా, తినలేదా అని పొద్దుటినుంచీ ఎవ్వరూ ఆమెను పలకరించినవాళ్ల లేరు. అత్తగారిల్లు చూస్తే అరణ్యం! పుట్టిల్లు చూస్తే ఒక అగ్నిగుండం! ఆమెజీవితప్రభాతం నిరాశామేఘాలచేత ఆవరింపబడి చిమ్మచీకట్లు కమ్మినవి. అంతా అంధకారబంధురం. ఎటు చూసినా ఆమెకు ఆశాకాంతి గోచరించటంలేదు. "అమ్మా, నన్నుగూడా నీతో తీసుకవెళ్లినట్లయితే నా కీకష్టాలు వుండేవి కావుగదా" అని తన తల్లిని తలుచుకుని విలపించింది. చెట్టుమీది పక్షికైనా వున్నదిగాని ఆమె తలదాచుకునేటందుకు స్థానం లేదు. ఒకప్పుడు ఆస్తి అంతటికీ అధికారిణి అనిపించుకుని ఎంతో గారాబంతో పెరిగిన అరవిందకు యీస్థితి పడుతుందని ఎవరనుకున్నారు?

గోడన వున్న గడియారం పొంటిగంట కొట్టింది. మృత్యుదేవత నేను స్థానం యిస్తాను రమ్మని అరవిందను ప్రేమతో ఆహ్వానించింది. అరవింద వెళ్లి వీధితలుపు తెరిచింది.

ఆసమయానికే పై అంతస్తులో నిద్రపోతున్న జగన్నాథం స్వప్నంలో వున్నాడు. తానూ, తన భార్యా హాల్లో కూర్చుని కబుర్లు చెప్పుకుంటూవుండగా మహాలక్ష్మమ్మ యింట్లోకి వచ్చి వాళ్ళముందు నిలబడ్డది. మహాలక్ష్మమ్మ జుట్టు విరియబోసుకుని చేతిలో శూలం పట్టుకునివున్నది. కోపంతో ఆమెకళ్లవెంట అగ్నికణాలు రాలుతున్నవి. ఆమెను చూసే సరికి జగన్నాథం భయంతో వణికిపోతున్నాడు. ఆమూర్తిని చూడగానే తల్లిచంకలో వున్న కుర్రవాడు భేరుమన్నాడు. దుర్గమ్మ గట్టిగా కళ్లుమూసుకున్నది. "నిన్నేమైనా చేస్తుంది. నువ్వు పిల్లవాణ్ణి తీసుకుని ఇంట్లోకి వెళ్లి తలుపువేసుకో"మని భార్యను తొందరపెట్టాడు జగన్నాథం.

"నువ్వు ఇటువంటివాడివనుకోలేదు. నాబిడ్డను నాకు పంపివెయ్యి" అని గర్జించింది మహాలక్ష్మమ్మ. అతనికి ఏమాట చెప్పేటందుకూ నోరురావడంలేదు. గడగడ వణుకుతున్నాడు. మహాలక్ష్మమ్మ ఏకాయకీ ఇంట్లోకి వెళ్లి అరవిందను తీసుకునివెళ్లిపోతూవున్నది. జగన్నాథం తేరుకుని గద్గదకంఠంతో "నువ్వు దెయ్యానివి. అరవిందను తీసుకవెళ్ళవద్దు" అంటూ అడ్డంవెళ్లాడు. మహాలక్ష్మమ్మ పండ్లు పటపట కొరుకుతూ తన చేతిలో వున్న వాడి శూలాన్ని యెత్తింది. జగన్నాథం "అమ్మా" అంటూ నిద్రలోనుంచి త్రుళ్లిపడి లేచాడు.

అదే సమయానికి ఊరివెలపల చెరువులో నిశ్చలంగా నిద్రపోతున్న నీళ్లుగూడా శబ్దం చేసి త్రుళ్లిపడి లేచినవి.




గొప్పతనము

# వరుణగ్రహము చేసిన పెండ్లి



= శ్రీ రాళ్లపల్లి గోపాలకృష్ణమాచార్యులు =

ఈనడుమ నా మిత్రుఁడొకఁడు తనకు పరిచితుఁడగు నొక పెద్దమనుష్యుఁడు వ్రాసిన లేఖను నాకుఁ జూపెను.

“గ్రహచారవశమున నా కుమారునికి పునర్వివాహము చేయవలసిన పరిస్థితి యేర్పడినది. మీ ప్రాంతములో తగిన కన్యక లున్నచో దయయుంచి తెలుపవలెను” అని.

వరుని వయస్సు, విద్యాపరిణతి, ఉద్యోగవివరములు, నివాసస్థానము మున్నగు విషయములే కాక, అతనికి కావలసియున్న కన్యకయం దుండవలసిన లక్షణములు — అనఁగా రూపము, లావణ్యము, వన్నె, వయస్సు, విద్య, సంగీతజ్ఞానము, కార్యనిపుణత మున్నగు గుణముల పరిమితి — సయితము ఆలేఖలో వర్ణింపఁబడినవి.

వరుని వయస్సు పందొమ్మిది సంవత్సరముల పాలప్రాయము. వధువునకో, పాప యింకను పదునైదు సంవత్సరములయినా నిండలేదు. కడచిన సంవత్సరమే— ౧౯౫౩-వ సంవత్సరము జ్యేష్ఠమాసమునందే — వీరికి వివాహమహోత్సవ మతిసంరంభముతో నడచెనని విని యుంటిని. ఇంతలో నా వరునికి పునర్వివాహప్రయత్నము! పునస్సంధానమునకు తగినంత వయఃపరిపాక మున్నదో లేదో యని శంకించవలసిన వయస్సులో పునర్వివాహపు మాట పుట్టుట ఆశ్చర్యకరముగ నుండినది.

“వరుని జాతకము నీయొద్ద నున్నదేమో, ఈ విచిత్రసంఘటన కేమి హేతువో చూతము” అని నా మిత్రుఁ డనెను.

జాతకము నెత్తి చూచితిమి. చలితజాతకము గుణించఁగా, చలితలగ్నము జన్మవరుణునితో నిపుడే (౧౯౫౫) కేంద్రస్థితికి వచ్చియుండుట స్పష్టముగా కానవచ్చినది. అనఁగా వరుణమహాశయునికి కేంద్రస్థితికి చలితలగ్నము రానున్న కాలమున కలిగిన వివాహమిది. ఇట్టి వరుణగ్రహక్రూరదశాకాలములో నేర్పడిన యెట్టి బాంధవ్యమైనను చిరస్థాయిగా నిలుచుట దుర్ఘటమని పాశ్చాత్యజ్యోతిషశాస్త్రజ్ఞులు చాటిచెప్పుచున్నారు. ఎంత ప్రబలముగా వ్యక్తులు పరస్పరముగ నాకర్షింతురో, అంత ప్రబలముగా కొంతకాలమునకే వారు బంధములు త్రెంచివేయఁజూచుట యాదృశాలక్షణము. వరుణగ్రహసామ్రాజ్యమున ఆవాహనమునకును, ఉద్వాసనమునకును సమానప్రతిపత్తి గలదు.

ఏగ్రహమునుండి దుష్టఫలము దశాపద్ధతి సూచించుచున్నదో, ఆదశాపరిపాకపు కాలమున మనలతో రసించు వ్యక్తు లెవరు? ఎవరి జాతకములలో నాగ్రహముల దౌష్ట్యప్రాబల్య మున్నదో వారే! సమానధర్మము గల వ్యక్తు లొకచోట చేరుట సామాన్యధర్మము.

“నెయ్యమునకు, కయ్యమునకు,
వియ్యమునకు వలయు సమత”

కదా! సారాంశమేమన, వరుణగ్రహదౌష్ట్యము రానున్న కాలమున వివాహప్రయత్నము జరిగెనేని, వరుణగ్రహదుష్టఫలము జాతకమునఁ గల కన్యయో, వరుఁడో మన దృష్టిపథమునఁ దగులుదురు కాని, ఇతరులు మన వంకకైన తిరిగిచూడరు. పిలువని పేరంటమున కెవరు వత్తురు? వేఱుస్థలములలో నెన్ని ప్రయత్నములు చేసినా, ఫలించుట దుస్సాధ్యము.

“కన్యక జాతకమును, వివాహముహూర్తపు కుండలిని తెప్పించుము. వరుణగ్రహవేధ గలవా రిరువురు లనియు, వీరిని ముడివైచిన పురోహితుఁడు సాక్షాత్తుగ వరుణుఁడే యనియు అతిసులభముగ గోచరించును.” అంటిని.

ఈవిధమయిన పరిశోధనములలో మిగుల నుత్సాహశాలియగు నామిత్రుఁడు కొన్ని దినములలో నెల్లో ప్రయాసపడి, ఎవరెవరికో జాబులు వ్రాసి, ప్రశంసలో నున్న కన్యక జాతకమును, వివాహముహూర్తపు కుండలిని తెప్పించుకోఁగలిగెను. ఈకన్యావరుల నిరయన రాశి చక్రము లివి:—

| | | | |
|---|---|---|---|
| | రా | గు | |
| | కన్యక | | |
| | | | ల, శు |
| శ | | చ, కు, కే | ర, బు |

| | | | |
|---|---|---|---|
| కు | | | |
| | వరుఁడు | | రా |
| కే ర | | | |
| గు, శు, బు | ల | శ | చ |

కన్యకనక్షత్రము స్వాతి; వరనక్షత్రము ఉత్తరాఫల్గుని (నాల్గవ పాదము). కూటములలో వీరికి ౨౫ గుణములు రాఁగలవు. నూటికి ౭౧ వంతున గుణములు పొంతనములలో వీరు సంపాదించినారు. ఇది వేఱుకథ.

సప్తమభావమును విచారింతము. కన్యక జాతకమున భర్తృస్థానము పాపాక్రాంతముకాదు. భర్తృస్థానాధిపతి యగు శని శుభక్షేత్రమగు ధనుస్సులో పంచమకోణమునం దున్నాఁడు. శని పంచమస్థానస్థితికి—

"సుఖసుతమిత్రవిహీనం
మతిరహిత మచేతసం త్రికోణస్థః,
సోన్మాదం రవితనయః
కరోతి పురుషం సదా దీనం."

అని 'సారావళి' దుష్టఫలమునే చెప్పినది. కాని, ధనుస్సులోని శని అంత దుష్టుఁ డనరాదు. కాక, సప్తమస్థానాధిపతికి పంచమకోణస్థితి మంచిఫలమునే యీయవలసియుండునుగదా ?

"సుఖై స్సర్వై ర్యుతో మానీ
భవే త్సర్వజనాధిపః,
సదైవ హర్షసంయుక్తః
సప్తమేశే సుతే స్థితే."(బృహత్పరాశరహోర)

శనికి సప్తమస్థానముపైఁ గల మూఁడింటి దృష్టికి దుష్ఫలము నంటఁగట్టుదురేమో ? కాని, భావాధిపతికి భావముపైఁగల దృష్టిచే భావము బాగుపడు ననుట విశేషవిధిగదా ? కుటుంబాధిపతి బుధుఁడు, కుటుంబమునందే యుండుటచే కుటుంబస్థానము బాగుపడినదనియే చెప్పవలయును. ఇఁక, చంద్రకుజసంయోగ ముండుటచే కుజదోషమున్న దందురేమో !

"అర్కేందుక్షేత్రజాతానాం
కుజదోషో న విద్యతే"

అను సూత్రముచే సింహాలగ్నజాతులకు కుజదోషపు భయము లేదు. మొత్తముమీఁద, దాంపత్య జీవితమునకు గొప్ప దోష మున్నదని సూచించు ప్రబల దుర్యోగము లున్నవని చెప్పఁజాలము.

వరుని సప్తమభావము జూడుఁడు ! ఆభావములో పాపగ్రహ మేదియు లేదు. పాపగ్రహదృష్టియును కానరాదు. సప్తమాధిపతి శుక్రుఁడు కుటుంబస్థానములో–ధనుస్సులో–బృహస్పతి సహవాసముతో నున్నాఁడు. దీనికి మంచిఫలమునే చెప్పవలయును గదా ? అష్టమాధిపతి యగు బుధుని సంయోగముచే నీశుక్రుఁడు కొంత చెడినాఁడనవచ్చును. అగుటచే మిశ్రఫలము కుటుంబస్థానమునకు రానిండు. ఉచ్చగ్ర

హమై, కేంద్రకోణాధిపతియగుటచే యోగకారకుఁడైన శనిదృష్టి ధనుర్గతశుక్రునికి గుణముగనే పరిణమించును.

"నిత్యంచ ధనప్రాయం
సుఖినం భోగాన్వితం ధనసమృద్ధం,
గురుభవనే శనిదృష్టః
కురుతే శుక్రో నరం సుభగం." (సారావళి)

ఇఁక, చంద్రునినుండి సప్తమస్థానమున కుజుఁ డుండుటచే కుజదోష మున్న దనవచ్చునేమో ? కాని దీనికిసయితే మపవాదమాత్ర మున్నది.

"మేషవృశ్చికజాతానాం
కుజదోషో నవిద్యతే" అని.

ఇదికాక, కన్యావరు లిరువురికిని కుజదోష మున్నచో భయము లేదను సంప్రదాయ మొకటి యుండనేయున్న దిగదా ?

చెప్పవచ్చిన దేమనఁగా, 'మామూలు'గా వాడుకలో నున్న మార్గమున నీజాతకములను పరిశీలించినచో, వివాహమైన యచిరకాలమందే వరునికి పునర్వివాహావశ్యకతను సూచించుట కవకాశ మున్నదనుట సాహసకార్య మగును. మఱి, స్పష్టగ్రహభావములను గుణించి ఇంద్రావరుణగ్రహములనుగూడ కుండలులలోఁ జొప్పించి చూతముకాక.

| | | | |
|---|---|---|---|
| | వరుణ ౯-౧౯ | రా ౧౩-౩౮ | X ౧-౦<br>శు ౧౬-౨౬<br>(వ) |
| | కన్యా జాతకము<br>—<br>(సాయనము)<br>అయనాంశలు = ౨౨-౫౦ | | |
| | | | |
| శ ౨౮-౫౯ | చ ౫-౧౭<br>కే ౧౩-౧౮ | ర ౧౧-౧౧<br>బు ౧౭-౧౭(వ)<br>కు ౨౭-౫౮ | I ౧-౦<br>ఇ ౨-౩౩<br>గు ౧౧-౧౨ |

దిగువ నున్నవి యీవధూవరుల స్పష్టసాయన జాతకచక్రములు.

వధువు జనించుట కన్యాలగ్నములో. అందుండువారు సుకుమారులగు ఇంద్రశుక్రులు. ఇంద్రుఁడు లగ్నమం దున్నచో, ముగ్ధమధురమగు లావణ్యము, కన్నులను భ్రమింపఁజేయు నంగసౌష్ఠవము, ముఖమునకు వన్నెదెచ్చు నేత్రవికాసము కలుగునఁట! లగ్నమందున్న శుక్రుఁడు సౌందర్యమునకు పెట్టినపేరు గదా?

"సునయనవదనశరీరం
సుఖినం దీర్ఘాయుషం తథా ధీరం
యువతిజననయనకాంతం
జనయతి హోరాగత శ్శుక్రః" (సారావళి)

లగ్నమం దున్న నీగ్రహద్వయసంయోగము జాతకురాలి దేహలత కంటెన కందు సౌకుమార్యము నీయఁజాలినది. దశమకేంద్రమం దున్న బృహస్పతి తల్లిదండ్రుల యాభిజాత్యమునేకాక, జాతకురాలు తెలివికలదనియు, భాగ్యవంతురాలు కాఁగలదనియు చాటుచున్నది. రెండింటి బుధునికి ,మూఁడింటికుజునికి మంచిఫలమే కలదు. తృతీయస్థానములో నున్న చంద్రునిపై శుక్రేంద్రులకుఁ గల యర్ధకోణమిత్రదృష్టి నవనీతకోమలమగు హృదయమును సూచించును.

సాయనముగఁ జూచినా సప్తమస్థానము చెడినదనుటకు వీలులేదు. ఆ స్థానాధిపతియగు గురువు దశమ

| | | | |
|---|---|---|---|
| వరుణ ౧౭-౪౦ | శు ౧౪-౩౩ | | |
| కే ౧౮-౪౯ | వర జాతకము<br>—<br>(సాయనము)<br>అయనాంశలు = ౨౨-౪౭ | | |
| ర ౨౬-౧౫<br>గు ౬-౪౫<br>కు ౨-౪౬<br>బు ౨-౧౮ | | | రా ౧౮-౪౯<br>ఇ ౨౧-౫౨<br>(వ) |
| I ౧-౦ | శ ౧౩-౧౧ | చ ౨-౪౨ | X ౩-౦ |

కేంద్రమున రాజ్యమేలుచున్నాఁడు. ఇతరదోషములు సయితము కానరావు. గురుబుధుల పరస్పరకోణదృష్టి జాతకురాలు వివేకవతి యనియే సూచించుచున్నది.

సరేకాని, వరుణగ్రహ మెందున్నదో చూడుఁడు! కుటుంబస్థానమం దున్న నీచరవితో సరిగా సమసప్తమస్థానమున నిలిచి శత్రువై వరుణుఁడు యుద్ధము చేయుచున్నాఁడు. అతిరథమహారథులు వీరు. వీరులు పరస్పరాభిముఖులై నిలిచి హోరాహోరిగ పోరుచున్నచోట పాశుపతాస్త్రమునకో, బ్రహ్మాస్త్రమునకో పనియుండునేమో కాని, పచ్చతోరణములు, పసుపువస్త్రములు నేమిపనికివచ్చును? అపరిమితస్వాతంత్ర్యప్రీతి, అత్యంతభావశబలత, అవిశ్వసనీయచిత్తవృత్తి, నిరంకుశాధికారకాంక్ష, పరచిత్తానువర్తనాసహిష్ణుత, సాహసకార్యకరణధురీణత, వ్యధికరణస్వభావము మున్నగు గుణముల నీయోగ మీయఁగలదు. కాననే, సర్వసామాన్యపద్ధతిలో దాంపత్యధర్మము నిర్వహింపఁ గోరువారల కిది తగని యోగమని పాశ్చాత్యదైవజ్ఞు లుద్ఘోషించుట!

ఈజాతకమున నొక విచిత్రగుణ సమ్మేళన మున్నది. శిరీషకుసుమకోమలమగు సుకుమారదేహము, నవనీతముఁబోలు ముగ్ధహృదయము, లావణ్యముతోడి లలితకళారసికత, నిరంకుశత నాశించు చిత్తవృత్తి, తీవ్రభావోద్రేకము ననుసరించు స్థైర్యము—ఇట్టి గుణవిశేషము లొకచోట చేరినపుడు, అట్టి వ్యక్తుల హృదయములకే,

"వజ్రాదపి కఠోరాణి,
మృదూని కుసుమాదపి"

అను మనోహరవర్ణనము చెల్లును. అది యట్లుండె.

వరుని జాతకమున సాయనముగాఁ జూచినను సప్తమభావ మంతగా చెడిన దనలేము. కాని, ప్రకృతదశ మంచిది గాదు.

చలితలగ్నము జన్మవరుణునితో కేంద్రస్థితికి ౧౯౪౪-వ సంవత్సరమున వచ్చిన దని కనుగొంటిమి గదా? ౧౯౪౩-వ సంవత్సరమున నీచలితలగ్నము జన్మవరుణుని కేంద్రస్థానము నభిలషించుచుండఁగా నితనికి లభించిన కన్యక యీమె. రవివరుణ సమసప్తక ద్వంద్వయుద్ధము కుటుంబస్థానమునఁ గలది కాననే, ఈమె యీవరుని హృదయము నపు డాకర్షింపఁ గలిగెను. వరుని బుధశుక్రులకు సంపూర్ణత్రికోణమం దున్న ఇంద్రుఁడు (కన్యాజాతకమందు లగ్నమందున్నగ్రహము) మోహవాగుర లొడ్డి బంధించినాఁడు. వివాహానంతరము సంవత్సరకాలము ముగియకమున్నే వరుఁడు రెండవసారి పెండ్లికుమారుఁ డగుటకు సిద్ధపడినాఁడు. పెండ్లికూఁతు రగుటకు కన్య లభించు టొక్కటే కొదవ!

పోనిండు. ప్రశంసలో నున్న వధూవరులకుఁ గల పరస్పరాకర్షణ మెంత వైరదృష్టిబద్ధమో పరిశీలింపుఁడు—

(౧) వరుని చంద్రునితో కన్యకవరుణుఁడు సమసప్తకము:— ప్రమాదకరమగు తాత్కాలికబంధమునకు లోనై యాకస్మికముగా కలుసుకొని యవశ్యముగా విడిపడవలసిన కాముకీకాముకుల కుండఁదగిన యోగ మిది.

(౨) వరుని రవితో కన్యకకుజుఁడు పూర్ణకేంద్రము:—ద్వంద్వయుద్ధమునకు రణరంగమునకుఁ బోవు యోధుల కుండఁదగిన గ్రహసామగ్రి యిది.

(౩) వరుని శనికి కన్యకచంద్రుని సంయోగము:—హృదయకమలముపై శని కధికార మిచ్చినచో వికసన మెట్లు వచ్చును?

(౪) వరుని వరుణుఁడు కన్యగురువునకు కేంద్రము:—సప్తమాధిపతియగు గురువునకు వరుణుని నుండి యపకర్షణమంత్రప్రయోగ మిది.

(౫) వరుని కుజుఁడు కన్యకబుధునితో పూర్ణసమసప్తకము:—వాగ్వాదమునకో, వ్యవహారమునకో దిగువారి కుండవలసిన గుణ మిది.

ఎట్టి యోగము లొక్కచోట చేరినవి! ఒక్కొక్కటియు "ఏకైక మ ప్యనర్థాయ" అను కీర్తికి తగినవే!

ప్రకృత మనుసరింతము. వింశోత్తరీ దశాపద్ధతిలో చలితశుక్రుఁడు జన్మరవిసంయోగ మందినచో, ఆసంవత్సరమున యుక్తవయస్సులో నున్న యవివాహితులకు తప్పక వివాహమంగళము జరుగుట సామాన్యానుభవములోనిది. ౧౯౪౩-వ సంవత్సరమున వరుని జాతకమున నిట్టి దశ వచ్చినది. శుక్రుఁడు చలనవశమున మకరరాశి ౨౬-వ భాగ చేరఁగల్గుటచే, జన్మరవిసంయోగము వాని కపు డబ్బినది. వివాహోచితవయస్సులో నున్నవాఁడు కాన, వరుని కపుడు వధువు కావలసిన యవసరము వచ్చినది. అదే సంవత్సరమందే చలితకుజుఁడు వృషభరాశిని ప్రవేశించి జన్మశుక్రునితో త్రికోణమిత్రదృష్టికి త్వరలో రానున్నాఁడు. ఈదశ వచ్చినపుడు గృహస్థాశ్రమము వచ్చినను రాకున్నను, బ్రహ్మచర్యాశ్రమధర్మమును నిలుపుకొనఁగలుగుట మాత్రము సామాన్యులకు సాధ్యముకాని పని. దీని కథ యిట్లుండ, ఇతరులతోడ సంబంధబాంధవ్యము లేమియు చేయరా దిపుడని చలితలగ్నమునకు కేంద్రమందున్న జన్మవరుణుఁడు ఢంకాకొట్టి చాటుచున్నాఁడు. కాని, వరుణుని హెచ్చరికల వినువా రెవరున్నారు? కంటికా కానరాఁడు; పంచాంగములకా ఎక్కలేదు; దైవజ్ఞులా నిరాదరించిరి. ఇట్టి పరిస్థితులలో వివాహము జరుగకుండ నెట్లుండఁగలదు?

కన్యక జాతకమున వరుణుని తీవ్రవేధకు లోనయిన రవి క్రమక్రమముగ చలించి ౧౯౪౩-వ సంవత్సరమున తులారాశిలో ౨౬-వ భాగ చేరుకొన్నాఁడు. అనఁగా, వరుని జాతకమున "పెండ్లి, పెండ్లి"యని యుఱ్ఱూతలూగుచున్న చలితశుక్రజన్మరవిసంయోగమునకు (మకరరాశి ౨౬-వ భాగకు) సరిగా సప్తశత్రుదృష్టికి కన్యకచలితరవి వచ్చినాఁడనుట! రోగి కోరినదే వైద్యుఁడు పథ్యముగా విధించిన ట్లయినది. ౧౯౪౪-వ సంవత్సరమునందే కన్యక చలితబుధుఁడు (లగ్నాధిపతి) జన్మవరుణునికి ౧౮౦ భాగలకు (సమసప్తకమునకు) వచ్చెను. ఫలము ప్రత్యక్షమైనది.

ఇట్టి వివాహమహోత్సవము జరిగిన శుభముహూర్త మెట్టిదో, ఇంచుక పరీక్షింతముగాక. ఆ వివాహముహూర్తపు కుండలి యీక్రింద నున్నది:—

| | | | |
|---|---|---|---|
| | X ౧౦<br>కు ౧౨-౧౪ | బు ౨౯-౨౪ | వరుణ ౫-౪౦<br>శ ౧౬-౪౩<br>ర ౨౧-౧౩ |
| కే ౧౮-౫౨ | వివాహలగ్నకుండలి | | I ౧౪<br>గు ౨౬-౨౦ |
| | (సాయనము) | | శు ౫-౫౪<br>రా ౧౮-౫౨ |
| | | చ ౧౪-౨౪ | ఇ ౨౯-౧౪ |

ప్రథమగ్రాసమందే మక్షికాపాత మనురీతి—అశనిపాతమన్నను తప్పుకాదు—వరునికి సప్తమభావములో, వధువునకు దశమభావములో, చారవశమున వరుణగ్రహ మున్న దినములలో వారికి వివాహము జరుగుట! వివాహకాలమున దశమకేంద్రమున నున్నవాఁడో కుజుఁడు. వీని దోషము—

"శని రనియమశౌచాం
కన్యకామన్యకార్యై
ర్వ్యధు రతివిధురాంగీం
శాకినీం వ్యోమ్ని వక్రః
రచయతి రవి రుగ్రాం
కోవిదః కార్మణజ్ఞాం
అవికృతిసుకృత శ్రీ
మాలినీ మార్యశుక్రః"

(వివాహబృందావనము)

అను వాక్యము విపులముగ వర్ణించుచున్నది. ఈ వధువునకు త్వరలో రానున్నది చలితరవిజన్మకుజసంయోగము. వరుని జన్మరవితో శత్రుదృష్టిలో నున్నవాఁ డీమెజన్మకుజుఁడు. కానసే ఈవివాహమున కుజుఁ డుద్యోగస్థాన మాక్రమించి కార్యదర్శి యధికారమును వహించియుండుట. నాల్గింటి చంద్రునికి బంధువిద్వేషము ఫలముగా నిరూపింపఁబడినది. ఇంత చాలక, కుజునితో సరిగా సమసప్తకస్థితి ఈచంద్రున

కుండుట మిగుల శోచనీయమగు దుష్టయోగము. ఇతర గుణము లెన్ని యుండినను, దీని దుష్ఫలము తప్ప దందురు.

"హిమరశ్మిసవాంశకా త్థలో
యది ఖేట శ్శగసాయకాంశకే
అయ మన్యగుణై ర్న హన్యతే
నిబిడైర ప్యపపర్గడంబరః"
(వివాహబృందావనము)

కుజుఁ డగ్నిగోళము; చంద్రుఁడు జలమయుఁడు. వీరికి ఘర్షణ వచ్చినచో, అగ్నియైన చల్లార వలయు, నీరైన నింకిపోవలయును. లేదా ఈరెండు గ్రహములును బలవంతము లయినచోట అపారమయిన అవిరిరాశు లుదయించి ఆకసముదాఁక రొగయవలయు. ప్రతిబంధక మేదయినఁ గలిగెనేని ఈయావిరి దాని శక్తి పైకెగుర వేయఁగలదు. సమర్థుఁడగు శాస్త్రజ్ఞుఁ డుండి దానిని పట్టి తగిన పరిస్థితులలో నుంపఁజాలెనేని, దానితో నసాధ్యకార్యములనేని చేయింపఁగలఁ డనుమాట సత్యమే. కాని దాంపత్యధర్మమున నిట్టి యావిరిభూత ముదయించెనేని దానిని పట్టి రచ్చకీడ్చి బంధించి సద్వినియోగపరుపఁజాలిన మహనీయుఁడు సామాన్యముగ నెందు లభించును?

వివాహలగ్నమునకు దాపురమైన చంద్రమంగళ యోగ మిట్టిది. కాని మాహూర్తికు లున్నంతలో మేలుకొని, గ్రుడ్డిలో మెల్లయని, లగ్నమందు బృహస్పతి నుంచి లగ్నకాలము నేర్పరచిరి. అనాఁడు బృహస్పతి కటకరాశిలో ౨౭ భాగలో నున్నాఁడు. ఆభాగనే లగ్నముగా నేర్పరచి ఉదయము ౯-౫౪ A. M. నకు ముహూర్తము నిర్ణయించినారు. కాని "పురోహితుల బుద్ధిమాంద్యముచే ౯-౧౫ A.M. వేళకే కన్యాదానము జరిగె"నఁట! ముట్టవలసిన దక్షిణలు పురోహితులకు మునుముందుగనే ముట్టియుండనోపు! కాని, ఇచట నా కొక సందేహము. సకాలమున కన్యాదానము జరుగవలె నను శ్రద్ధాభక్తు లుండవలసినవా రెవరు? తాత్కాలిక దక్షిణలకు చేతులు చాఁచవలసియున్న పురోహితులా, భావి శుభములను మాటకట్టుకొన నున్నవ్వెళ్లూరు పెండ్లిపెద్దలా?

"యదా గ్రహాణాం వైషమ్యం
సర్వారంభం పరిత్యజేత్,
కార్యవిఘ్నకరా హ్యేతే
కృతమ ప్యత్ర నశ్యతి."

అని శాస్త్రము మొఱపెట్టుచుండఁగా, దుష్కాలమున వివాహము నిర్ణయించి పురోహితులను నిందించు టేమి నీతి? కర్తలయొక్క కర్మశ్రద్ధ ననుసరించి గదా పురోహితుల క్రియాశ్రద్ధ? లగ్నకాలమువిషయమున మనవారు—అందులో ఇప్పటి నవనాగరక శిరోమణులు – చూపుచున్న నిరాదరము చూచి భరింపరానిది. పోనిండు. ఇది యొక యరణ్యరోదనము!

ఇచట నొక విశేష మున్నది. బుద్ధిమాంద్య మెవరిదైన నగుఁగాక. లగ్నకాలము ౨౪ నిమిషములు వెనుక కేల పోయినదో గమనించుట మనకు చాల ప్రయోజనకారి. వరుణమహాశయుని యాధ్వర్యమున నీ వివాహము జరిగియుండు నని మునుముందుగనే యూహించి యుంటిమి గదా? చూడుఁడు. నలువదిరెండు నిమిషముల కాలము వెనుకకు పోయినచో లగ్నము కటకరాశిలో మాహూర్తికులు నిర్ణయించిన ౨౭ భాగకు బదులుగా ౧౪-వ భాగ యుదయించును. అనఁగా, కటకరాశిలో ౧౪-వ భాగ పూర్వదిగ్భాగమున నుదయించుచుండఁగా కన్యాప్రదానము జరిగియుండును. కన్యక జాతకమున బుధుఁడు, వరుని జాతకమున కుజుఁడు—వీరిరువురికిని సరిగా చెరి ౯౦ భాగల దూరమందు వివాహలగ్న మాత్రమందుమాత్రమే యుండఁగలదు. కాక, వివాహకాలపు దశమకేంద్ర మానిమిషమందే మేషరాశిలో ౧౦-వ భాగలో నుండును. అనఁగా, కన్యజాతకపు రవికి నికరముగా సమసప్తకములో నున్న వరుణగ్రహము మీఁదనే యన్నమాట! ఈవివాహము నేగ్రహము నిర్వహించెనో, పాఠకమహాశయుల కిపుడు వేఱుగ విన్నవించుట యనవసరము. లగ్నమం దుండవలసిన బృహస్పతి నాశేల యీ లేనిపోని గొడవ యని చల్లగ జారుకొని దూరమున గుటకలు మ్రింగుచున్నాఁడు. ఇది పురోహితుల బుద్ధిమాంద్యమా, వరుణగ్రహ ప్రభావవిశేషమా?

దుర్దశాపరిపాకసమయమున శుభకార్యములు తలపెట్టినచో దుష్టలగ్నములే దాపరించు నని ప్రాచీన మహర్షులు చెప్పిరి.

"వరణప్రదానపరిణయ
శచీప్రపూజాభిషేకకరణాని,
సుశుభే తిథౌ ముహూర్తే
న భవంతి కిలాల్పపుణ్యానాం."

అను శౌనకవాక్యమును గమనింపుఁడు, ఈకథ కెంత బాగుగా నన్వయించుచున్నదో ?

ఇట్టి దుర్దశాపరిపాకకాలమున, ఇట్టి దుష్టగ్రహవైరదృష్టివలని యాకర్షణఫలితముగ, ఇట్టి దుర్ముహూర్తక్షణములో జరిగిన కన్యాప్రదాన మెంత శోభాయమానముగ రాణించవచ్చునో, అట్టి సూచనలే కానవచ్చుచున్నవి. మఱి, విత్తొకటైన చెట్టొకటి మొలచునా? వివాహానంతర మేమి నడచినదో, వరుని పునర్వివాహప్రయత్నమునకు హేతు వేమో మన మెఱుంగము. అనవసరముకూడ.

"ఆమె (వధువు) తల్లిదండ్రులకు ఆమెను భర్త యొద్దకు పంపుట కిష్టము లేదు. ఆమెకూ అంతే." అని వరుని తండ్రి తలంచుచున్నాఁడు. వాస్తవముగ నిట్టి యాదర్శమే యున్నచో, తల్లిదండ్రులు కన్యకకు వివాహ మేల సాగించి వ్యయప్రయాస లనుభవింతురు? ఆలుమగ లొకటైన సూచనలుసయితము కానరావు. ఇంతలోనే యేముసలము పుట్టినదో? "అత్తవారింటిలో నేమి జరిగినదోకాని, మావానికి (వరునికి) వారిపేరు కూడ విననిష్టములేదు" అను నమ్మకము వరుని తండ్రికి వచ్చుట శోచనీయము. అతని వర్ణనలో నీవివాహమంతా ఒక "గందరగోళము." మార్యకుటుంబములో నిది యొక క్రొత్తరకపు గోళము కాఁబోలు! ఉపద్రష్టలుగా నెవరయిన పెద్ద లుండినచో నీవివాహమునే జరుగనిచ్చియుండరని యతని వాదము! అంతటి పుణ్యమా? వివాహానంతరము వరజనకుఁడు జరిపిన నయవినయములకు తిరస్కారము, తృణీకారము ఫల మయ్యెనఁట! వింతయేమన, కొన్నాళ్లతరువాత అతఁడే వియ్యాల వారి యింటికి పోఁగా, అతని కచట "సారమేయ మర్యాద" జరిగినదఁట! ఔరా! ఏమి లగ్న ప్రభావ మిది? చంద్రమంగళయోగముతో చేరిన వరుణుని దెబ్బ యెంతపని చేసినది?

ఏదో తాత్కాలికమయిన భావోద్రేకము వలనో, స్వప్రతిష్ఠా స్వాభిమానముల మూలముననో, అసంప్రేక్ష్యకారిత్వము ఫలముగనో—అకారణముగ కాని, కించిత్కారణముగ కాని— రెండు పక్షముల వారికిని వైమనస్యము కలిగియుండనోపు ననుకొనవచ్చును. వధూవరు లిరువురును ప్రపంచానుభవము చాలని చిఱుతప్రాయమువారేకాన, అంతకన్న ప్రబల హేతు వుండఁబోదనుకొనుట ధర్మము. గోరంతలోపము కొండంతగ కానవచ్చుటయు, ప్రతి వాక్యమునకు, ప్రతికార్యమునకు, ప్రత్యభిప్రాయమునకు భిన్నార్థము నారోపించుచు స్పర్థకు దోహద మిచ్చుటయు ఇట్టి పరిస్థితులలో నుభయపక్షములయందును సహజము.

"సరసము విరసంబైనను
విరసములే తోఁచుచుండు వినరా సుమతీ."
యనుట మరువరాదు.

ఒక్కమాట! దుష్టదశాకాలము గడచుదాఁక— రెండుమూఁడు సంవత్సరముల కాలము— నెమ్మదితో నోపికపట్టియుందురేని, ఈవధూవరులు మంచిదంపతులుగా వర్ధిల్లఁగలరనుట నిస్సంశయము. తుఫానులో మునఁగని తెప్ప తరువాత గట్టుచేరుట కష్టము కాదు. కాని, ఉడుకారని యౌవనోద్రేకము వరునికి, అమాయకతతోడి మౌగ్ధ్యము వధువునకు, స్వాభిమానావేశము వలని స్పర్థ వారి పెద్దలకు సామాన్యముగ నుండునని యూహించుట కవకాశమున్న యీ కథలో, మంచి కాలము వచ్చుదాఁక నోపికపట్టి కాచుకొని యుండఁగల మనస్తత్త్వము వారికిఁగాని, వీరికిఁగాని రాఁగలదా యను ప్రశ్నకు ప్రత్యుత్తర మిచ్చుట చాల కష్టము. రానిమ్మని సర్వదయామయుఁడగు భగవంతుని ప్రార్థింతము గాక !

---

# భా వ పూ జ

— శ్రీ సుందరాచారి —



బ్రతుకుల బాటలో బరువు బండల నావల పార ద్రోసి, నా
గతులను సాగనిచ్చితిని గర్వముతో - గుడి చేరునంతలో
పతిసుతులాదిగా గలుగు సాగర మధ్యగ దోచి, ఖిన్నుడై
గతిచెడి నిల్చినాను కలకాలము కాళులు సేతు లాడకే.

కాలము మించె పూజలకు కావలె! గంటలు మ్రోగుచుండె నీ
దేవాలయ ప్రాంగణమ్ములను; హారతి వెల్గుల ధూపధూమ ము
ద్యోలల నూగుచుండె; శ్రుతు లంది చెలంగెను వేదఘోష; రా
జాలుదు నెట్టు లీచరమ సంధ్యలలో కనుమూయుపాటులో.

తావకదివ్యగోపురము దవ్వుల గానగనయ్యెగాని, న
న్నావలిగట్టు చేర్చగల నావికు డెవ్వడు కానరాడు; ఈ
పూవులు రేకు లూడి పడిపోవుచునున్నవి; నారపోగులో
తావి మిగిల్చినాను - పరితాపములో పడి దూరెనద్దియున్.

నిలిచిన చోటనే నిలిచి నిశ్చలతన్ కనుమూసిమూసి, నీ
నిలువును శూన్యపీఠమున నిచ్చలు తీర్చిన తీరుతెన్నులో
నిలిపి మనఃప్రసూనముల నిండగు దోసిలికెత్తి కొల్వగా
గలిగిన దొక్క-టే తెరవుగా గనిపించెడు నాకు నీశ్వరా!



# చెన్నరాజధానిలో చెరుకు-చక్కెర పరిశ్రమ



= శ్రీ మోచెర్ల లక్ష్మీకాంతం =

పంచదార నిచ్చే పంటల్లో చెరుకు, బీటుదుంపలు ముఖ్యమైనవి. ప్రపంచంలో ప్రతియేటా తయారయ్యే సుమారు రెండుకోట్లఎనుబదిలక్షల టన్నుల పంచదారలో చెరుకునుంచి ౧౮౦ లక్షలు, బీటు దుంపనుంచి మిగతా కోటిటన్నులు రాబడుతారు. సర్వసాధారణంగా సాగులో నున్న పంట లన్నిటిలో ముప్పాతిక మూడు పాళ్లు తూర్పుఆసియాఖండంలో ఉద్భవించాయని ప్రతీతి. అందులో చెరుకుమాతృ స్థానం మన హిందూదేశమని చాలామంది అభిప్రాయం.

హిందూదేశంలోను, మనరాష్ట్రంలోను చెరుకు తోటల విస్తీర్ణం, చెరుకుపంట ప్రాముఖ్యత, యకరానికి వచ్చు సగటుదిగుబడి, ఇతరదేశాల్లో యకరానికి వచ్చు ఆదాయం ఎక్కువగా ఉండటానికి గల కారణాలూ వ్రాసి, మన రాష్ట్రంలో ప్రజలకు సరిపడే బెల్లం, పంచదారలు ఉత్పత్తిచేయటం లేదనీ, ముఖ్యంగా ఈ అధికాహారోత్పత్తి ఉద్యమసమయంలో పట్టుదలతో పనిచేసి ఈ రాజధానిని స్వయంపోషకంగా చేసే అవసరము, బాధ్యత మనమీద వుందనీ సూచిస్తా

౧-వ పట్టిక *

| దేశములు | | సంవత్సరములు ౧౯౩౬-౩౭ | ౧౯౩౭-౩౮ | ౧౯౩౮-౩౯ | ౧౯౩౯-౪౦ |
|---|---|---|---|---|---|
| | | (విస్తీర్ణం వేల యకరాల్లో) | | | |
| ఇండియా | ... | ౪,౪౩౮ | ౪,౦౪౩ | ౩,౨౮౧ | ౩,౭౮౮ |
| జావా | ... | ౨౪౨ | | | |
| ఫిలిప్పైను దీవులు | ... | ౬౩౫ | | | |
| ఫార్మోసా | ... | ౨౫౯ | | | |
| జపాన్ | ... | ౪౯ | | | |
| మరీషియస్ | ... | ౧౪౩ | | | |
| దక్షిణ ఆఫ్రికా | ... | ౧౭౮ | | | |
| అమెరికా సంయుక్తరాష్ట్రాలు | ... | ౨౪౭ | | | |
| క్యూబా | ... | ౧౨౬౭ ** | | | |
| పోర్టోరికో | ... | ౩౦౧ | | | |
| బ్రిటిష్ పశ్చిమయిండియా దీవులు | ... | ౧౮౮ | | | |
| డామినికన్ రిపబ్లిక్ | ... | ... | | | |
| బ్రేజిల్ | ... | ౧౧౩౭ | | | |
| బ్రిటిష్ గినీ | ... | ౬౪ | | | |
| పెరూ | ... | ౮౦ | | | |
| ఆస్ట్రేలియా | ... | ౨౫౭ | | | |
| హవాయి ద్వీపములు | ... | ౧౨౧ | | | |
| | | ౧౧,౮౩౬ | | | |

* **Report on the Marketing of Sugar in India and Burma** నుంచి.

** 1931-32 మొదలు 1935-36 వరకు సంవత్సరములకు సగటువిస్తీర్ణం.

దానికి అవలంబించవలసిన మార్గాలను తోచినంతవరకు ఇక్కడ పొందుపరుద్దా మన్న ఉద్దేశ్యంతో ఈ వ్యాసం వ్రాయటానికి సంకల్పించాను.

ప్రపంచంలో ఏటేటా నూరు, నూటయిరువది లక్షల యకరాల్లో చెరుకుపంట పండిస్తారు. అందులో సుమారు మూడోవంతు మన దేశంలో వుంది. వివరాలు ౧-వ పట్టికలోని అంకెలలో కనబడు తాయి.

సాధారణంగా చెరుకుకు అనువైన శీతోష్ణస్థితి దక్షిణహిందూస్థానంలో ఉంది. అయితే నూటికి ఎనుబదిపాళ్లు చెరుకుపంట ఉత్తరహిందూస్థానంలో అగుపడుతుంది. ౨-వ పట్టికలో ఉదాహరించిన రాష్ట్రవారీలెఖ్ఖలు ఈ విషయాన్ని స్పష్టపరుస్తాయి.

౨-వ పట్టిక *

| చెరుకుపండించే ముఖ్యమైన రాష్ట్రాలు, సంస్థానాలు | | విస్తీర్ణం యకరాల్లో (౧౯౩౯-౪౦) | విస్తీర్ణం యకరాల్లో (౧౯౪౧-౪౨) | మొత్తం విస్తీర్ణంలో నూటికివంతు (౧౯౩౯-౪౦) | మొత్తం విస్తీర్ణంలో నూటికివంతు (౧౯౪౧-౪౨) |
|---|---|---|---|---|---|
| సంయుక్తరాష్ట్రాలు | ... | ౨,౧౨౦,౦౦౦ | ౧,౭౪౫,౦౦౦ | ౫౨.౦ | ౫౨.౯ |
| పంజాబు | ... | ౫౩౪,౦౦౦ | ౪౫౬,౦౦౦ | ౧౩.౫ | ౧౧.౬ |
| బీహారు | ... | ౪౧౭,౦౦౦ | ౩౮౪,౦౦౦ | ౧౦.౫ | ౧౦.౫ |
| బెంగాల్ | ... | ౩౧౬,౦౦౦ | ౩౧౪,౦౦౦ | ౭.౯ | ౭.౮ |
| మద్రాసు | ... | ౧౧౪,౦౦౦ | ౧౧౨,౦౦౦ | ౨.౮ | ౩.౦ |
| బొంబాయి | ... | ౧౨౨,౦౦౦ | ౧౫౬,౦౦౦ | ౩.౧ | ౩.౩ |
| పశ్చిమోత్తరసరిహద్దు రాష్ట్రము | ... | ౬౫,౦౦౦ | ౮౫,౦౦౦ | ౧.౬ | |
| మైసూరు | ... | ౫౦,౦౦౦ | ౪౬,౦౦౦ | ౧.౩ | |
| హైదరాబాదు | ... | ౪౩,౦౦౦ | ౪౧,౦౦౦ | ౧.౧ | |
| అస్సాం | ... | — | ౪౦,౦౦౦ | | |
| ఒరిస్సా | ... | — | ౩౨,౦౦౦ | | |
| మధ్యరాష్ట్రాలు | ... | — | ౩౨,౦౦౦ | | |
| సింధురాష్ట్రం | ... | — | ౯,౦౦౦ | | |
| ఢిల్లీ | ... | — | ౨,౦౦౦ | | |
| భోపాల్ | ... | — | ౯,౦౦౦ | | |
| బరోడా | ... | — | ౩,౦౦౦ | | |
| | | | ౩,౪౬౬ | | |

ఆ అంకెలు సూచించినట్లు ఇండియాలో ప్రతినూరుయకరాల చెరుకుసాగుకు మూడు యకరాలు మన చెన్నరాష్ట్రంలో పండిస్తారు. ఈ రాష్ట్రంలో సాగుబడిలో నున్న ప్రతినూరుయకరాల భూమికి సుమారు అరయకరంలో చెరుకు ఊడుస్తారు. ఈ విధంగా విస్తీర్ణాన్నిబట్టి చూస్తే మన రాజధాని కేమీ ప్రాముఖ్యత లేదు. కాని యకరానికి పండే పంట విషయంలో మన రాష్ట్రందే అన్నింటికన్న పైచేయి. ౩-వ పట్టికలోని అంకెలు అందుకు నిదర్శనం.

మొట్టమొదట వ్రాసినట్లు, చెరుకును సేకరించి పండించడంలో మొదటివారమయినా మనం ఆ పంట నుంచి ఫలసాయం పొందటంలో హిందూదేశం మొత్తం మీద ఇతరదేశాలన్నిటికీ చాలా తీసికట్టుగా ఉన్నాం. యకరానికి సగటున పదహారు టన్నుల చెరుకు హిందూ

*Report on the Marketing of Sugar in India and Burma; The Indian Sugar Industry, 1942 Annual నుంచి కూర్చబడింది. కొన్ని రాష్ట్రాల అంకెలు దొరకలేదు.

దేశంలో పండుతూంటే జావా, హావైద్వీపాల్లో ౫౦ టన్నులకు పైనిలుకు ఒక యకరంలోనుంచి పండిస్తున్నారు. మన రాష్ట్రంలోని పంటకంటె కూడా ఇది రెండురెట్లకు చాలా పైగా వుంది. ఈపరిస్థితికి కారణ మేమిటి, ఆ దేశాలతో మనం దీటవటం ఎట్లాగా అన్నది చాలా తీవ్రమైన, (ప్రస్తుతం) తీరని సమస్య. ఈ ప్రశ్న వచ్చినప్పుడు సామాన్యంగా యిచటి వ్యవసాయదార్లవల్లో, లేక వ్యవసాయశాఖాధికార్లవల్లో ఏదో లోపం ఉందనిపిస్తుంది. ఈవిషయాన్ని కొంచెం ఇక్కడ పరిశీలిద్దాం.

3-వ పట్టిక

| రాష్ట్రం | | చెరుకుతూకం ౧౯౩౫-౩౬ నుం. ౧౯౩౯-౪౦ వ. యకరానికి సగటు (మణుగులు) * | బెల్లపుప్రమాణం (టనులు) ** (౧౯౪౦-౪౧) | (౧౯౪౧-౪౨) |
|---|---|---|---|---|
| సంయుక్తరాష్ట్రాలు | ... | ౩౬౧ | ౨,౫౨౮ | ౧,౯౭౩ |
| పంజాబు | ... | ౨౦౬ | ౧,౯౧౨ | ౨,౦౧౪ |
| బీహారు | ... | ౩౦౪ | ౨,౨౭౦ | ౨,౨౫౮ |
| బెంగాల్ | ... | ౪౫౧ | ౩,౬౦౦ | ౩,౪౧౮ |
| మద్రాసు | ... | ౬౪౭ | ౬,౬౬౫ | ౬,౫౪౦ |
| బొంబాయి | ... | ౫౮౮ | ౫,౬౦౦ | ౫,౫౧౪ |
| పశ్చిమోత్తరసరిహద్దు రాష్ట్రము | ... | ౨౯౭ | ౨,౪౯౮ | ౨,౫౦౪ |
| అస్సాం | ... | ౨౮౭ | ౨,౫౧౩ | ౨,౨౯౬ |
| హైదరాబాదు | ... | ౫౨౫ | ౫,౧౨౮ | ౪,౪౨౫ |
| మైసూరు | ... | ౩౩౩ | ౩,౨౯౪ | ౩,౧౧౮ |

ఏ దేశంలోనూ కృషీవలుడు తన దేహపరిశ్రమకు తప్పకుండా తగిన ప్రతిఫలం వస్తుందన్న నమ్మక ముంటేనే గాని కొత్త పంథా తొక్కడు. హిందూదేశంలో కానియ్యండి, ఇంగ్లాండులో చూడండి, మరే దేశంలోనయినా గమనించండి తాను స్వతహాగా కళ్లారా చూస్తేనేగాని, లేక ఎంతో ఆప్తులైనవారు చెప్తేనేగాని ఒక మంచివిత్తనం గురించిగాని, మంచి పనిముట్టును గురించిగాని, మంచి సేద్య విధానం విషయంలోగాని కొత్తమార్గాన్ని అనుసరించడు. వ్యవసాయమే జీవనాధారం హిందూదేశపు రైతులకు; చాలా మంది నిరుపేదలు. నాలుగుపుట్ల ధాన్యం పండే భూమినుంచి ౩౨ పుట్లే పండితే కొన్ని దినాలు పస్తుండాలిసొస్తుంది రైతూ, రైతు కుటుంబంకూడా. కనుక కొత్తవిత్తనాలను, కొత్త విషయాలను భయముతో, అనుమానంతో చూస్తాడంటే అతని తప్పు లేదు. ఇటీవల వివిధరాష్ట్రాలలోను వ్యవసాయశాఖలను అభివృద్ధిచేశారు. ఈ శాఖోద్యోగులు తమకు అందుబాటులో నున్న ఊరూరా తాము చేసిన వ్యవసాయ పరిశోధన ఫలితాలను చాటుతున్నారు. తాహతుంటే ఇతరదేశపు తోటిరైతులవలె ఇచటి రైతులుకూడ నవ్యమార్గాల నవలంబిస్తున్నారు.

ఇదిగాక వ్యవసాయశాఖాధికారులు ఏమి చేస్తున్నారో చూద్దాం. కష్ట నిష్ఠూరాలకు లొంగక, చిన్నచూపు చూచినా పెద్దపంట పండి, మన ఇల్లు నింపే పేరైన రకాలను అన్ని పంటల్లోనూ ఏరడం ముఖ్యమైన పని. ఎటువంటి సామాన్యమైన రకాన్నయినా కొంచె మించు మించుగా మంచి వంగడంతో సమానమైన ఫలితాన్ని ఇచ్చేటట్లు చేయగల దోహదాన్ని నిర్ణయించడం రెండోది. ఏదైనా సరే పంటపండించటానికి మొక్క నాటిన మొదలు

* Report on the Marketing of Sugar in India and Burma నుంచి.

** The Indian Sugar Industry. 1942 Annual by M. P. Gandhi నుంచి.

కోతకోసేదాకా ఎప్పుడెప్పుడు ఏ విధమయిన సేద్య విధానాలను అనుసరించాలి అన్నది నిక్కచ్చిగా చెప్పగలగటం మానలేదు. పంట పండించింతరువాత దాన్ని అనుభవయోగ్యంగా చేయటానికి అవలంబించవలసిన పద్ధతులను విపులంగా చెప్పటం మానలేదు. యీ పను లన్నీ రాష్ట్రీయ వ్యవసాయశాఖవారి వల్లగాని, కేంద్రవ్యవసాయ పరిశోధనాలయాల్లోగాని జరుగుతూనే ఉన్నాయి. అయితే ఇంకా ఖర్చు ఎక్కువ పెట్టి చాలాప్రదేశాల్లో వివిధరకాల ప్రయోగాలను చేయవలసిన ఆవశ్యకత లేకపోలేదు. చాలా ఉంది. సరే రైతులూ, ప్రభుత్వమూ కూడా తమ శాయశక్తులా ప్రస్తుతపరిస్థితుల్లో తంటాలు పడుతున్నా మనకూ, యితర దేశాలకూ అంతవ్యత్యాస మెందు కుందని అడగవచ్చు. నాకు తోచిన కారణాలు ఈ క్రింద పొందుపరుస్తాను.

(౧) దేశవైశాల్యం:— జావా, క్యూబా, హవాయి ద్వీపాలు గదా యెక్కువ పండిస్తున్నాయన్నాను. వాటివిస్తీర్ణానికీ, హిందూదేశపు సైజుకూ హస్తిమశకాంతరం ఉంది. ఖచ్చితంగా చెప్పాలిపాస్తే, హిందూదేశపు వైశాల్యము (బర్మా మినహాయించి) ౧,౫౬౧,౬౨౫ చదరపు మైళ్లు; హవాయిద్వీపాలు ౬,౪౫౫; క్యూబా ౪౪,౨౧౮; (మధురవినా) జావా ౪౮,౬౦౪. శీతోష్ణస్థితికిగాని, భూసార విషయంలోగాని, నీటివసతి ఏర్పాటుల్లోగాని, ఇంకా యితర సౌకర్యాల్లోగాని హిందూదేశంలో చెరుకు పండించే ప్రదేశాల తారతమ్యాలు వివరించటానికి అలవిగానివి. మిగతా దేశాల సైజును బట్టి చూస్తే భేదాలు అన్ని వుండటానికి అవకాశం లేనట్టు తెలుస్తుంది. లేవు కూడాను. ఒక్కొక్కప్పుడు మంచుదెబ్బ తిని చెరుకు పాడైపోతుంది పంజాబులో. ఆరడుగుల కంటె హెచ్చుదగదు. దగ్గర దగ్గర రెండున్నర నిలువులెత్తైదిగి ఆపటానికి శక్యంగాకుండా ఉంటుంది గోదావరిజిల్లాలో కొన్ని భూముల్లో. నీటి ప్రమేయమే లేదు దక్షిణబీహారులో. వానని కోరడి పెట్టి పండించే రైతులున్నారు విశాఖపట్నం జిల్లాలో. ఆశోయంబత్తూరు చెరుకు నీళ్లూ నిప్పూ అక్కర్లేదురోయి. రెల్లుచెరుకట్రా అది." అని గంద్రయినుకల్లో వైజాగ్ వాన పడుతుందనుకున్నా వాటి, తరువాత భగవదర్పితం అని వదిలేసి, వేస్తే ఒక బస్తా పిండివేసి, లేకపోతే మానేసి, "దంచినమ్మకు బొక్కిందే కూలి" అని పంటకాలంలో అయిన చెరుకు కొట్టుకొనే రైతులూ ఉన్నారు. వాళ్ల తలతన్నినట్లు ఆ ముచ్చెకోసుపు కయ్యే ఖర్చూ, శ్రమా కూడ లేకుండా రెండు మూడు కార్యాలు వదిలి ఏమొస్తే అదే పుచ్చుకొని సంతృప్తిపడే నిర్భాగ్యదామోదరులూ కనబడుతారు. వీళ్లకు ప్రతిగా, కకు మాయకుండా, సర్వాంగసుందరంగా కనబడేటట్లు తోటకు చుట్టు చుట్టి, తగిన దోహదంచేసి, నీరుపెట్టి, కంటికి రెప్పగా కాపాడి, మంచి ఆదాయం అనుభవించే బుద్ధిమంతులూ ఉన్నారు. ఇన్ని ప్రాంతాల్లోనూ ఇటువంటివారి అందరియొక్క తోటలనుంచి వచ్చిన ఫలితాలకు సగటు యిని లెక్క వేయగా వచ్చింది పదహారుటన్నులు; యకరానికి దిగుబడి.

(౨) ఇది యిట్లా వుండగా మన దేశం ఇష్యుకులవాటికి ఇంకా పూర్వం దారెను. ఈ దేశాలన్నీ మొన్న మొన్న తలలెత్తాయి. వీళ్ల తరబడి పంటలను భరించి నిస్సారాలుకాలేదు వీటి భూములింకా. పైపెచ్చు మంచి సారవంతమైన అగ్ని పర్వతశ్రేణులనుంచి వచ్చిన మన్ను, నదీగర్భాల్లో నుండి బయటకు కొట్టుకొచ్చిన ఒండ్రు వీటిల్లో వుంది.

(౩) వీటికి అతివృష్టి అనావృష్టి భయాలు చాలా తక్కువ.

(౪) మన కోస్తా జిల్లాల్లో (దక్షిణ ఇండియా) వచ్చు ఉప్పెనగాలి ప్రమాదాల్లే నిక్కడ. చెరుకు పడి ముక్కలై ధ్వంసమైపోదు. ఇది సహజంగా, దైవికంగా వాటికి ఉన్న ప్రయోజకత్వాలు. భగవంతు డిచ్చిన ఈ వరాల్ని మినహాయిస్తే అచటి ప్రజలు సమకూర్చుకున్న అవకాశాలు మిగుల్తాయి. జావా దేశంలో ఇంచుమించు చెరుకుతోటలన్నీ పంచదార మిల్లు కంపెనీలవే. వాళ్లకు పెట్టుబడికి కొదవ లేదు. వాళ్లు చెరుకుతోట తాకట్టుపెట్టి షాహుకారుకో డబ్బుకు దేవురించక్కర్లేదు మన రైతుల్లాగా. ప్రతి కంపెనీకి వ్యవసాయ శాస్త్రజ్ఞులూ, రసాయనిక శాస్త్రవేత్త

లూ అందుబాటులో ఉంటారు. సకాలంలో సక్రమమైన పద్ధతులతో తోటలను సాకుతారు. తోట కొట్టిన తరువాత కొనేవాడూ, అమ్మే అసామీ ఒకడే గనుక "తుక్కుమన్నుతో కలిపి చెరుకు తెచ్చావని" ఒకడూ, "తక్కువతూచా" వని ఇంకోడూ తగవులాడటానికి అవకాశంలేదు. ఫ్యాక్టరీ ప్రక్కనే తోటలుండబట్టి పక్వమైన చెరుకునే ఎంచి ఈదేశంలో కొట్టి మిల్లుకుతోలుతారు. ఒక్క బొంబాయి రాష్ట్రంలో తప్ప ఫ్యాక్టరీలు తమకు కావలసిన చెరుకు నంతా తమ స్వంతశేరీలలో పండించుకోటంమామూలు లేదు. చెరుకు ఒకప్రక్క నుంచి ఎండిపోతున్నా సరే, నీరుకట్టి దాన్ని బ్రతికించుకొనే అవకాశం లేకపోయి నాసరే, బెల్లం వండటం చేతగాని రైతుఫ్యాక్టరీఅధికారుల అనుగ్రహంమీద ఆధారపడి ఉండవలసిందే. వాళ్లు తెమ్మన్నప్పుడే చెరుకు తేవాలి. పాడైపోయిన చెరుకు ఆడటంవల్ల పంచదారదిగుబడి తక్కువై పోతుంది.

"ఇదంతా మహాబాగా వుంది. వాళ్లకు స్వప్రయోజనంవల్లనై తేనేం, భగవదనుగ్రహంవల్లనై తేనేం చెరుకుపంట బాగా పండుతోంది. మన దేశంలో రైతులు తెలివితక్కువవాళ్లు కారు. అనుభవజ్ఞులు. వ్యవసాయ శాఖవారు ప్రభుత్వ మిచ్చిన అవకాశాలను వినియోగించి సాధ్యమైనంతవరకు వారి ధర్మాన్ని నిర్వర్తిస్తున్నారు. అయినా మన ఖర్మం కాలి తక్కువ పండుతోంది ఈ నిర్భాగ్యదేశంలో" అనుకోమని కాదు పైన వ్రాసిన భారతమంతా. స్వప్రయోజకత్వంవల్ల వాళ్లు పొందిన లాభాలను మన దేశంలోకూడా సాధ్యమైనంతవరకు పొందటానికి మార్గాలను అన్వేషించి అవలంబించాలని మనవిచేయటానికి. ప్రస్తుతం మన రాష్ట్రంలో ఉన్న ప్రజలందరకూ కావలసినంత పంచదార, బెల్లం తయారుచేయడం లేదు. వివరాలు తరువాత విశదీకరిస్తాను. ఎక్కువ పంట పండించటానికి రెండువిధాలున్నాయి: ఎకరానికి రెండెకరాలు సాగుచేయటం ఒకటి; ఒక్క యకరం నుంచే ఏమార్గాలనైనా అవలంబించి టన్నుకు రెండు టన్నులు పండించడం మరొకటి. ఈవిధాల్లో రెండవదే మనకు లాభదాయకం.

ఎక్కువ పండించడమే కాకుండా, చౌకగా పండించడంకూడా చాలా ముఖ్యం. దీనికి—

(౧) స్వతస్సిద్ధంగా ఏపరిస్థితుల్లోనైనా సరే ఎక్కువ ఫలితాన్నిచ్చే చెరుకురకాన్ని సాగు చేయటం,

(౨) పంటజీవితం అంతలోకూడా అనువుగు కావలసిన సేద్యంచేయటం,

(౩) సరియైన సమయానికి తగిన ఎరువు వేయుట, దోహదంచేయుట,

(౪) సకాలంలో, అనగా పక్వమైనతరువాత, చెరుకు కొట్టి బెల్లంగాని పంచదారగాని చేయుట అవసరం.

ఈవిషయాలనుగురించి వివరాల్లోకి దిగేపూర్వం మన రాష్ట్రంలో చెరుకువిస్తీర్ణం, సాగుచేసే ముఖ్య ప్రాంతాలను గురించి రెండుముక్కలు వ్రాస్తాను.

గత పదిపన్నెండేళ్ల లెక్కలు చూస్తే మన రాజధానిలో సాధారణంగా ఏటేటాకనీసం ౯౮,౦౦౦ యకరాలు చెరుకుతోట వేస్తారని స్పష్టమవుతుంది. క్రింద ఉదాహరించిన అంకెలు చూడండి:

| సంవత్సరం | విస్తీర్ణం (యకరాల్లో) |
|---|---|
| ౧౯౩౦-౩౧ | ౧౧౪,౮౭౭ |
| ౧౯౩౧-౩౨ | ౧౧౬,౧౦౫ |
| ౧౯౩౨-౩౩ | ౧౨౦,౯౨౧ |
| ౧౯౩౩-౩౪ | ౧౨౧,౬౫౦ |
| ౧౯౩౪-౩౫ | ౧౨౫,౩౧౦ |
| ౧౯౩౫-౩౬ | ౧౨౩,౩౬౧ |
| ౧౯౩౬-౩౭ | ౧౧౯,౬౫౦ |
| ౧౯౩౭-౩౮ | ౯౭,౯౬౫ |
| ౧౯౩౮-౩౯ | ౯౮,౨౬౨ |
| ౧౯౩౯-౪౦ | ౧౩౭,౬౩౩ |
| ౧౯౪౦-౪౧ | ౧౬౨,౦౦౦ |
| ౧౯౪౧-౪౨ | ౧౧౨,౦౦౦ |

శీతోష్ణస్థితినిబట్టిగాని, భూసారాన్నిబట్టిగాని, నీటివసతిఏర్పాట్లను చూచిగాని, ముఖ్యంగా పండించే చెరుకురకాలను అనుసరించిగాని, లేక ఏ యితరగుణగ

కాలదృష్ట్యాగాని పరికించి చూచినా మన రాష్ట్రంలో చెరకుపండించే ప్రదేశాలను అయిదారుభాగాలక్రింద విభజించవచ్చు. అవి ఏవంటే—

(౧) విశాఖపట్నంజిల్లా:—ఇది చెరకుపంటకు చాలా ముఖ్యమైన ప్రాంతాల్లో ఒకటి. ఈరాష్ట్రంలో ప్రతినూరుయకరాల చెరకుసాగుకు ౨౭ యకరాలు ఈజిల్లాలో వుంది. పొలాలన్నీ చక్కని శల నేలలు. అట్టే ఇసకగాక, మరీ రేగడిరేక మధ్యరకపు సారవంతమైన భూములు చాలావరకు. ఇంగ్లీషులో **Sandy loams** (సాండీ లోమ్సు) అంటారు వీటిని. ఇక్కడి రైతులు నూతినీటి ఆధారంతో చెరకు ఊడుస్తారు. వానకాలంమాత్రం పాకే వానలనీరు ఆగస్టుమాసం మొదలు అక్టోబరు నవంబరుమాసాలదాకా అందుబాటులో వుంటుంది. వానలు సాధారణంగా అన్ని ఋతుపవనాల్లోనూ పడతాయి. వేసవిలో పడిపడహోరుదుక్కుల వాన కురుస్తుంది. ఎండతీవ్రత అట్టే వుండదు. ముఖ్యంగా వీరవిల్లి, అనకాపల్లి, బొబ్బిలి, పాలకొండ, ఎలమంచిలి, నర్సీపట్నం, పార్వతీపురం తాలూకాలలో చెరకుతోటలు విస్తారంగా వున్నాయి. ఇక్కడ ఎక్కువగా కో. ౪౧౯ అన్న రకం సాగుచేస్తారు. ఎకరానికి సగటున ౩౦ టన్నుల చెరకువరకు దిగుబడి ఉంటుంది.

(౨) చిత్తూరు, ఉత్తరదక్షిణఆర్కాటుజిల్లాలు: ఈమూడూ కలిసి నూటికి ౨౬ వంతుల చెరకుతోటల విస్తీర్ణం పంచుకున్నాయి. ఇక్కడిభూముల్లో కొంచెం ఇసకపాలు ఎక్కువ. (ముఖ్యంగా ఉత్తరఆర్కాటు, చిత్తూరులలో) వేసవివానలు అరుదు. తొలకరివానలు ఆగస్టుమాసంలోకాని ప్రారంభంకావు. అయినా అట్టే వర్షం పడదు. ఈప్రాంతాల్లో సెప్టెంబరు అక్టోబరు నెలలలోనే వాన ఎక్కువ. చెరకుతోటలను ముఖ్యంగా నూతినీటి ఆధారంవల్లనే పండించుతారు. చిత్తూరు ఉత్తరఆర్కాటుజిల్లాలలో కో. ౪౧౯ విరివిగా వేస్తారు. దక్షిణఆర్కాటుజిల్లాలో కో. ౨౧౩, కో. ౩౪౯ పంచదారఫ్యాక్టరీచుట్టుప్రక్కల జాస్తిగా నున్నవి. మిగతా భాగంలో కో. ౪౧౯ హెచ్చుగా సాగుచేస్తారు. సుమారు ౩౦ మొదలు ౩౫ టన్నుల చెరకుదాకా కో. ౪౧౯, ౨౫ మొదలు ౨౮ టన్నులు కో. ౨౧౩ యకరానికి దిగుబడి నిస్తాయి. ఈజిల్లాలలో చెరకు త్వరగా, అనగా అక్టోబరులోనే పూస్తుంది. ఇతరచోట్ల పూయనిరకాలుకూడా యిక్కడ పెన్నేస్తాయి. పూత పూస్తే మొక్క ఎదగదు. ఎంత చెరకు పెరిగితే అంత ఎక్కువ దిగుబడిగదా. గనుక ఈ చెరకుపూత ఇచటి దిగుబడిని తగ్గించేస్తోంది.

(౩) కృష్ణా, గోదావరి జిల్లాలు:—పై ప్రాంతం తరువాత కృష్ణా గోదావరి జిల్లాలు ముఖ్యమైనవి. కృష్ణాజిల్లాలో గన్నవరం బెజవాడ తాలూకాలు, తూర్పు గోదావరి జిల్లాలో రామచంద్రాపురం పెద్దాపురం కాకినాడ తాలూకాలు, పశ్చిమ గోదావరి జిల్లాలో తణుకు, నర్సాపురం తాలూకాలూ ముఖ్యంగా చెరకుతోటలు వేసేవి. మన రాజధానిలో నూటికి ౧౧ వంతుల చెరకు విస్తీర్ణం యిక్కడుంది. భూములన్నీ లోతైన నల్లరేగటి నేలలు. వేసవిలో అట్టే వాన కురవదు. రెండు ఋతుపవనాల సమయాల్లోనూ వానలు అడపా దడపా పడుతూవుండి పంటల కుపకరిస్తాయి. ఎండ లెక్కువ. పెద్దాపురం తాలూకా, పశ్చిమ గోదావరి కృష్ణా జిల్లాలలో కో. ౪౧౯ ముఖ్యమైన చెరకురకం. సుమారు ౪౦ టన్నులు గోదావరి జిల్లాలలోను, ౩౦ టన్నులు కృష్ణలోను పండుతుంది. రామచంద్రాపురం తాలూకాలోమాత్రం యింకా నల్లమొగిలిచెరకు ( **Purple Mauritius** ) పండిస్తున్నారు. ఇది సగటున ఎకరానికి ౩౦ టన్నుల చెరకు నిస్తుంది. ఈ మధ్యనే కో. ౪౧౯ ఇచ్చటకూడా వ్యాపిస్తోంది. ఈ జిల్లాలలో, ముఖ్యంగా గోదావరిలో తుపానుగాలులవల్ల నవంబరుమాసంలో చెరకుతోటలకు నష్టం కలగటం సహజం.

(౪) కోయంబత్తూరు జిల్లా:— ఇక్కడ రాజధానిలో నూటికి తొమ్మిది వంతుల విస్తీర్ణం వుంది. శీతోష్ణస్థితి సమశీతలంగా వుంటుంది. పల్లపుభూములలోను, ఇతరచోట్లకూడ చెరకు వేస్తారు. మాగాణి పొలాలు చిన్న నదుల సహాయంతో సాగవుతాయి. మిగతా తోటభూమి ( **Garden Land** ) అంతా నూతినీటి ఆధారంవల్ల పండుతుంది. ఇచటి వర్షపాతం సెప్టెంబరు అక్టోబరు నెలలలోనే హెచ్చు.

సాగుచేసే ముఖ్యమైన రకం కో. ౪౧౯. ఇక్కడ సర్వసాధారణంగా పూర్తి పూయని చెరుకు రకం ఉండదు. సగటున యకరానికి ముప్పైఅయిదు టన్నుల చెరుకు పండుతుంది.

(౫) బళ్లారి జిల్లా:— ఈ జిల్లాలో నూటికి ఏడుపాళ్లు చెరుకు విస్తీర్ణం వుంది. తుంగభద్రా నదీ పరిసర ప్రాంతాల్లోనే చెరుకు సాగంతా కేంద్రీకరింపబడి వుంది. హాస్పేట తాలూకా ఇందుకు ప్రాముఖ్యత వహించింది. ఇక్కడ ముఖ్యంగా కో. ౨౯౦ చెరుకు రకం పండిస్తారు. ఇప్పుడిప్పుడే కో. ౪౧౯ చురుకుగా వ్యాపిస్తోంది. కో. ౨౯౦ సుమారు ౨౦ టన్నులు చెరుకు దిగుబడి యిస్తుంది.

(౬) ఇతర జిల్లాలు:— సేలం, తిరుచునాపల్లి, దక్షిణకనరా జిల్లాలలో ఒక్కొక్కదాంట్లో నాలుగు వేల యకరాలకు పైగా చెరుకు పండించుతారు. సేలం, తిరుచినాపల్లి జిల్లాలలో కావేరీజలం పారించి గాని, చెరువు, లేక నూతినీటి సహాయంవల్లగాని చెరుకు పండించుతారు. కో. ౪౧౯ రకం ముఖ్యమైనది. సేలంలో యకరానికి సుమారు నలభైటన్నులు దిగుబడి ఇచ్చినట్లు తెలుస్తుంది.

తిరుచునాపల్లిలో యకరానికి ౩౫ టన్నుల చెరుకు పండుతుంది. రెండుచోట్లాకూడా నదినీటి ఆధారం లేని పొలాలనుంచి దిగుబడి తక్కువ. దక్షిణకనరా జిల్లాలో ఎర్రమొగిలి ( **Red Mauritius** ) మొన్న మొన్నటిదాకా విస్తారం వేసేవారు. ఇప్పుడు కో. ౪౧౯ చాలా వ్యాపిస్తున్నది.

ఇక పంటఅభివృద్ధిమార్గాలనుగురించి కొద్దిగా ప్రస్తావించి ఆపద్ధతులను అనుసరించి సేకరించిన మంచి చెరుకురకాలను గురించి మనవిచేస్తాను.

సాధారణంగా ప్రతిరైతూ చక్కగా ఎదిగి సంపూర్ణంగా పండి పురుగూపుట్రా లేకుండా వున్న పంటలోనుంచి విత్తనాలు తీసి పదిలపరుస్తాడు. వ్యవసాయశాఖవారుకూడా ఈమార్గాన్ననుసరించే ఉన్న మొక్క లన్నింటిలో మంచిగుణాలు కలిగిన మొక్కను ఏరి, దాని విత్తనం వేరే వేసి, పుట్టిన మొక్క లన్నిటిలో తల్లి మొక్కగుణముకలిగినవాని నన్నిటిని ఏరి, మరుసంవత్సరంకూడ పెంచి, వీటికీ మొదట ఏరిన మొక్కకూ ఏవ్యత్యాసమూలేని సందర్భములో, విత్తనాన్ని ఉంచి ఎక్కువచేసి నలుగురికీ పండించుకోండని వెల్లడిచేస్తారు. ఈవిధానం వరివంటి పంట అభివృద్ధికి ఎక్కువ అవకాశాన్నిస్తుంది.

ఈపద్ధతివల్ల ఆయాప్రాంతాల్లోగాని, రకాల్లోగాని గుణాలు తెచ్చిపెట్టలేం. ఒక వరిరకం ఉందనుకోండి. అది ఆరునెలల పంట. మంచి దిగుబడి ఇస్తుంది. ఇంకో వూళ్లో అయిదునెలలుమాత్రమే నీటివసతి వుంది. అక్కడ ఈరకాన్ని పండించడం ఎట్లా? తక్కువకాలం నీటిపారుదల ఉన్న ఊళ్లో వరిరకం తక్కువపంటే పండుతుంది. మనకు తక్కువకాలంలో ఎక్కువపంట నిచ్చే రకం కావాలి. దీనికి ఈ రెండు రకాలనూ తల్లిదండ్రులుగా చేసి కలపాలి. చాలాపువ్వులలో ఆడమగభాగాలు (పుప్పొడి, అండాశయము) ఏర్పాటుగా ఉంటాయి. ఒకదానిలో మగభాగాన్ని తీసివేసి రెండవపువ్వులోని మగభాగంలోని పుప్పొడిని మొదటిపువ్వుఆడభాగంమీద చల్లినయెడల ఉత్పన్నమగు విత్తు తల్లిదండ్రులిద్దరి గుణాలూ కొంతవరకు కలిగిన మొక్క నిస్తుంది. ఇటువంటి విత్తనాలు చాలా తయారుచేసి, మొక్కలను పెంచి, తల్లిదండ్రుల గుణాలు చాలా ఎక్కువగా కలిగిన మొక్కలను ఏరి, వాటి విత్తనములను తిరిగి నాటి వచ్చిన మొక్కలలో తల్లిదండ్రులకు సంపూర్ణమైన పోలిక గలవాటినే ఏరి, మనకు కావలసిన రెండు మంచిగుణాలు ఏరకంలో ఎక్కువగా ఉంటే దాన్నే అభివృద్ధిచేసి, మిగతా వాటిని వదిలెయ్యడం అన్నది పంటఅభివృద్ధికి రెండవ మార్గం. ఎక్కువ కష్టమైనా మంచి ఫలితాన్నిస్తుంది.

ఈమార్గాన్ననుసరించి చెరుకు నెట్లా అభివృద్ధి చేశారో చూద్దాం. చెరుకుగడను ముక్కలక్రింద కొట్టి నాటుతారు. ఈముక్కలను ముచ్చెలని, దవ్వఅని అంటారు. ప్రతికణుపుదగ్గరా వున్న కన్నులోనుంచి చెరుకుమొక్క పుట్టుకొస్తుంది. తోట అవుతుంది. ఈ గడల్లోనే పురుగు పుచ్చు లేకుండా చూసి మంచి ఏపుగా ఎదిగినవాటినించే దవ్వ కొట్టి మరుసంవత్సరం నాట

వచ్చు. ఇది ప్రతిరైతూ చేసే పని. క్రొత్తరకాలను సృష్టించాలంటే ఈపంటలోకూడ రెండురకాలను మిళితంచెయ్యాలి. చెరుకుతుదని వెన్ను వేస్తుంది·




కొన్నికొన్ని పూళ్లలో కొన్నికొన్ని సంవత్సరాల్లో. ఆవెన్నులో అనేకవందల పువ్వులున్నాయి. ప్రతిపువ్వులోనూ ఆడమగభాగాలున్నాయి. వీనినే అండాశయము (**Ovary**), పుప్పొడి (**Pollen**) అని అంటారు. కొన్నిరకాల్లో పుప్పొడి ఫలవంతమైనదిగా వుండదు. అందువల్ల ఇంకేదయినారకం పుప్పొడి అండాశయము పైన ఉన్న "స్టిగ్మా" (**Stigma**) అన్నదానిమీద పడి మొలకెత్తి లోపలికి చొచ్చుకొని పోతేనే గింజ కడుతుంది. కొన్నింటిలో అండాశయము, పుప్పొడి కూడ నిర్వీర్యాలుగా వుంటాయి. ఆరకం గింజ కట్టనేకట్టదు. కొన్నిరకాల్లో పుప్పొడి త్వరగా పక్వానికి వస్తుంది. అది ఇంకోరకంపుప్పొడి ఉపయోగార్హం కాకపూర్వమే దాని అండాశయముమీద చల్లితే తయారైన గింజలు ఈ రెండురకాల గుణగణాలను కలిగివుంటాయి. ఇట్లా చెరుకురకాలను సృష్టించే చెరుకుప్రవర్ధక స్థానము మనదేశానికంతకీ ముఖ్యమైనది కోయంబత్తూరులో వుంది. ఇచట, ఈవిధముగా ఉత్పన్నమైన గింజలను కుండ గోలాములలో జల్లి వచ్చిన మొక్కలలో బాగా దృఢంగా ఉండి జోరుగా ఎదిగే మొక్కలను ఏరుతారు. వీటిని తరువాత భూమిమీద నాటుతారు. వీటిల్లో బాగా వచ్చినవాటినిమాత్రం తీసి ముక్కలుకొట్టి పాతేస్తారు. ఈవిధంగా చెయ్యటంవల్ల కణుపులదగ్గరనున్న కళ్లలోంచి మొక్కలు పుట్టుకొస్తాయి. ఇతరరకపు సంయోగం లేకుండా ఉత్పన్నమైనవి కాబట్టి వీటి గుణాలకూ, తల్లి మొక్క గుణాలకూ ఏమీ భేదం వుండదు. ఇప్పటికు యీమొక్కలను పెద్ద గడలుగా ఎదుగనిచ్చి (సుమారు ౧౨ నెలలు) వాటిరసంలో పంచదారపాలెంత ఉన్నది అన్నవిషయం అప్పుడప్పుడు పరిశోధనచేసి చూస్తారు. ఎక్కువగా పంచదార వున్న రకాల్నే ఏరి బయటకు పంపించుతారు. రెల్లుగడ్డిలోని మొండితనాన్నీ, జొన్నపంటలోని త్వరగా పక్వానికి వచ్చే గుణాన్నీ, వెదురుచెట్టుయొక్క దుబ్బుచేయు స్వభావాన్నీ, ఎత్తుగా పెరిగే సైజాన్నీ, చెరుకుమొక్కలోని తియ్యదనాన్నీ (పంచదారపాలు) కలిపి రకరకాల మంచిచెరుకులు ఈపరిశోధన స్థానంలో సృష్టించారు. ఇచటనుంచి విదేశాలకు పంపబడిన కో. ౨౧౩, కో. ౨౯౦ అన్న రకాలు మన దేశానికి చాలా విఖ్యాతిని సమకూర్చిపెట్టాయి. వీటి తరువాత

పేరబడిన చెరకురకాల్లో వీటికంటె శ్రేష్ఠతరమైనవికూడా ఉన్నాయి.

ఈపరిశోధనస్థానంలోనుంచి వెలువడిన చెరకు రకాలే మన దేశమంతా ప్రస్తుతం సాగుచేస్తున్నారు. ఉత్తరాదిని, అనగా సంయుక్తరాష్ట్రాలు, బీహారు మొదలైన రాష్ట్రాలలో సన్నని చెరకులను పండిస్తారు. వాటి పైతొక్క చాలా గట్టి. వాటిలో పీచు ఎక్కువ. సన్నగా ఉండబట్టి తూకం తక్కువైనా రెల్లుగడ్డిలాగా ఎంత ఎండనైనా మంచునైనా చాలావరకు భరించగల శక్తి కలవి. యకరానికి సగటు ఫలసాయం చాలా తక్కువగా కనబడటానికి మన దేశంలో నూటికి యనభైయకరాల్లో యిటువంటి చెరకురకాలను పండించడంకూడా కారణం.

దక్షిణఇండియాబొంబాయిరాష్ట్రాలలో లావైన చెరకులు సాగుచేస్తారు. వీటికి కన్నతల్లిప్రేమ చూపించితేనే తగిన ప్రతిఫలం లభించుతుంది. నీరు, ఎరువు సమృద్ధిగా వుంటే ఎక్కువఆదాయాన్నిస్తాయి.

(సశేషం.)

---

## దిద్దుబాట్లు

గతమాస 'భారతి'యందు ప్రకటింపఁబడిన 'పాండురంగమాహాత్మ్యము—పాఠపరిశీలనము' అను వ్యాసమున నా వ్రాఁతయందలి తొందరపాటువలనఁ గొన్ని తప్పులు పడినవి. వానిని క్రిందిరీతిని సవరించుకొనఁ ప్రార్థన.

పుట 133. కలం 2. పంక్తి 30—'కేశలుంఛనము'నకు బదులు 'కేశలుంచనము'అని దిద్దుకొనవలెను.

పుట 135. కలం 2. పంక్తులు 29 నుండి 34 వఱకును.

'వ్రాలి'కి 'రాలి'యను పాఠమంగీకరించిన యతి కుదురదు. వ్యాసమును వ్రాయునపుడు దానిని గమనింపనైతిని. ఆపాఠ మనంగీకార్యము.

బు. వేం. రమణయ్య.

---



# చిలకా, గోరింకా

[కథ]



= 'జమదగ్ని' =

తల్లి ఒడిలో తలదాచుకుని పడుకోబోయేముందు తండ్రి పిల్లలకు బుద్ధులు చెపుతాడు. అదేవిధంగా నిశాగర్భంలో ప్రకృతి సమస్తమూ నిద్రించబోయే ముందు కర్మసాక్షి తన సుదీర్ఘహస్తాలు చాచి 'జరిగిందేదో జరిగింది. రేపయినా సరిగా ప్రవర్తించు' అని హెచ్చరిస్తూ శుభం కోరి ఆశీర్వదిస్తాడు. మనస్సుల్లో గాఢంగా కల్మషం పెంచుకోని సకలజీవరాసులూ ఆ హెచ్చరికను విని ఆ ఆశీర్వాదఫలం అనుభవిస్తాయి. తెలివిమీరిన మానవుడుకూడా ఆమార్గంలో నడిస్తే భూతలం స్వర్గసీమ కాదూ!

సాయంవేళ పొలంనుంచి ఇళ్లకు మళ్లే పశువుల మందను చూస్తే ఆదర్శస్థితిలో మానవప్రపంచం అట్లా ఉండాలని అనిపిస్తుంది. ఆ రోజున ఆ మందకు ఎందుచేతో మరీ అందం వచ్చింది. నీరుమోసిన నీలమేఘాల్లా బఱ్ఱెగొడ్లు వెనక మెల్ల మెల్లగా నడుస్తున్నాయి. కొత్తగా ఈనిన ఆవుగొడ్లు చేపుకొచ్చిన కుండపొదుగులతో దూడలు జ్ఞాపకంరాగా అంభా అని అరుస్తూ నడకా పరుగూ కాకుండా ముందు నడుస్తున్నాయి. కాడి కలపని కొత్తగిత్తలు మధ్యమధ్య దారి కడ్డం తిరిగి కుమ్ముకుంటూ మందను ఆపేస్తున్నాయి. తల్లుల వెంట విడువబడిన కోడెదూడలు చెంగుచెంగున కుచ్చుతోక లెత్తి గంతులువేస్తూ ఫర్లాంగుదూరం ముందు పరుగెత్తి, మళ్లీ ఒక నిముషంలో అంత మందలోనూ పొరపాటులేకుండా తమ తల్లులను చేరుకుంటున్నాయి. పాటుపడ్డ బండియెడ్లు మువ్వలపట్టెడలో బొణుగుచప్పుడుతో లయకలుపుకుంటూనే దాణాకోసం తొందర నడకలు నడుస్తున్నాయి. కొత్తే ఈడు వచ్చిన పెయ్య దూడలు కొత్తగిత్తలను అనుకరిస్తూ గిట్టలతో నేలను తవ్వి, కొమ్ములతో పుట్టలు పొడిచి మట్టి నెత్తిన పోసుకుంటున్నాయి. పాడావులంత పరుగెత్తకుండా, బఱ్ఱెలంత నెమ్మదిగా కాకుండా, చూడావులు సుందరంగా నడుస్తున్నాయి. నడవడానికి చోటు లేనట్లుగా ఒకదాన్ని ఒకటి రాచుకుంటూ నడుస్తున్నాయి బఱ్ఱెలు. నేలమీద కొట్టిన కఱ్ఱలు పుచ్చుకుని ఎగురుతూ గొడ్లకాపరిగొల్లలు ఈలలు వేసుకుంటూ అదలిస్తున్నారు మందల్ని.

ఆ మంద అంతటిలోనూ బఱ్ఱెలకంటే వెనకపడ్డ ఈనమోపైన రెండు చూడావులుమాత్రం చాలా ఆకర్షిస్తున్నాయి. ఒకటి దోరది, రెండోది వెల్లది అన్నమాటేగాని చూడానికి రెండూ ఒకే అచ్చుగా కనిపిస్తున్నాయి. గిన్నికొమ్ములతో, కుచ్చుతోకలతో, నిండుకడుపులతో, గుజ్జుమూపులతో అవి రెండూ మహాశిల్పి చెక్కిన విగ్రహాల్లా కనపడుతున్నాయి. వాటికా అన్యోన్యం ఎట్లా ఏర్పడిందోకాని ఒకదానిముందు మరొకటి నడవటల్లేదు. రెండూ కలిసి పక్కపక్కన నడుస్తున్నాయి. ఆగితే రెండూ ఒకేమాటు ఆగుతున్నాయి. దోరావుముఖాన తెల్ల మచ్చా, వెల్లావుముఖాన ఎఱ్ఱమచ్చా పసుపుకుంకుమలతో అలంకరింపబడిన ముత్తైదువుల సౌభాగ్యం చేకూరుస్తున్నాయి. బహుకుటుంబీకుల ఇంట్లో ఆడబిడ్డా, కోడలూ ఒకేమాఱు కడుపుతో ఉన్నట్లు, సమవయస్కులైన చెలికత్తెలు చెట్టాపట్టాలు కట్టుకుని సహజమందగమనంలో నడుస్తున్నట్లు, ఎఱుపుతెలుపు వర్ణభేదంతో ఒకేగుచ్ఛంలో వికసించిన రెండుపూవులట్లు ఆ రెండావులూ చూప

గుల మనస్సులను ఆకట్టుకున్నాయి. ఆ రెంటిలో వెల్లావు దొరదానికంటె భారంగా నడుస్తోంది. అది అప్పుడప్పుడు నడవలేక ఆగుతుంటే దొరదికూడా దానికోసం ఆగి మూతికలిపి ముందు నుంచోడం చూస్తే 'రా, పరవాలేదు, ఇంటికి త్వరగా పోదాం' అని ధైర్యం చెపుతున్నట్లు కనబడుతోంది. దానికి ధైర్యం కుదరడంలేదు కాబోలు, ఒక్కొక్కప్పుడు ఆ చెట్టు కిందా ఈ చెట్టు కిందా నిలబడిపోతోంది. దాన్ని కనిపెట్టుకుని దొరదికూడా ఆగిపోతోంది. వాటిని విడిచి మంద మాత్రం ముందుకు సాగిపోతోంది.

గ్రామం సమీపించింది. సముద్రంలో కలువబోయే నది పాయలుపాయలుగా చీలి పోయేటట్లు మంద అంతా చిన్న చిన్న గుంపులుగా విడిపోయి తమ తమ ఇళ్లకు పోతున్నాయి. జగన్నాథం తన మందను ఇంటికి తోలుకువచ్చాడు. అతడు రామయ్యగారి గొడ్లకాపరి గొల్ల. అతనికి గొడ్లు పెంచడంలో యాదవ సార్వభౌముడికున్నంత నేర్పు ఉన్నది. అతడు ప్రతిఆవుకూ తలోక పేరూ పెట్టాడు. పాకలో గొడ్లు ఒక దాన్ని ఒకటి పొడుచుకుంటున్నా, పొలానికి పోయేటప్పుడు ఏ ఆవు అయినా దారితప్పిపోతున్నా పేరుపెట్టి పిలిచి బుద్ధులు చెపుతూ ఉంటాడు.

మంద ఇంటిని సమీపించడం తోటే లోపల ఉన్న లేగ దూడలు తమ తల్లులను అంభారావాలతో ఆహ్వానించాయి. తమ ఆగమనం సూచించే అంభారావాలు చేస్తూ పాడి ఆవులు మిగిలిన గొడ్లను తోసుకుని ముందు ప్రవేశించాయి. అవి వచ్చీరావడం తోటే తమ తమ దూడల్ని ఒకసారి మూచూచి కుడితి తొట్ల మీదికి ఎగబడ్డాయి. కుడితి తాగడం అలవాటు లేని కొన్ని ఆవులు మాత్రం దూడలు పాలు తాగుతూ ఉంటే మాతృప్రేమతో వాటి దగ్గరే నిలబడి పోయాయి. గేదగొడ్లు కుడితి వాసన చూసి రెండేసి కలిసి ఒకే తొట్టిలో మూతులు ముంచి అడుగు దాకా దేవుకు తినడం కోసం ఒకదాన్ని ఒకటి పొడుచుకుంటున్నాయి. దూడలు లేని, పాలివ్వని కొన్ని వట్టిగొడ్లు పాకలో పాడిగొడ్ల కోసం ఉంచిన పచ్చగడ్డి మోపుల మీదికి ఎగబడ్డాయి. కడుపులో మాడుతున్నా నాగరకత బలిసిన మానవుడు మర్యాదకోసం ఆగిపోయేటట్లు దాణాబుట్టలు తమదగ్గఱకు రాలేదని బండిఎద్లు నిలబడి చూస్తున్నాయి. వాటిని సమీపించడానికి ధైర్యం లేక కొన్ని గొడ్లు అటూ ఇటూ తచ్చాడుతున్నాయి.

వెనకపడ్డ దున్నల్ని లోపలికి తోలి జగన్నాథం గొడ్ల పాకలో ప్రవేశించాడు. లేగదూడల కోసం ప్రత్యేకంగా ఏరి తెచ్చిన పచ్చగడ్డిమోపును మిగిలిన గొడ్లకు అందకుండా దూరంగా దింపుకుని, తొందఱ తొందఱగా గొడ్లను కట్టెయ్యడానికి పూనుకున్నాడు. ముందుగా దూడకు పాలుకుడుపుకుంటున్న బట్ట పెయ్యను కేకేసి దూడనూ తల్లినీ విడదీసి కట్టేశాడు. కోడెదూడ నొకదాన్ని బోడిగిత్త కుమ్ముతూఉంటే 'ఓసి బోడీ! కొమ్ములు లేక పోయినా నీకు ఎంత పౌరుషం ఉందే! ఇటు రా!' అని పిలిచి దాన్ని కట్టేశాడు. ఇంతలో కుడితి తాగడం అయిన బత్తె ఒకటి వచ్చి పచ్చగడ్డి మోపుమీదికి ఎగబడే టప్పటికి అక్కడ ఉన్న చిల్లర గొడ్లు దాని బార కొమ్ములు చూచి భయపడి ఒకదాన్ని ఒకటి తొక్కుకుంటూ తొలిగిపోయాయి. ఆ తొక్కిడిలో తమ దగ్గఱకు వచ్చిన పశువుల్ని బండిఎద్లు బుస్సలుకొట్టి పొడువబోయాయి. అది చూచి జగన్నాథం కోపంతో 'పెట్టిన పేరు పాడుచేస్తావేం రామం! జాగ్రత్త!' అని అరిచేటప్పటికి రాముడూ, లక్ష్మణుడూ గాడి దగ్గఱకు పోయి నిలబడ్డాయి. వాటినీ, అంతకుముందే గాడిలో గడ్డినములుతున్న దున్నల్నీ కట్టేసి నాలుగు దాణాబుట్టలూ వాటిముందు పడవేశాడు. ఈలోగా కట్టిఉన్న లేగదూడలు గుంజలచుట్టూ గిరగిరా తిరుగుతూ తల్లులకోసం అరుస్తున్నాయి. పాడిఆవుల్లో మాలచ్మి అన్నిటికంటే పెద్దది. అది గుంజమీద ముందుకాళ్లు ఆన్చి మోర సాచి అటకమీద ఉన్న చొప్పకట్టలు లాగుతోంది. దాన్ని ముందు కట్టేసి, ప్రతి కట్టుకొయ్యదగ్గఱకూ పోయి పలుపులు సరిచేసుకుంటూ చుక్కావునీ, కత్తిఆవునీ, కాటుకకళ్ల పెయ్యనీ, పొట్టిగిత్తనీ పేరుపేరునా పిలిచాడు. మూడు పాడిఆవులూ వచ్చాయికాని పొట్టిగిత్త రాలేదు. అది

పాకముందు నిలబడి దేన్నో పొడుస్తున్నట్లు కనబడింది. వెంటనే చేతికఱ్ఱ పుచ్చుకుని వెళ్లి 'భడవా! నీ కేం పనే ఇక్కడ! పిలిస్తే రావూ' అని కేకలు వేసి, దాన్ని కూడా కట్టేశాడు.

ఇంతలో రామయ్యగారి తల్లి పాలచెంబులు తెచ్చి జగన్నాథాన్ని పిలిచింది. 'ఉండండి అమ్మా! గొడ్లను కట్టేస్తున్నాము' అని ఆవిడకు సమాధానం చెప్పి 'చిలకా! గోరింకా! ఇంకా రారేం?' అని కేక వేశాడు. అవి రోజూ అతడు పిలిచిన వెంటనే వచ్చేవి-ఎందుకో ఆరోజున రాలేదు. చీకటి పడ్డంచేత ఏమూలైనా మేస్తున్నాయేమోనని పాకంతా వెతికాడు. ఎక్కడా లేవు. ఇంకా వీధిలోనే నుంచున్నాయేమోనని ఒకసారి బైటికివెళ్లిచూచాడు. అక్కడా కనపడలేదు. అతనికి కంగారు పుట్టింది. ఆ ఆవులు రెండూ ఈనమోపైవున్నాయి. ఎక్కడ ఏమి ఇబ్బందిపడుతున్నాయో. అందులో గోరింకావు చాలా సాధువు. చంటిపిల్లలుకూడా దాని కాళ్లసందున పాకుతూ ఉంటారు. కాని చిలకావు చాలా పొగరుబోతు. అది పొలంలోనూ, ఇంటిదగ్గఱా మేసిన మేత చాలక తోటల్లో బడి మామిడికాయలు పాడుచేస్తూఉంటుంది. తనతోపాటు గోరింకనుకూడా తీసుకపోతూ వుంటుంది. రెండూ కలిసి ఏతోటలో పడ్డాయో. ఈనమోపైన ఆవులు, ఎవరు ఏం చేశారో! జగన్నాథంమనసు మనసులో లేకుండాపోయింది.

అసలెప్పుడూ అతను అంత అజాగ్రత్తపడే వాడు కాదు. కాని ఆనాడు తొందఱగా ఇంటికి వద్దామనే ఉద్దేశంతో వాటంతటవే వస్తాయిలే అనుకున్నాడు. అతని భార్య రామి నేడో రేపో ప్రసవించేటట్లు ఉన్నది. పెద్దతోడు లేనికారణంచేత ఆమె పుట్టింటికి పోలేదు. అదీకాక రామయ్యగారి తల్లి 'ఒరేయ్! జగన్నాథం! మీ ఆవిడపురుడుకూడా నేనే పోస్తానురా! ఒక నెలరోజులపాటు దొడ్లో పాకలో ఉండండి. నే నెట్లాగూ కోడలి పురిటికోసం ఉంటూనే ఉన్నానుకదా!' అని అసరా ఇచ్చిందికూడానూ! దీనికితోడు రామయ్యగారి భార్య సీతమ్మకూడా 'అవునురా! జగన్నాథం! నాకు చేతనైంది నేనూ చేస్తాను. నాకు తోడుగానూ ఉంటుంది. రామిని ఇక్కడే ఉంచు' అని మరీమరీ చెప్పింది. అమ్మగారూ, పెద్దమ్మగారూ ఇద్దఱూ గట్టిగా చెప్పేటప్పటికి జగన్నాథం కాదనలేకపోయాడు. కావలసిన తల్లి లేకపోయాక ఎక్కడ ఉంటే ఏం అని కూడా అనుకున్నాడు.

భార్య ఎట్లా ఉందో చూడాలన్న ఆతురతలో తొందఱగా రావడంలో ఆ రెండావులనూ ప్రత్యేక శ్రద్ధతో ఇంటిదాకా తోలుకరాలేకపోయాడు జగన్నాథం. మంది ఇంటికి మళ్లేటప్పుడు బళ్లలకంటే వెనకపడి ఈ ఆవులు రెండూ నెమ్మదిగా వస్తున్నట్లు ఒకటిరెండుమాట్లు చూశాడు. వాటంతటవే వస్తాయి గదా అనుకుంటే అవి రాలేదు. తొలిచూలు భార్యను కనిపెట్టుకుని ఉండవలసిన బాధ్యతకంటే ఆ రెంటి విషయమైన ఆదుర్దా అతనికి ఎక్కువయింది. తొందఱ తొందఱగా పాలుతియ్యడం, మేతవెయ్యడం మొదలైన పనులన్నీ ముగించాడు. ఒకసారి దొడ్లోకి పోయి భార్యను చూచి వచ్చాడు. సీతమ్మ తన భార్యదగ్గఱ ఉండి చెయ్యవలసిన సహాయం చేస్తోంది. భార్యవిషయమై తనకు ఏమంత ఆదుర్దా పడవలసిన అవసరం లేదనుకున్నాడు. బైటికివచ్చేటప్పటికి బాగా చీకటి పడిపోయింది.

అప్పుడే రామయ్యగారి తల్లి ఏ పనిమీదో బైటికి వచ్చి వీధివసారాలో నిలబడిఉన్నది. చిలకా గోరింకా ఇంటికి రాలేదనీ, వాటిని వెతుక్కువస్తాననీ జగన్నాథం ఆవిడతో చెప్పాడు. 'వాటంతటవే వస్తాయిరా! అన్నం తినిపోదువుగానిలే! రామి కష్టపడుతోంది! కాసేపు ఉండు' అని ఆవిడ చెపుతున్నా జగన్నాథం వినిపించుకోక తలకు గుడ్డచుట్టి, కఱ్ఱ చేత్తో పుచ్చుకుని బయలుదేరాడు.

ఊరు సద్దుమణగలేదుకాని చీకటిదట్టంగాకమ్ముకున్నది. ఇళ్లల్లో సందడేకాని వీధుల్లో ఎక్కడా సందడి వినపడటంలేదు. అక్కడక్కడమాత్రం కుక్కలు మొఱుగుతున్నాయి. ఊళ్లో దారివెంబడిఆసందులోనూ ఈసందులోనూఆగిపోయాయేమోనని వెతుక్కుంటూనే వెళ్లాడు. ఎక్కడా కనపడలేదు. ఊరుదాటి పొలం

పోయే రోడ్డు అందుకునేటప్పటికి రోడ్డుకు రెండు వైపులా ఉన్న చెట్లలో కీచురాళ్లు గూబసుంయిమని పిస్తున్నాయి. కన్నులు పొడుచుకున్నా ఎదుటివస్తువు కనబడకుండాచేస్తోంది చీకటి. చెప్పుల కిర్రూ, చేతిలో కఱ్ఱా ఇవి రెండూ తోడుగా తప్పకుండా దొరుకు తాయనే ఆశతో ముందుకు సాగిపోతున్నాడు జగన్నాథం. పదిగజాల దూరం నడిచేటప్పటికి రోడ్డు పక్కతోటకంచెవెంబడి బుస్సలువినపడ్డాయి. ఆవు లేమో అని ఒకనిమిషం నిలబడి నిదానంగా చూశాడు. కంచెలో మిలమిలా మెఱుస్తూ తాచుపాము మెలికటి పాకుతోంది. తలగుడ్డ తీసి వంగి నమస్కారం పెట్టి ముందు నడిచాడు. ఇంతలో ఎవరో ముందువస్తున్నట్టు అలికిడిఅయింది. 'ఎవరు వారు'అని జగన్నాథం కేక వేశాడు. అతని కేక గుర్తుపట్టి ఆ వచ్చేమనిషి 'జగన్నాథం!'అని ప్రతికేక వేశాడు.

'అవును. వెంకన్నా!'

'ఆ! జగన్నాథం, ఇంతరాత్రి ఎక్కడికిరా?'

'మా చిలకావూ, గోరింకావూ ఇంటికిరాలేదు. వాటికోసం బయలుదేరాను!'

'సాయంత్రం మా అంట్లదొడ్లో పడితే బైటికి తోలి మీమందలో కలిపానురా!'

'అవునురా! అప్పుడు నేనూ చూశాను. ఆ తర్వాతే నేనెప్పుడు కనుమలిచానో! అవి తప్పించుకు పోయాయి. ఇంటికి రాలేదు.'

'సురువుల తోటలో ఏమైనా పడ్డాయేమో! ఈవమోపై వున్నాయికూడా! త్వరగా పోయి వెతుకు' అని అంటూ దగ్గఱకు వచ్చి, జగన్నాథం అడగగా చుట్ట ముట్టించిఇచ్చి వెంకన్న తన దారిని పోయాడు. వెంకన్న ఇచ్చిన చుట్ట కాల్చుకుంటూ సాధ్యమైనంత దూరం కళ్లతో గాలించిచూస్తూ, ఎక్కడ ఏమాత్రం అలికిడి అయినా ఆవులేమో అని ఆగుతూ,వాటికోసం తహతహపడుతూ నడుస్తున్నాడు జగన్నాథం. సురువుల తోట సమీపించింది. అదే ఊరికి దగ్గఱలో ఉన్న మంచితోట. సాధారణంగా ఊరివాళ్లు ఎప్పుడు మనసుపుట్టినా అక్కడకు పోయి పడుకుంటూ ఉంటాయి. ఆ తోటలో చెట్లు ఏపుగా పెరిగి దట్టంగా ఉన్నాయి. లోపలికి పోయి ఏమూలని వెతుకుతాడు? నాలుగువైపులకూ వినబడేటట్లు పేర్లు పెట్టి పిలిచాడు. ఎక్కడా సమాధానం రాలేదు. అక్కడ లేవని నిశ్చయంచేసుకుని ముందుకు సాగాడు. మల్రాజువారి తోటా, రంగంచెలికా, ఎడ్లబీడూ ఒకొక్కటే వెతుక్కుంటూ వెళ్లాడు. ఎక్కడా కనపడలేదు. కొంసేపు నిలబడి ఆలోచించాడు. బందిలి దొడ్డి చూడటం మఱచిపోయానే అనుకున్నాడు. ఆ ఆవులను రెంటినీ ఎఱిగిఉన్నవాళ్లు వాటిని ఎప్పుడూ బందిలిదొడ్లో పెట్టరు. ఆసంగతి అతనికి తెలుసును. అయినా అనుమానం. ముందుకుపోయి చూచి,దొరక్క పోతే వచ్చేటప్పుడు చూద్దాం లే అనుకున్నాడు. తాళ్లతోపు దగ్గఱకు వచ్చాడు. దాన్ని పగలు చూడ్డానికే భయంవేస్తుంది. రాత్రిళ్లు చెప్పనే అక్కర్లేదు. చింపిరి దయ్యాల్లాగా తలలు ఎగబోసుకుని తాళ్లు భయంకరంగా కనపడతాయి. జగన్నాథంమనసులో ఒక చెడు ఊహ తోచింది. ఆ తోపులో సాధారణంగా పురుగుముట్రడంచేత పశువులు చస్తూఉంటాయి. జగన్నాథం కొయ్య అయిపోయాడు. కొంసేపు ఉండి తెలివి తెచ్చుకుని తనకు చెడ్డ ఊహ తోచినందుకు దేవుడికి దణ్ణంపెట్టి లెంపలు వాయించుకుని కఱ్ఱతో గడ్డిమట్టలు గీసుకోకుండా పక్కకి తోసుకుంటూ లోపలికి వెళ్లాడు. చీకటిలో ఆ తుప్పా ఈ తుప్పా ఆవుల్లా కనబడితే పేరుపెట్టి పిలిచాడు. ఏమీ సమాధానం రాలేదు. ఇక లాభం లేదని వెనక్కి తిరిగి దారివెంబడి బడి చెఱువువైపుకు నడిచాడు. అక్కడ పరిమళ్లల్లో పచ్చిక ఉంటూఉండడంచేత సాధారణంగా పశువులు ఆగుతూఉంటాయి. శ్రద్ధగా వెతికాడుకాని అక్కడా కనపడలేదు. ఇక ఏం చెయ్యడానికీ తోచలేదు. ఎక్కడకు పోయి ఉంటాయో అని నిలబడి ఆలోచిస్తున్నాడు.

ఆ సమయంలో అంభా అని అరుపు వినబడింది. ఆ అరుపు దేనిదో గుర్తుపట్టాడు జగన్నాథం. చిలకా అని కేక వేశాడు. దూరంనుంచి చిలక మళ్లీమళ్లీ అరుస్తూ చెఱువుకు వచ్చే వాగుపాటి డొంకలోనుంచి పరుగెత్తుకువచ్చింది. జగన్నాథం దగ్గఱకు వచ్చి అరుస్తూ

నుంచుంది. చిలక ఉన్నచోట గోరింకకూడా ఉంటుందని జగన్నాథం గోరింకా అని కేక వేశాడు. గోరింక రాలేదు. చిలక అరుపు మానలేదు. అతని కేమీ అర్థం కాలేదు. 'పోనీ, చిలకనైనా ఇంటికి తోలుకుపోదాం. ఇది కనబడకపోవడం చూసి గోరింక దానంతటదే రావచ్చు' అని ఆలోచించాడు. కఱ్ఱతో అదిలించి దాన్ని ఇంటివైపుకి తోలాడు. అది నాలుగడుగులు వేసి ఆగిపోయింది. అరుపు మానలేదు. డొంకవైపు చూస్తుంది. ఏం చేస్తుందో చూద్దామని కఱ్ఱ తన వెనక పెట్టుకుని నిలబడ్డాడు. చిలక ఏదో ఉద్రేకంతో డొంకవైపుకు పరుగెత్తి అంభా అంభా అని అరుస్తూ జగన్నాథంవంకకూ, డొంకవైపుకూ అటూ ఇటూ చూస్తూ పరుగెత్తడం మొదలుపెట్టింది. డొంకలో గోరింక ఉందేమో అని అనుమానపడి ఆవైపు నడిచాడు జగన్నాథం. చిలక అతన్ని వెంబడించింది. అరుపు మానివేసింది. జగన్నాథం ఆశ్చర్యపడుతూ నడుస్తున్నాడు. ఆడొంకలో ఫర్లాంగు దూరంలో ఒక మఱ్ఱిచెట్టు ఉంది. ఆచెట్టు చూపు మేరదూరంలో కనబడుతోందనగా చిలక మళ్లీ అరవడం మొదలుపెట్టింది. జగన్నాథం వెనక్కి తిరిగి చూశాడు. చిలక అతన్ని దాటి ఆచెట్టుకిందికి పరుగెత్తుకువెళ్లి నిల్చుంది. జగన్నాథంవంక చూస్తూ అరుస్తోంది. చీకట్లో అతనికి ఆ అరుపు వినపడుతోంది తప్ప ఏమీ కనపడటంలేదు. ఇంకో కొంచెం దగ్గఱకు పోగా ఆ చెట్టుకింద గోరింక ప్రసవవేదన పడుతోంది. జగన్నాథం అక్కడకు పోయి పక్కనున్న రాతి మీద కూర్చున్నాడు. గోరింక పడుకుంటోంది, లేస్తోంది, రొప్పుతోంది, ఆయాసపడుతోంది, ఆపసోపాలు పడుతోంది. చిలక దాని బాధ చూడలేక అరుస్తోంది. జగన్నాథంమనస్సు ఇంటివైపు పరిగెత్తింది. తనభార్య ఎంత కష్టపడుతోందో! పరుగెత్తుకుని వెళ్లిపోదామనిపించింది. కాని మళ్లీ ఆలోచించాడు. తన భార్యను చూసేందుకు పెద్దమ్మగారున్నారు, సీతమ్మగారున్నారు. ఈఅడవిలో నోరులేని ఈ ఆవును చూసేందుకు ఎవరున్నారు? భగవంతుడు అని తోచిందికాని అంతమాత్రంతో అతనికి ధైర్యం రాలేదు. కూర్చున్నవాడు లేవలేకపోయాడు.

ఇంతలో గోరింక అదివఱకునుంచీ నుంచున్నదల్లా పడుకుంది. కాసేపు బుసలుకొట్టింది. కాళ్లు జాపి మెడ నేలమీద ఆన్చి తన్నుకున్నది. మళ్లీ వెంటనే కాళ్లుముడిచి తల ఎత్తి నురుగులుకక్కుకుంటూ ఆయాసపడుతోంది. చేసేదేం లేకపోయినా జగన్నాథాని కేం తోచలేదు. పక్కనున్న కఱ్ఱ చేత్తో పుచ్చుకునుంచుని సావకాశంగా దానివంక చూస్తున్నాడు. చిలక గోరింకవంక సానుభూతితో చూసి ఓదారుస్తోంది. ఇంతలో గోరింక లేచినుంచుని సకల ప్రయత్నాలూ చేసింది. అతికష్టమ్మీద దూడ బయటపడింది. జగన్నాథం చేత్తో పట్టుకుని నేల మీద పెట్టాడు. పుట్టింది పెయ్యదూడ అయినకారణం చేత భూమిమీద పడీపడటంతోనే లేచి నుంచుంది. అది ఎక్కడిసంబంధమో. గోరింక దాని శరీరం యావత్తూ తడి ఆరేటట్లు నాకింది. ఇంతలో జగన్నాథం దూడగిట్టలు గిల్లాడు. ఆవునోట్లో పెట్టాడు. అది ఆప్యాయంగా తినేసింది. దూడముట్టె తల్లిపొదుగు దగ్గఱకు చేర్చి కుడిపించాడు. ఆవు మాయవేస్తుందేమోనని ఒక గంటసేపు చూశాడు. కాని వెయ్యలేదు. దూడను మెడమీద వేసుకుని ముందునడవడం మొదలుపెట్టాడు. దూడను చూచి గోరింకా, గోరింకను చూసి చిలకా అంభా అంభా అని అరుస్తూ అతనివెంబడి బడి వచ్చాయి.

అప్పటి కప్పుడే తెల్లవారుజాము నాలుగు అవుతోంది. అతనికి తన భార్యను గుఱించిన ఆతురత ఎక్కువైంది. 'తాను ఇంటికి వెళ్లేటప్పటికి తన భార్య ప్రసవించిఉంటుంది. రాకరాక పదిఏళ్లకు వచ్చిన కాన్పు- తప్పకుండా మగపిల్లవాడు పుట్టిఉంటాడు. వాడు తన వంశాన్నీ తన్నూ ఉద్ధరించి సుఖపెడ్తాడు. తన భార్య కొంచెం సుస్తీమనిషి. సుఖంగా ప్రసవించిందో లేదో. ఏం కష్టపడిందో. తా నింట్లో లేకుండా పోవలసివచ్చింది.' అని ఆలోచిస్తూ తొందరతొందరగా నడిచాడు.

ఇంటికి వచ్చీరావడంతోనే దూడను దింపాడు. భార్యను చూద్దామని దొడ్లోకి వెళ్లబోయాడు. దొడ్లో పాకలో ఇంటిల్లిపాదీ కిటకిటలాడుతున్నారు. రామ

య్యగారి తల్లి అది తీసుకురా, ఇది తీసుకురా అని సీతమ్మకు చెపుతోంది. ఓపలేని మనిషిఅయినా సీతమ్మ, పాపం, అటు పిల్లల్ని సర్దుకుంటూ, ఇటు రామికి కావలసినవి తెచ్చియిస్తూ శ్రద్ధగా సేవచేస్తోంది. మధ్యమధ్య రామిమూలుగులు వినిపిస్తున్నాయి. మంత్రసాని 'మీరంతా దూరంగా ఉండండి బామ్మగారూ' అని రామయ్యగారి తల్లితో అంటోంది. జగన్నాథం వచ్చిన సంగతీ, గోరింకావు ఈనిన సంగతీ రామయ్యగారి తల్లికి తెలిసింది. దొడ్లోకి రాబోతున్న జగన్నాథాన్ని చూచి 'మీ ఆవిడకు నొప్పులు వస్తున్నాయి. మేమంతా ఇక్కడే ఉన్నాం. నువ్వేమీ ఆదుర్దాపడవద్దు. ఆవు మాయవెయ్యలేదుటగా. దాని సంగతి చూసుకో! అవసరమైనప్పుడు పిలుస్తాములే' అన్నది.

ఆవిడమాట విని జగన్నాథం వెనక్కి తిరిగి వచ్చాడే కాని అతని మనసులో దిగులుగానే ఉన్నది. రాత్రి ప్రసవించిఉంటుందనుకున్న తన భార్య ఇంత వరకూ ప్రసవించలేదు. చాలా కష్టపడుతున్నట్లు తెలుస్తోంది. దైవము ఎట్లా అనుగ్రహిస్తాడో! ఒక పక్క తన భార్య ప్రసవవేదన పూర్తికాలేదు; మరో పక్క గోరింకావు మాయవెయ్యలేదు. ఇవి రెండూ అతని మనసులో చాలా బాధపెడుతున్నాయి. ఏం చెయ్యడానికీ తోచలేదు. బాగా తెల్లవారిపోయింది. గొడ్లను బుడ్డాళ్ల కప్పగించి తాను ఇంటిదగ్గరే ఉండిపోయాడు. చిలకావునుగూడా అన్నిటితో తోలాడు కాని అది పొలం వెళ్లక మళ్లీ వెంటనే తిరిగివచ్చి గోరింకావును కనిపెట్టుకు కూర్చుంది.

భార్యను గురించిన ఆతురతలో జగన్నాథం ఒకవిషయం మరచిపోయాడు. గోరింకావుకు కొత్త వడ్లు పెట్టలేదు. అది ఇంకా మాయ వెయ్యలేదు. తాను చేసిన పొరపాటుకు మనసులో నొచ్చుకుంటూ త్వరగా పోయి కొత్తవడ్లు చేటలో పోసితెచ్చి దాని ముందు పెట్టాడు. అది ఆకలితో తినబోయిందిగాని నోరు తెరవలేకపోయింది. జగన్నాథం ఆదుర్దాపడి దాని మెడవరాలు రుద్దుతూ పక్కన కూర్చున్నాడు. గోరింక నెమ్మదిగా నోరుతెరచి వడ్లు తిన్నది. తిని చాలాసేపయింది కాని మాయ వెయ్యలేదు. జగన్నాథం పాకలో గుంజకు ఆనుకుని దిగాలుపడి కూర్చున్నాడు.

ఉదయంనుంచీ గోరింక పడుతున్న బాధ ఒక్క భగవంతుడికే తెలియాలి. ఈనడానికి ఎంత ప్రయత్నం చేసిందో మాయ వెయ్యడానికి అంత ప్రయత్నం చేస్తోంది. కాని అది బైటపడడం లేదు. మాయ బైట పడనంతసేపూ కడుపులో బాధ బాధగానే ఉంటుంది. నోరు లేని జంతువు అవడంచేత బైటికి చెప్పుకోలేకుండా ఉన్నది. కాని, అదే గనక మనిషి అయితే ఆపాటికి ఊరంతా పోగుపడేటట్లు పెడబొబ్బలు పెట్టేది. గోరింకముఖంలో కళాకాంతులు పూర్తిగా పోయాయి. తన కాటుక కళ్ల వెంబడి కన్నీరు ముకుపుటాలదాకా ప్రవహించేటట్లు ఏడుస్తోంది. ఒకసారి దూడను మూచూస్తుంది. మరోసారి చిలకమూతికి తన మూతి ఆనుస్తుంది. బాధ భరించలేక అరుస్తుంది. చివరకు తాళలేక తోక విరామంలేకుండా తిప్పుతుంది. దూడను పొదుగుదగ్గరకు రానివ్వదు. పక్క చూపులు చూస్తూ మెడ ఎత్తి భగవంతుణ్ని ప్రార్థిస్తుంది. ఏంచేస్తే ఏం లాభం? దాని బాధ తగ్గలేదు. కాళ్లు వణకడం ప్రారంభించాయి. నేలమీద సరిగా ఆన్చి నిలబడలేకపోయింది. అతికష్టమ్మీద కాళ్లు ముడిచి కూర్చుంది. తల నేలకు ఆన్చి మట్టిలో అర్ధచంద్రాకారంగా అటూ ఇటూ ఆడిస్తూ బుస్సలు కొట్టి నురుగులు గ్రక్కుకుంటోంది. జగన్నాథం ఇదంతా చూస్తూనే ఉన్నాడు. దాని బాధ చూడలేక మొహం వంచుకుని దుఃఖిస్తున్నాడు. చిలక దానికి ఎదురుగా కూర్చుని స్నేహితురాలి బాధచూచి భరించలేక దుఃఖిస్తోంది.

గోరింక కాళ్లు వణికి కింద కూర్చోవడం చూసి జగన్నాథం భరించలేకపోయాడు. దానికి ఏం చికిత్స చెయ్యాలో అతనికి తెలిసింది కాదు. ఇంతసేపూ భగవంతుణ్ణి ప్రార్థిస్తూ కూర్చున్నాడు. ఒకవంక గోరింకకోసమూ, మరొకవంక భార్యకోసమూ. అతని ప్రార్థనలు భగవంతుడు ఆలకించినట్లు తోచదు. ఇద్దరికీ ఉపశాంతి కలగడం లేదు. అతని మనసు చెల్లాచెదరై పోయింది. కాసేపు గోరింకవంక సానుభూతితో దీన దృక్కులు ప్రసరించి చూస్తాడు. ఇంతలో భార్య

సంగతి కనుక్కువద్దామని దొడ్లోదాకా వెళ్తాడు. అక్కడ ఏ రామయ్యగారో సీతమ్మగారో కనిపిస్తారు. వాళ్లు అందరూ జాగ్రత్తగా చూస్తున్నప్పటికీ తాను అక్కడకు పోతే ఏమనుకుంటారో అని వెనక్కి తిరిగివస్తాడు. మళ్లీ గొడ్లపాకలో నుంచుని గోరింక వంక చూస్తాడు. ఏ గుంజనో ఆనుకుని మొహం కప్పుకుని ఏడుస్తాడు. పని లేకుండానే పదిమాట్లు అటూ ఇటూ తిరుగుతాడు. తాను ఏం చేస్తున్నదీ జగన్నాథానికి తెలియడం లేదు. అతనికి గంగవెఱ్ఱులెత్తినట్లయింది.

ఈ స్థితిలో దొడ్లోనుంచి 'అమ్మయ్యా! దేవుడు రక్షించాడు. ఎంత కష్టపడిందో బిడ్డ. మగపిల్లాడు పుట్టాడు. మూడుమూర్తులా జగన్నాథమే!' అంటూ రామయ్య గారి తల్లిమాటలు వినపడ్డాయి. అతడు ఉండబట్టలేక దొడ్లోకి పరుగెత్తుకెళ్లి భార్యను చూచాడు. ఆమె కింకా స్మృతి రాలేదు. బలహీనతలో బాధపడలేక మూర్ఛ పోయింది. రామయ్యగారు అప్పుడే మంత్రసాని 'ఎవరూ అక్కర్లే' దంటున్నా వైద్యుడికోసం పరుగెత్తాడు. ఇంట్లో ఆడవాళ్లూ మగవాళ్లూ అంతా హడావిడిగా తిరుగుతున్నారు. జగన్నాథానికి మనస్సు దిమ్మెక్కిపోయింది. నిశ్చేష్టుడై నిలబడ్డాడు. రామయ్యగారి తల్లి అతని వాలకాన్ని చూసి 'ఎందుకురా అంత అధైర్యపడతావు? నీ భార్యకు ఏమాత్రమూ లోటు రానివ్వను. నువ్వు ఏమీ బెంగపెట్టుకోక వాకిట్లో ఉండు. వెళ్లు. ఇక్కడ ఉండవద్దు. గోరింక ఎట్లా ఉందో చూడు' అని ధైర్యం చెపుతూ హెచ్చరించింది. ఎవరిమాటా లెక్కలేదు కాని రామయ్యగారి తల్లి మాట అంటే జగన్నాథానికి అపరిమితమైన గౌరవం. నిద్రలో అయినా ఆవిడ మాట విని మేలుకుంటాడు. ఆవిడ ఈ హెచ్చరింపు అంత నిశ్చేష్టతలోనూ అతనిలో చలనం కలిగించింది.

జగన్నాథం అక్కడినుంచి వచ్చి గోరింకదగ్గిర నిలబడ్డాడు. కాని అక్కడ అట్టే సేపు ఉండలేక పోయాడు. కాసేపు భార్యదగ్గిరా, కాసేపు ఆవుదగ్గిరా కాలుగాలిన పిల్లిలా తిరుగుతున్నాడు. అతను చేసే ఏపనికీ అర్థం లేకుండా పోయింది. చిలకావు పాకలో గోరింకను చూసి మరికే అరవడం; గోరింక దూడ ఆ అరుపు విని తానుగూడా అరవడం; దానితో పాకలో ఉన్న మిగిలిన పాడిఆవుల లేగదూడలన్నీ అరవడం; దొడ్లో పాకలో అప్పుడే బైటపడ్డ శిసెదు వెధవ గొల్లున గోలపెట్టడం; వాడిఉన్న తలిదండ్రుల ముఖాలు చూచి సీతమ్మ ముగ్గు రాడపిల్లలూ గోలపెట్టడం—ఇల్లూ వాకిలీ అంతా అలగోల బాలగోల అయింది. జగన్నాథం ఈ అరుపుల్లో ఎవ్వరికీ వినబడని ఏడుపు ఏడుస్తూ అటూ ఇటూ తిరుగుతున్నాడు. ఇంతలో రామయ్యగారు వైద్యుణ్ణి వెంటబెట్టుకు వచ్చారు. ఆసమయంలో జగన్నాథం దొడ్లో పాకకు కొంచెం దూరంగా నుంచుని ఉన్నాడు. అతన్ని అక్కడ ఉండవద్దని కేకలు వేశారు. జగన్నాథం రాలేక రాలేక వాకిట్లోకి వచ్చాడు.

గొడ్లపాకలో కొనప్రాణంతో కొట్టుకుంటున్న గోరింకను చూస్తూ నుంచున్నాడు. జగన్నాథం దాని దగ్గరకు పోయి నేలమీద ఆన్చిన దాని మోర ఎత్తి పట్టుకున్నాడు. ఇందాకటినుంచీ పక్కచూపులు పెట్టిన గోరింక ఒకసారి తెలివిగా చూసింది. జగన్నాథం కొంచెం పక్కకు జరిగి దూరంగా కూర్చున్నాడు. గోరింక లేవడానికి ప్రయత్నం చేసింది. జగన్నాథం వెనకపట్టి ఎత్తాడు. కష్టమ్మీద గోరింక లేచి నుంచుంది. అది లేవడం చూసి చిలకగూడా లేచి నుంచుంది. లేగదూడల దగ్గరకు పోయిన గోరింకదూడ తల్లి దగ్గరకు పరుగెత్తుకువచ్చి పొదుగులో మూతి పెట్టింది. గోరింక ఏమీ అనలేదు. కాని దాని కాళ్లు గజగజా వణుకుతున్నాయి. కళ్లవెంబడి నీళ్లు బొటబొటా కారుతున్నాయి. రెండడుగులు ముందుకు వేసింది. చిలకకళ్లలో కళ్లుపెట్టిచూసింది. చిలక గోరింక దగ్గరకు వచ్చింది. దాని మెడమీద తన మెడవేసి కాసేపు నుంచుంది గోరింక. ఇంతలో దూడ అరిచింది. గోరింక దూడవైపుకు తిరగబోయిందిగాని తిరగలేకపోయింది. జగన్నాథం దూడను తల్లిదగ్గరకు తీసుకువెళ్లాడు. కదలని ముట్టెతో బిడ్డను ఒకసారి మూచూసింది. చిలకవంక జాలిచూపులు చూసింది. తనముట్టె చిలకముట్టెకు ఆన్చి చనిపోయేవారు తమకు

ఇష్టమైనవారితో కడసారిమాటలు చెప్పేటట్లు దానితో ఏమిటో చెప్తున్నట్లు సరిచుంది. దాని కాళ్లు వణకడం ఎక్కువయింది. పొట్ట నిమిషనిమిషానికీ ఊరిపోతోంది. ఒకసారి చిలకవంకా దూడవంకా తన సర్వశక్తులతోటీ చూసి గోరింక నేలమీద కూలబడింది. కాళ్లు బారజాపి, కళ్లు వెనక్కు తిప్పి, మోర నేలమీద పడవేసి, ముక్కునుండి నురుగులు కారుతూ ఉండగా గోరింక కడసారిఊపిరి విడిచింది. కిందబడ్డ గోరింకను చూసి చిలక దుఃఖంతో అరుస్తోంది. అమాయికంగా గోరింకదూడ తల్లికుపక్క స్తనాల్లో ముట్టె పెడుతూ తీస్తూ అరుస్తోంది. జగన్నాథం పక్కన గొంతుకు కూర్చుని తల వంచుకుని ఏడుస్తున్నాడు.

ఇంతలో రామయ్యగారు వైద్యుడితోసహా బైటికి వచ్చారు. ఆయన పాకలో చనిపోయిన ఆవు వంక చూసి ఏడుస్తున్న జగన్నాథాన్ని చూడలేకపోయాడు. జగన్నాథం ఎవరివంకా చూడలేదు. వైద్యుడు వెళ్లిపోయాడు. రామయ్యగారు పాకలోకి వెళ్లి జగన్నాథంపక్కన కూర్చుని అతని బుజాలమీద చేతులు వేశాడు. అతనికి తెలియలేదు. రామయ్య అతని వెన్ను నిమురుతూ 'ఏం చేస్తాము! మనకు దక్కకుండా పోయింది. పిల్లవాడు కులాసాగానే ఉన్నాడు' అని కళ్లనీళ్లతో కంఠం రుద్ధంకాగా అన్నాడు. జగన్నాథం ఈమాటలు విని పీడకలకన్న వాడిలాగా అదిరిపడి, కళ్లు తెరిచి, ఎదురుగుండా ఏడుస్తున్న రామయ్యను గంభీరంగా ఒకసారి చూసి అతన్ని కావిలించుకుని గొల్లుమని ఏడవడం మొదలుపెట్టాడు. రామయ్య తన సర్వశక్తులా ఓదార్చాడు. ఆ ఓదార్పు జగన్నాథం దుఃఖానికి ఉపశమనం తేలేదు. కాని చనిపోయిన తల్లిని విడిచి తన్ను సమీపించిన దూడను చూచేటప్పటికి అతని గుండె తరుక్కుపోయింది. దాన్ని దగ్గరికి తీసుకుని కావిలించుకుని ఏడ్చాడు. రెండు చేతుల్తో దాన్ని ఎత్తుకునిపోయి దొడ్లో ఏడుస్తున్న పిల్లవాణ్ణి సముదాయిస్తున్న పెద్దమ్మగారి ముందు పెట్టి 'ఎట్లాగమ్మా బ్రతికేది?' అంటూ పెద్దపెట్టున ఏడ్చాడు. ఆవిడ 'నాయనా! పాలుపోసినవాడే నీరు పోస్తాడు' అంటూ ఓదార్చింది.

౨

రెండురోజులైంది. జగన్నాథం గుండె రాయి చేసుకుని మొండిధైర్యంతో తిరుగుతున్నాడన్నమాటేగాని అతని విచారం ఏమాత్రమూ తగ్గలేదు. అనుక్షణమూ భార్యనూ గోరింకనూ తలుచుకొని దుఃఖిస్తాడు. దూడను దగ్గరికి తీసుకుని ఒళ్లంతా చేత్తో నిమురుతూ కూచుంటాడు. అతని హృదయంలో తన భార్యకూ గోరింకకూ సమానమైన స్థానమిచ్చాడు. తన హృదయాన్ని పంచుకున్నవాళ్లు ఇద్దరూ చనిపోయారు. తల్లిలేని దూడనూ, తల్లిలేని తన బిడ్డనూ మనసులో ఒకేవిధంగా చూసుకుని పొంగిపొంగి ఏడుస్తాడు.

జగన్నాథందుఃఖం అందరినీ కరిగించింది. అతని కష్టభారాన్ని రామయ్యగారి తల్లి అందరికంటే ఎక్కువగా పంచుకున్నది. రామయ్యగారి కుటుంబానికీ జగన్నాథం కుటుంబానికీ ఒకవిధంగా సన్నిహితసంబంధం ఉన్నది. రామయ్యగారి పూర్వులూ, జగన్నాథంపూర్వులూ ఆవూళ్లో ఇరుగుపొరుగున ఉంటూఉండేవారు. వారి ఇద్దరి తాతలూ కలిసి మందల్ని పెంచుకుంటూఉండేవారు. ఒకసారి మేత తక్కువైనప్పుడు జగన్నాథంతాత తన మందను తన బావమరిది ఊరుకు తోలాడు. అక్కడ బాగా పచ్చిక బీళ్లూ, తుమ్మఅడవులూ ఉన్నాయనే ఆశతో. కాని దైవికంగా గాళ్లరోగం తగిలి అతని మంద అంతా నశించింది. అప్పటినుంచీ వారి కుటుంబం తేరుకోలేదు. ఉన్న పదిపదిహేను గొడ్లనూ రామయ్యగారి తండ్రికి అప్పగించి జగన్నాథంతండ్రి ఆయనదగ్గరే ఉండేవాడు. బ్రతికిచెడ్డవాళ్లు అవడంచేత రామయ్యగారి కుటుంబం జగన్నాథంకుటుంబాన్ని గౌరవంగానే చూచేది. తండ్రి పోయాక జగన్నాథం రామయ్యగారి దగ్గరే పాలేరుగా చేరాడు. జగన్నాథం పేరుకు పాలేరు అన్నమాటేగాని రామయ్యగారి ఆస్తిమీది అజమాయిషీ అంతా అతనిదే! రామయ్యగారుకూడా జగన్నాథంతో చెప్పకుండా ఏపనీ చెయ్యడు.

పూర్వకాలపు మనిషి అవడంచేత రామయ్యగారి తల్లికి జగన్నాథం అంటే ఎంతో జాలి. మనం

కాకపోతే అతని కష్టసుఖాలు అడుగునేది మరి ఎవరు అన్న ఉద్దేశంతోనే ఆవిడ ఎల్లప్పుడూ అతన్ని చూచేది. ఆవిడ ముసలితనంలో పిల్లతల్లి కావలసి వచ్చింది. జగన్నాథంకుఱ్ఱవాణ్ని వేయికళ్లతో రక్షిస్తోంది. ఒళ్లో పడుకోబెట్టుకుని ఆవుపాలు పోస్తుంది. వాడు తాగడు. పోసినవి కక్కుతుంటాడు. బలవంతాన పోసి ఏకోవిధంగా ఆ మహాతల్లి వాడి ప్రాణం కాపాడుతోంది. కాని వాడు ఊరుకుండడం చాలా అసాధ్యమైపోతోంది. ఎప్పుడూ గొల్లున గోలపెడుతూ ఉంటాడు. ఆపేక్షతో వక్షానికి అదుముకునే తల్లి లేకపోయాక ఏడవక ఏం చెయ్యగలడు? ఎల్లప్పుడూ వాణ్ని కనిపెట్టుకుని ఉండడానికి ఆవిడకు తీరదు. రామయ్యగారి భార్య నేడో రేపో ప్రసవించేటట్లు ఉన్నది. ఒకపక్క ఆవిణ్ని కనిపెట్టుకుని ఉండాలి. మరొకపక్క ఇంటిల్లిపాదికీ వండిపెట్టాలి. అన్నిటికంటే ఎక్కువగా ఈ దిక్కుమాలిన వాణ్ని రక్షించాలి. ఈ పరోపకార మహాయజ్ఞంలో ఆవిడ తాను వహించిన దీక్షకు అవధి దాటుతున్నట్టు కనపడ్డా సహించుకుని చేస్తోంది. జగన్నాథానికి ఆవిడ యెడల తన కృతజ్ఞత ఎట్లా తెలుపుకోవాలో తెలియక మనస్సులో నమస్కరిస్తూ ఉంటాడు నిత్యమూ.

రామయ్యగారి తల్లి జగన్నాథంకొడుకును ఎట్లా పెంచుతోందో గోరింకదూడను అట్లా పెంచుతున్నాడు జగన్నాథం. పాడి ఆవుల పాలు తీసి కొద్దిగా దూడకు పోసి మిగిలినవి కుఱ్ఱవాడికోసం ఇంట్లో ఇస్తాడు. మాతృవక్షంలో తల దాచుకుని స్తన్యం గ్రోలితే వచ్చే బలం పోతపాలతో వస్తుందా. గోరింకదూడా, జగన్నాథంకొడుకూ ఒకేవిధంగా నలతగా ఉంటున్నారు. భార్య పోయిన దగ్గఱనుంచీ జగన్నాథం పొలంవెళ్లడం మానివేశాడు. గోరింక పోయిన దగ్గఱనుంచీ చిలక మేత మెయ్యడమే మానివేసింది. అది ఎప్పుడూ గోరింకదూడను నాకుతూ ఇంటిదగ్గరే ఉంటుంది. జగన్నాథం తన పుత్రవాత్సల్యం అంతా కొడుకుదగ్గఱ చూపడానికి అవకాశం లేక గోరింకదూడను సంరక్షించడంలో చూపుతున్నాడు. లేతపచ్చిక పరకలు ఏరితెచ్చి దూడకు తినడం నేర్పుతాడు ఎప్పుడూ గొడ్లపాకలో దానిదగ్గరే కూచుంటాడు: తల్లిలేని తన బిడ్డను తలుచుకొని ఏడుస్తూ.

ఆరోజున రామయ్యగారి ఇంట్లో మూడురోజుల కింద ఎంత హడావిడి అయిందో అంత హడావిడీ అయింది. కోడలి పురుటిగదిలో చాప వేసి గుడ్డ వేసి తల్లిలేని జగన్నాథంకుఱ్ఱవాణ్ని పడుకోబెట్టింది రామయ్యగారి తల్లి. ఒకపక్క వాణ్ని, ఒకపక్క కోడల్ని చూస్తూ ఇద్దఱికీ పరిచర్య చేస్తోంది. భార్య సీతమ్మ కష్టపడడం విని సహించలేక రామయ్య అటూ ఇటూ పచార్లుచేస్తున్నాడు వసారాలో. సీతమ్మ ముగ్గురు ఆడపిల్లలూ గదిగుమ్మందగ్గఱ నుంచుని అమ్మా అమ్మా అంటున్నారు. జగన్నాథం ఆపనిమీదా ఈ పనిమీదా అటూ ఇటూ తిరుగుతున్నాడు. మొదట్లో కొంచెం కష్టపడ్డా సీతమ్మ సుఖంగానే ప్రసవించింది. మగపిల్లవాడు పుట్టి కెవ్వుమన్నాడు. ఆకేక విని రామయ్య అబ్బాయి అబ్బాయి అంటూ గంతులువేశాడు. రామయ్యగారి తల్లి కోడలికి మనమణ్ని చూపించి 'రామికి పురుడుపోసిన పుణ్యాన ఈ మొగమొలక పుట్టింది. పాపం, అది కొడుకును చూచుకోడానికి నోచుకోలేదు. వాణ్నికూడా నీవాణ్నిలా పెంచాలి. ఏం చేస్తావో!' అని ఆశ్వాసంతో ఆశీర్వదించింది.

జగన్నాథం ఈమాటలు విని కుంచించుకుపోయాడు. తాను నిమిత్తమాత్రంగా ఉన్న ఈ సంభవాలకు ఆ మహాతల్లి ఎంత కృతజ్ఞత చూపిస్తోందో ఊహించుకోలేక పోయాడు. ఆమాటలే విని రామయ్య తల్లిమాట నెఱవేర్చగలననే గర్వంతో జగన్నాథం వంక సాదరంగా చూశాడు. సీతమ్మ కీమాటలు మనస్సులో చివుక్కున పొడుచుకున్నాయి.

జగన్నాథంభార్య బ్రతికిఉండగా సీతమ్మకు ఆమెమీద ఒకవిధమైన ప్రేమ ఉండేది. ఆ ప్రేమ చాలామటుకు తనకు ఆమె భక్తిపూర్వకంగా చేసే సపర్యలమూలకంగా వచ్చినది. అదీకాక రామికి తన ఈడే అవడం, అత్తగారు తప్ప తనకు ఎల్లప్పుడూ అందుబాటులో ఇంట్లో ఉండే స్త్రీ అది ఒక్కతే అవడం ఆమెమీద సీతమ్మకు ఏర్పడిన ప్రేమను మఱింత అధికంగా పెంచాయి. అందుచేతనే రామి ప్రసవించే

సమయంలో సీతమ్మ తనకు చేతనైన దానికంటే ఎక్కువగానే సహాయం చేసింది. తానూ, తన భర్తా, తన అత్తగారూ ఎన్నివిధాల ఎంత చేస్తే ఏం లాభం? భగవంతుడు అనుగ్రహించలేదు. జగన్నాథానికీ, జగన్నాథంబిడ్డకూ దక్కకుండా ఆమె ఇహలోకం విడిచి పరలోకానికి వెళ్లిపోయింది.

గోరింక చనిపోవడం దాని దూడమీద జగన్నాథానికి ఉన్న ప్రేమను పెంచింది. గుండెలో జాలిస్వభావం ఉంటే అటువంటి పరిస్థితుల్లో బాధ్యత వహించకతప్పుతుందా? అదేవిధంగా రామి చనిపోవడం ఆమెబిడ్డమీద రామయ్యగారి తల్లికి ఉన్న ప్రేమను అత్యధికంగా పెంచింది. అతనిని పెంచే బాధ్యత అంతా తనమీదే పెట్టుకున్నది. కాని తాను ముదుసలి. ఆమె ఏం చెయ్యగలదు? ఆ ఈడులో, ఆ ఓపికలో ఆమె శక్తి వంచన చెయ్యకుండా వెయ్యికళ్లతో కనిపెట్టుకుని కాపాడుతోంది.

రామి చనిపోవడంవల్ల ఆమెబిడ్డమీద అందరికీ జాలితో కూడిన ప్రేమ ఏర్పడితే సీతమ్మకుమాత్రం అసహ్యంతో కూడిన నిరాదరణ ఏర్పడింది. హృదయపూర్వకంగా తాను చేసిన సేవ నిష్ప్రయోజనమయ్యేటప్పటికి ఆమెలో ఏర్పడిన శూన్యమనస్కత ఈవిధంగా పరిణమించింది. రామి చనిపోయిన మొదటిరెండు రోజుల్లోనూ ఆవిడ జగన్నాథంకొడుకును 'తల్లిని చంపుకున్న వెధవ' అన్నంతకంటే ఎక్కువ హోదాతో చూడలేకపోయింది. ఆమెదృష్టిలో వాడు నష్టజాతకపు వెధవ. వాడి మొహం చూస్తే ఎవ్వరికీగూడా తల్లి దక్కదు. వాడు పుట్టిన వేళావిశేషం మహాచెడ్డది. కుడికాలు పెడితే కులక్షయం, ఎడంకాలు పెడితే వంశక్షయం అన్నట్లుగా వాడు పుట్టి తల్లిని చంపుకోవడమేకాక మిక్కిలి సాధువైన గోరింకను కూడా చంపాడు. ఇటువంటి వెధవ బతికిఉండడం కంటే చస్తేనే నయం. ఈ ధోరణిలో ఊహించి ఆమె మనస్సు అతనిమీది అసహ్యభావాన్ని మరింత గాఢం చేసుకున్నది.

ఇటువంటి పరిస్థితుల్లో రామయ్యగారి తల్లి సీతమ్మకు మనవణ్ని చూపించి అన్న మాటలు ఆమెమనస్సును బాధపెట్టడం ఆశ్చర్యకరమైన విషయం కాదు. అందుకనే ఒకసారి బాధపడడం కంటే ఎక్కువ అనుకూలంగా ప్రత్యుత్తరం ఇవ్వలేకపోయింది. ఆసమయంలో ఆమెలో మాతృత్వం పొంగకపోలేదు. తాను ప్రసవించి మగపిల్లవాణ్ని కన్నది. ఆమె ఇదివరకే ముగ్గురు పిల్లల తల్లి. అయినప్పటికీ ఆమెలోని మాతృత్వం తన ప్రేగుకు సంబంధించినంతవరకే ఉప్పొంగిందికాని తల్లి లేక భావిజీవితపథంలో అడుగడుగునా, క్షణక్షణమూ అంధకారమయంగా కనపడుతున్న జగన్నాథంకొడుకువంక శాఖామాత్రంగానైనా చీలలేకపోయింది.

ఆనాటినుంచీ జగన్నాథంకొడుకును కూడా సీతమ్మపురుటిగదిలోనే చాపమీద పడుకోబెట్టి రామయ్యగారి తల్లి ఇంట్లోపనులు చూచుకుంటూఉండేది. ఆవిడ తనదగ్గర లేకపోతే జగన్నాథంకొడుకు ఎప్పుడూ ఏడుస్తూనేఉండేవాడు. అందుచేత ఎంతపని మీద ఉన్నా ఆవిడ అప్పుడప్పుడు విరామం కల్పించుకుని వాణ్ని ఆడించివెళ్తూఉండేది. తన పక్కనే ఉండి వాడు ఎంత గోలపెడుతున్నా సీతమ్మ వాడి జోలి అంటించుకునేది కాదు; వాడి ఊసు పట్టించుకునేది కాదు. పైగా వాడు తన బిడ్డకు నిద్రాభంగం చేస్తూ ఏడవడంకూడా ఒక తప్పుగానే భావించేది.

రామయ్యగారి తల్లిమనసులో మనవడిమీదకంటే జగన్నాథంకొడుకుమీదనే ప్రేమ మొగ్గ చూపేది. ప్రేమతోడి బాధ్యత మనవడిమీదా, బాధ్యతతోడి ప్రేమ జగన్నాథంకొడుకుమీదా చూపుతూఉండేది. తల్లి చూచుకోగలదనే ధైర్యంతో మనవణ్ని ఆవిడ చూచేదేకాదు. ఎప్పుడో రోజుకు ఒకటిరెండుమాట్లు తన బిడ్డను బుజ్జగించి ముసలమ్మ ప్రొద్దస్తమానమూ జగన్నాథంకొడుకును బుజ్జగిస్తూఉండడం చూచి సహించగలిగేది కాదు సీతమ్మ. ఇదికూడా తల్లిలేని ఆ కుఱ్ఱవాడిమీద సీతమ్మకు అసహ్యభావాన్నే పెంచింది.

నాలుగురోజులు గడిచాయి. రామయ్యకొడుకు తల్లిపాలు తాగుతున్నాడు. జగన్నాథంకొడుకు పెద్దమ్మగారు పోసిన ఆవుపాలు తాగుతున్నాడు.

తాగుతున్నా డన్నమాటే గాని కుఱ్ఱవాడు సరిగా తేరుకోవడం లేదు. అత్తగారు ఎన్ని అన్నా సీతమ్మ వాడివంక చూడనేచూడటం లేదు. ఆరోజు ఉదయం నుంచీ వాడు ఒకేవిధంగా గుక్కపట్టి ఏడుస్తున్నాడు. వాణ్ణి బుజ్జగించడానికి ముసలమ్మ సకల ప్రయత్నాలూ చేసింది. ఎన్ని చేసినా వాడు ఏడుపుమానడం లేదు. వాణ్ణి ముసలమ్మ బుజ్జగించడం చూసి సీతమ్మ 'తల్లిలేని వెధవ! ఏడవక ఏం చేస్తాడు! ఏడ్చిఏడ్చి వాడే ఊరుకుంటాడు. మీరు వాణ్ణి అంతగా అలవాటుచేసుకోకండి' అని కేకలువేస్తూ ఉండేది. తాను చూడకపోగా తనబిడ్డని చూస్తున్న పెద్దమ్మగారిని ఇట్లా అనడం జగన్నాధానికి కష్టమనిపించేది. కాని ఏం చేస్తాడు? సీతమ్మగారు అన్నట్లు తనకూ తనబిడ్డకూ దిక్కులేదు. పూర్తిగా లేదు అనడానికీ వీలులేదు.

సీతమ్మ స్నానం చేసింది. ఆవిడ పురిటిగది దాటి ఇంట్లో ప్రతిచోటా రెండురోజులబట్టే తిరుగుతోంది. వాళ్లకు సహజంగా అంత పట్టింపులేకపోయినా శాస్త్ర కలిగిఉన్నవాళ్లు అవడంచేత రామయ్యగారి ఇంట్లో కొన్ని పెద్దఇళ్ల ఆచారాలు పట్టుపడ్డాయి. అందుచేత ఆవిడ ఇన్నాళ్లూ పురిటిగది దాటలేదు. రామి పోయిన మూడోరోజునే తాను ప్రసవించడం, ఆతర్వాత పురిటిగదిలోనే ఉండిపోవడం కారణాలుగా జగన్నాధాన్ని సీతమ్మ సరిగా చూడ్డానికి అవకాశం కలగలేదు. ఆనాడు ఉదయం ఆమె లేస్తూనే ఆవుపాలు తీసి గోరింకదూడకు పోసి మిగిలిన పాలు తన కుఱ్ఱవాడికోసం ఇంట్లో ఇవ్వాలని వచ్చిన జగన్నాథంవేసిన 'అమ్మగారూ!' అన్న కేక విన్నది. రోజూ ముసలమ్మే అందుకునేది. ఆమెతో జగన్నాథం తన కుఱ్ఱవాణ్ణి గురించి ఏవేవో అంటూ ఉండేవాడు. ఆమె అన్నిటికీ ఆపేక్షతో, జాలిగుండెతో సమాధానాలు చెప్పి అతని అధైర్యం పోగొడ్తూ ఉండేది. ఆనాడు పాలచెంబు అందుకోడానికి సీతమ్మ వచ్చింది. జగన్నాథం ఆమెవంక చూడలేక చెంబు గుమ్మంమీద పెట్టి వెనుదిరిగి వెళ్లిపోయాడు.

జగన్నాధంముఖంలోని దైన్యం ఆమెను ఒక్కసారి నిశ్చేష్టను చేసింది. ఆమెమనస్సులో మానవసంఘంలోని తరతమభావాల త్రొక్కిడివల్ల లేచిన ధూళితో కప్పబడిన కొన్ని ప్రేమాభావాలను రేకెత్తించింది. ఆమె ఒకనిముషం ఆలోచించింది. భార్య పోకముందు జగన్నాథం ఎంత ఉల్లాసంగా ఉండేవాడు! ఎంత పనిచేసినా, మనస్సును కష్టపెట్టే సంఘటనలు ఎన్ని జరిగినా అతని ముఖంలో ఎన్నడూ ఇంత దైన్యం కనపడేది కాదే! జీవితంలో విలువైన వస్తువు పోతే దాంతోపాటు జన్మాదిగా సర్వరక్తనాళాలనూ అంటిపట్టుకున్న ఉత్సాహం కూడా నశించిపోతుందిగాబోలు! అది పోయినదారిని పోక దాని స్మృతిచిహ్నం ఒకటి విడిచిపెడితే అది మరీ బాధాకరం. జగన్నాధంకొడుకు తల్లిని చంపుకున్న వెధవ. బ్రతికిఉన్న తండ్రినికూడా బాధపెడుతున్నాడు. సీతమ్మమనస్సు అంతగా కదిలీకూడా ఆ నిశ్చయానికే వచ్చింది.

ఆనాటినుంచీ జగన్నాధాన్ని చూచినప్పుడల్లా సీతమ్మ జాలిపడుతూనే ఉండేది. ఆ జాలి కలిగినప్పుడల్లా 'భార్యను పోగొట్టుకున్నాడు, పాపం! తోడులేని ఈబ్రతుకు ఎట్లా ఈడుస్తాడో!' అనే ఊహించేది కాని తల్లిలేని బిడ్డను ఏవిధంగా పెంచుతాడో అన్న భావమే తట్టేది కాదు. సీతమ్మ తన బిడ్డను పక్కన పడుకోబెట్టుకుని ఆరోజున సందవేళ గొడ్లపాకకు ఎదురుగా వీధివసారాలో మొఖరానికి ఆనుకుని కూర్చున్నది. సీతమ్మను చూచి గోరింకదూడదగ్గఱ కూర్చున్న జగన్నాథం లేచి బైటికి వెళ్లాడు. జగన్నాథం వెళ్లిపోవడంవల్ల గోరింకదూడ చిలకదగ్గఱకు పోయింది. చిలక దాన్ని చూచిచూచి ఆపేక్షతో దాని ఒళ్లంతా నాకింది. గోరింకదూడ చిలకకు దగ్గఱదగ్గఱగా జరిగి నాకించుకుంటోంది. తన మూతి దానిమూతిదగ్గఱ పెడుతోంది. చిలక దాని ముఖం నాకుతోంది. ఇంతలో రామయ్యగారి తల్లి జగన్నాథంకొడుకుకు పాలుపోసి సీతమ్మకొడుకుపక్కన పడుకోబెట్టి వెళ్లింది. సీతమ్మ వాడివంక చూసింది; గోరింకదూడవంక చూసింది. గోరింకదూడ చిలకయందు మాతృభ్రాంతి పొంది సంతోషిస్తోంది. ఆభ్రాంతికూడా లేక జగన్నాథం కొడుకు ఏడుపు మొదలుపెట్టాడు. సీతమ్మ వాణ్ణి తీసి ఎత్తుకున్నది. వాడు ఏడుపు మానివేశాడు. వాణ్ణి

కింద పడుకోబెట్టింది. వాడు మళ్లీ ఏడుపు మొదలు పెట్టాడు. వాడు ఏడవడం చూసి సీతమ్మకొడుకు కూడా ఏడుపు మొదలుపెట్టాడు. సీతమ్మ తన బిడ్డను ఎత్తుకుని పాలు ఇస్తోంది. జగన్నాథంకొడుకు ఏడుస్తూనే ఉన్నాడు. సీతమ్మమనసులో మానవసంఘపు టూహ ఒకటి పరుగెత్తింది. జగన్నాథం తన ఇంట్లో పాలేరు. తల్లి పాలేమాత్రం పాలేరుకొడుకును తాను పెంచడ మేమిటి? అంతే! ఆనాటికి ఆవిడదగ్గఱ జగన్నాథంకొడుకుఏడుపు అరణ్యరోదన మయింది.

జగన్నాథంమనసులో గోరింకదూడా, తన బిడ్డా ఎట్లా బ్రతుకుతారో అన్న సందేహం నిశితంగా బాధపెడ్తూనే ఉంది. దీనికితోడు చిలకప్రవర్తనకూడా అతని మనస్సుకు బాధాహేతువైంది. గోరింక చనిపోయిననాటినుంచీ చిలక పొలంవెళ్లడం లేదుసరికదా మేతకూడా మెయ్యడం లేదు. ఎప్పుడో ఒకపరక ముట్టబోతుంది. ఆ దేసమయంలో గోరింకదూడ దాని దగ్గఱకు పోతుంది. చిలక వెంటనే గడ్డిపఱక జాఱవిడిచి దూడవైపు తిరిగి తన కళ్లవెంట నీరు కారుస్తూ దానికన్నుల్లో చూచి గాఢమైన ఆపేక్షతో ఒళ్లంతా నాకుతుంది. ఒకప్పుడు కాకపోతే మఱొకప్పుడయినా మేత మెయ్యడానికి పూనుకోదు. కుడితి తాగదు. గోరింకదూడను చూడకపోతే మేతమేస్తుందేమోనని బలవంతాన పలుపూడతీసి గొడ్లతో తోలితే సగం దారిలో వెనక్కి తిరిగి ఇంటికి వచ్చి పాకలో గోరింకదూడదగ్గఱ దాన్ని చూస్తూ నుంచుంటుంది. ఈనబోయేదైన ఆవుగదా! ఎక్కడ చెడిపోతుందో అని దాన్ని బాగా మేపాలని జగన్నాథం ఎంత ప్రయత్నం చేసినా అది మేత మెయ్యడం లేదు. గోరింకతో పాటు ఈనవలసిన చిలక ఇంతవఱకూ ఈనకపోవడం ఇందువల్లనే అనుకున్నాడు జగన్నాథం. అయినా ఒకవేళ మందం చేసిందేమో అని నోరు పగల తీసి ఆవకాయ ఊట పోశాడు. దాంతో దానికి ఏమూలో కాస్త చులుకు తగిలింది. ఆపూట చిలక పొట్టనిండా మేత మేసింది. సాయంత్రానికి ఈనే సూచనలు కనిపించాయి. జగన్నాథం చాలా జాగ్రత్తగా కనిపెట్టుకు కూర్చున్నాడు.

ఆరోజు మంచిరోజు అవడంచేత రామయ్య తన కుమారునకు నామకరణ మహోత్సవం చేసుకున్నాడు. ఊళ్లో అమ్మలక్కలందఱూ పేరంటానికి వచ్చారు. రామయ్యకొడుకును చూచి మర్యాదతో సంతోషించారు. జగన్నాథంకొడుకును చూచి జాలి పడ్డారు. వాడికి ముసలమ్మ చేసే పరిచర్యను చూచి ఆమెఔదార్యాన్ని ప్రశంసించారు. వీటివల్ల సీతమ్మ మనసులో ఈర్ష్యాసూయలూ, ప్రేమతరంగములూ కలిసి కొట్టుకున్నాయి.

చీకటిపడింది. జగన్నాథం దీపం పెట్టుకుని చిలక దగ్గఱ నిరీక్షిస్తూ కూర్చున్నాడు. ప్రొద్దుగ్రుంకినప్పటి నుండీ పిల్ల లిద్దఱూ ఏడుస్తూనే ఉన్నారు. ఇంట్లో ఉక్కపోసి ఏడుస్తున్నారేమో అని ముసలమ్మ వంట చేసుకుంటూ పిల్లల్ని పెట్టుకుని సీతమ్మను వీధిసావరాలో కూర్చోమన్నది. సీతమ్మ తన బిడ్డనుమాత్రం తీసుకుని వాకిట్లోకి వెళ్లింది. ఇంట్లో ఉండి చూచే వాళ్లు ఎవళ్లూ లేక జగన్నాథంకొడుకూ ఏడుస్తున్నాడు. తల్లిఒడిలో ఉండి సీతమ్మకొడుకూ ఏడుస్తున్నాడు. అంత పనితొందఱలోనూ ముసలమ్మ తీఱుబాటుచేసుకుని పిల్ల లిద్దఱికీ ఇంత ఉప్పూ మిరపకాయలూ దిష్టితీసి పొయ్యిలో పోసింది. కొంచెంసేపు పిల్లలిద్దఱూ ఊరుకున్నట్టే ఊరుకున్నారు. కాని మళ్లీ వెంటనే సుక్కపట్టి ఏడవడం మొదలుపెట్టారు.

చిలక మామూలుకంటె భిన్నంగా కష్టపడటం చూసి గోరింకదూడ అరవడం మొదలుపెట్టింది. జగన్నాథం దాన్ని దగ్గఱకు తీసుకుని తలమీద చేత్తో నిమురుతూ కూచున్నాడు. తన కొడుకు పాలుతాగుతూ ఏడుపుమానడంవల్ల సీతమ్మ గొడ్లపాకవంక సావకాశంగా చూస్తోంది. చిలక పడుతున్న కష్టం చూచి తాను పడ్డ కష్టం జ్ఞాపకంరాగా ద్రవించిన మనస్సుతో సాదరమైన దృక్కులు ప్రసరిస్తూ చూస్తోంది. ఇంతలో చిలక అతికష్టమ్మీద ఈని పెయ్యదూడను పెట్టింది. జగన్నాథం దూడను చేత్తో పట్టుకుని కిందపెట్టి గిట్టలు గిల్లాడు. వరిగడ్డితో దాన్ని తుడిచి తల్లికి అందించాడు. క్రొత్తవడ్లు చేటలో పోసి తెచ్చి దూడగిట్టలు దాంతో కలిపి చిలకచేత తినిపించాడు. ఈలోగా వళ్లుతడిఆఱడం

చేత చిలకదూడ లేచినుంచుంది. కొత్తదూడను చూడడంతోటే గోరింకదూడ పరుగెత్తుకుని వచ్చి చిలక దగ్గిర నుంచుంది. చిలకావు ఎక్కడలేని ప్రేమతో రెండు దూడలనూ నాకింది. గోరింకదూడమీద చిలకావు చూపిస్తున్న ప్రేమనుచూచి సీతమ్మ ఆశ్చర్యపోయింది. జగన్నాధం చనిపోయిన గోరింకనూ, తనభార్యనూ జ్ఞాపకం చేసుకుంటున్నాడు. గోరింకదూడ చిలకావు పొదుగుదగ్గిర ముట్టిపెట్టి పాలుకుడువబోయింది. చిలక ఊరుకుంది. గోరింకదూడను చూసి చిలకదూడకూడా మరొకరు చెప్పకుండానే తల్లిపాలు తాగడం నేర్చుకున్నది. రెండుదూడలూ స్వేచ్ఛగా తల్లిపాలు తాగుతున్నాయి.

జగన్నాధం ఆదృశ్యాన్ని తన్మయుడై చూస్తున్నాడు. అతని మనస్సులో అనేకభావాలు పరుగెత్తాయి. తనబిడ్డనుగూడా ఎవరో వక్షానికి అదుముకుని పాలుఇస్తున్నట్లు తోచింది. కొడుకుఏడుపు వినబడకపోవడంచూసి వెనక్కి తిరిగాడు. అతనికి కనబడిన దృశ్యం అతన్ని ఒకక్షణం నిశ్చేష్టుణ్ని చేసింది. ఆనందమో, గౌరవమో, కృతజ్ఞతో ఏమిటో అతన్ని స్వర్గవీధుల్లోకి ఎత్తుకుపోయింది. ఆ తన్మయత్వంలో అతడు అకస్మాత్తుగా చేతులుజోడించి 'సీతమ్మతల్లీ! నువ్వు నాబిడ్డకే కాదు, నాకు గూడా తల్లివి' అని నేలమీదపడి నమస్కారం చేశాడు.

---

## ఆంధ్రాభ్యుదయము



శ్రీ భైరవరసు సుందరరామారావుగారు, యం. యస్. సి.

'స్టడీస్ ఇన్ రామన్ ఎఫెక్ట్' అనే విషయంమీద తయారుచేసిన విమర్శకవ్యాసానికి (Thysis) ఆంధ్ర విశ్వవిద్యాలయమువారు వీరికి డాక్టర్ ఆఫ్ సైన్సు బిరుదమునిచ్చి సత్కరించిరి.



# విమర్శనము

### పాతమంగలి
### తోకచుక్క

ఈ రెండూ చెరి ౮౦ పుటలకు మించని చిన్న గ్రంథాలు. 'చక్రపాణి'గారి రచనలు. మొదటిదాంట్లో పాతమంగలీ, అహంబ్రహ్మాస్మి, విడాకులవిదియ, కాకి-వక్క, ఉగ్గుబాలసంస్కారం, రజ్జుసర్పం, అమాయకపు పిల్లలు, లంచగొండి, స్లిడరిజమ్ VS రాడీయిజమ్, దివ్యదృష్టి, ప్రకృతిపురుషుడు అనేకథలున్నూ; రెండోదాంట్లో తోకచుక్క, ప్రేమపాదరక్ష, వెంకటచెలంపేట, మహానియంత, దోమదాడి, కొమ్మ, అసంపూర్తిరచన, ఉత్తరుడు అనే వ్యంగ్యరచనలున్నూ ఉన్నాయి.

ఈ రెండుపుస్తకాలూకూడా హిందీ, బెంగాలీ, అరవము, కన్నడము మున్నగు ప్రాంతీయభాషల్లోకి అనువదింపదగ్గవి అని చెప్పితే చాలుననుకొంటూ ఇవి ఇంతా అంతా బాగున్నాయి అనకుండా. ఒక్కొక్కటి వెల పండ్రెండణాలు. యువప్రచురణలు.

---

### హాంపీకన్యలు
### మంగమ్మ

ఈ రెండూ చలంగారి గ్రంథాలు. మొదటిది కథల పుస్తకం. ఇందులో హాంపీకన్యలు, ఎరికలమ్మ, జెలసీ, దెయ్యమేనా అనేకథ లున్నాయి. వీటిలో జెలసీ అనేది చాలా ఉత్తమరచనక్రింద కనిపిస్తోంది. తక్కినవి చలంగారి మామూలుధోరణిలో నడిచాయి. మంగమ్మ అనేది నాటకం. దానిలోకూడా ఉత్తమమైన శిల్పప్రతిభ ఉంది. కాని, చివరి పదిపేజీలూ చాలా అనవసరం అనిపిస్తున్నాయి. కామాక్షీనారాయణరావున్నీ మంగమ్మాసుందరేశయ్యలు ఒకగదిలో చూట్టంతోనే నాటకం 'అసలు ముగింపు అయిపోతోంది. తక్కింది అనవసరప్రసంగం. అస్తు. ఏమైతేనేం? వ్యావహారికపుభాష చలంగారి కలానికి లొంగినంతగా మరెవరికీ లొంగలేదా అనిపిస్తుంది: భాషయొక్క స్వచ్ఛప్రవాహాన్ని గమనిస్తే. మొదటిదానివెల పండ్రెండుఅణాలు; రెండోది రూపాయి. యువప్రచురణాలు.

---

### వనఫూల్ రచనలు

డాక్టరు బొలైచాంద్ ముఖోపాధ్యాయ అనే ఆయన మారుపేరే వనఫూల్. ఈయన శరత్ చటర్జీతరువాత చెప్పుకోదగినవాడు. ఉత్తమోత్తమాలయిన నవలలు ఈయనవి చాలా ఉన్నాయి. వాటి నన్నిటినీ వదిలి ఇందులో ఆయనవి తక్కువరకపురచనలు ఎనిమిది సేకరించబడ్డాయి. అయితేనేం, చదివి ఆనందింపదగ్గవే. శ్రీ చంద్రశేఖరబోస్ అనే పరశురాంగారి 'సిద్ధేశ్వరీలిమిటెడ్' అనే ఉత్తమరచనకూడా ఇందులో ఉంది. చక్రపాణిగారి అనువాదం. యువప్రచురణ. వెల పదిరెండుఅణాలు.

---

### బడదీదీ
### పల్లీయులు

ఈ రెండూకూడా శరత్ చటర్జీగారి కృతులు; చక్రపాణిగారి అనుకృతులు. ఇంత మంచికథలు చటర్జీగారే రాయగలరన్న పేరు మూలకారుడికిన్నీ, ఇంత చక్కటి అనువాదం చక్రపాణిగారే చెయ్యగలరన్న పేరు అనువాదకులకున్నూ ఉంది. మొదటిది చాలా ఉత్తమోత్తమమైన అనువాదం. రెండోది చాలా తొందర్లో చేసినట్టు కనిపిస్తోంది. మొదటిపుటలో ఉన్న 'చట్టీ' అనే పదమున్నూ, చివరి పుటలో ఉన్న 'దురదృష్టురాలు' అనే పదమున్నూ సంస్కారాన్ని వాంఛిస్తున్నాయి. రెండోపుస్తకంలో బ్రాహ్మణ

పాత్రలచేత అబ్రాహ్మణగ్రామ్యం మాట్లాడించటం ప్రక్రమభంగం. ఈనెరసులను వదిలేస్తే: మూలంలో గ్రంథాల్ని చదివితే ఎంత ఆనందం కలుగుతుందో అనువాదంకూడా అంత ఆనందాన్నే ఇస్తుం దని చెప్పవచ్చును. ఈరెండూకూడా ద్వితీయముద్రణాలు. యువప్రచురణాలు. మొదటిదానివెల పంద్రెండు అణా లు; రెండోది రూపాయిన్నర.

---

## మూరు పేర్లు

ఈ కథ కొడవటిగంటి వారిది. భారతిలోంచి పునర్ముద్రితం. ఇంతచక్కటికథ ఈ మధ్య తెలుగులో రాలేదనుకుంటాను. ఎవరైనా ఎప్పుడైనా సరే వీలు చేసి చదివి ఆనందింపదగ్గ రచన. తరువాత ఇందులో 'సినిమాతార' అనే చిన్నకథ ఒకటి ఉంది కొస రుగా. వెల పంద్రెండు అణాలు. యువప్రచురణ.

---

## మూగజీవాలు

ఇది మా. గోఖలేగారి రచన. ఇందులో పన్నెం డు చిన్నకథలు మూగజీవాలకు భాష ఇచ్చి మాట్లా డించే ప్రయత్నంలో వ్రాయబడ్డాయి. కథావైచిత్ర్యం ఏమీ అంతగా చెప్పుకోదగిందిలేదు. అయితే నిర్దో ష్యయూ, అచ్చతెలుగూ, శతావధానమూ మొదలైనవి ఎంతప్రయాసతో కూడుకున్నవో, వీరు వ్రాసిన భాష కూడా అంతప్రయాసతో నిండింది. అయితేనేం, ఈ భాష వీరికి లొంగింది. ఇదే భాషలో ఇంకా ఉత్త మోత్తమమైన రచనలు వీరు వ్రాస్తారని నా ఆకాంక్ష. ఇదికూడా యువప్రచురణే. వెల పంద్రెండు అణాలు.

'X'

---

## శ్రీరామకృష్ణప్రభ

సంపాదకులు : శ్రీ నిర్వికల్పానందస్వామిగారు. ప్రకటనకర్తలు : శ్రీ అద్వయానందస్వాములవారు, శ్రీ రామకృష్ణమఠము, మైలాపూరు, మద్రాసు. సంవత్స రం చందా రు. ౩-౦-౦.

క్రొత్తగా వెలువడిన ధార్మికవిషయిక మాస పత్రిక ఇది. కేవలం ధర్మమునుగురించి ప్రచారము చేయు పత్రికలు మన దేశమునం దంతగా లేవు. ఆ కొరత దీనివల్ల తీరవచ్చు. సంపాదకులును భారతీ పాఠకులకు చిరపరిచితులు. పూర్ణానంద యను పేర మన ప్రాచీన ఆస్తికార్ష శాస్త్రముల సారమును ఆంధ్రలోకమునకు వెల్లడించిరదే యున్నారు. ఇప్పుడు వీరు ఆ ధార్మిక విషయములను-ముఖ్యముగా శ్రీరామకృష్ణపరమహంస ప్రతిపాదితములైన ధార్మికరహస్యములను ఈపత్రిక ద్వారా వివరముగా ఆంధ్రుల కందింప చేయబూను కొనుట ముదావహము.

ఈ ప్రథమ సంచికయందలి వ్యాసరచయితలం దరూ పేరెక్కిన మహాకవి సమ్రాట్టులూ, శతావధా నూలూ, సర్ సర్వేలూనూ. వీరిరచనల గురించి వ్రాయ వలసినదేముందీ ?

ఆధునిక వైజ్ఞానిక, అతిప్రాచీన వైదిక ధర్మ ముల సమన్వయ సాధకములను వసంతవ్యాసములవంటి వాని కింద ఎక్కువ చోటు వుంచాలి.

వర్తమాన పరిస్థితులవల్ల సంపూర్ణానుభవము లేని ప్రాజ్ఞులకే అనేకులకు ధార్మికరహస్యములందు సంశయము లుత్పన్నములుగా వాటిని సమర్థించుకొన జాలక తటపటలాడుతున్న రోజులివి. అట్టివారికంద రకూ ఈపత్రిక మార్గదర్శకము కావలెనని మాకోరిక. శ్రీ రామకృష్ణప్రభ స్వకాంతిపుంజములను ఆంధ్ర దేశమునందంతట ప్రసరింపజేసి అవిద్యాంధకార మును పటాపంచలు చేయుగాక.

---

## గ్రంథ స్వీకారము

---

### రజనీప్రియ

రచయిత : గుంటూరు సత్యనారాయణగారు, యం. ఏ., ప్రాప్తిస్థానము: జి. వి. సుబ్బారావుగారు, యలమంచిలి. వెల రూ. ౧-౮-౦.

### క్రామేడ్ వెంగమ్మ

గ్రంథకర్త: యడ్లపల్లి కోటయ్యగారు. ప్రాప్తి స్థానము : పి. వి. పి. యల్. నరసింహారావుగారు, పయనీరుస్టోర్సు, తెనాలి. వెల రూ. ౧-౪-౦.

### కుసుమాంజలి

వివిధ రచనల సంపుటి. ఏలూరు జాతీయరచనా మండలివారి ప్రచురణ. వెల ౧౦ అణాలు.

### వాసవదత్త

గ్రంథకర్త : శిరోమణి సన్నిధానము సూర్య నారాయణ శాస్త్రిగారు, ౮౮ జీరా, సికింద్రాబాదు. వెల రూ. ౧.

---